# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక



ANDHRA PATRIKA
ILLUSTRATED WEEKLY

4 అణాలు
5-12-'56

## క థా ర చ యి త ల కు మ హ ద వ కా శ ం

## సంక్రాంతికి ప్రత్యేకాకర్షణ!

# డిటెక్టివ్ కథలపోటీ



## మొదటి బహుమతి రూ. 50/-

## రెండవ బహుమతి రూ. 30/-



★ రాబోయే సంక్రాంతికి ఆంధ్ర వారపత్రిక ప్రత్యేకసంచికగా (16-1-57) వెలువడు తుంది ఈ సందర్భంలో డిటెక్టివ్ కథలపోటీ నిర్వహిస్తున్నాము ఈ పోటీలో పాల్గొనవలె నని రచయితలను ఆహ్వానిస్తున్నాము

మొదటి స్థానం పొందిన కథకు రూ 50/-

రెండవ స్థానం పొందిన కథకు రూ 30/- బహూకరిస్తాము

★ కథలు తెలుగు దేశానికి సంబంధించినవే అయి వుండాలి

★ కథ పరిమితి వార పత్రికలో నాలుగు పేజీలకు తగ్గకుండా, ఐదు పేజీలకు మించ కుండా వుండాలి

★ పోటీలో గెలిచిన కథలను సంక్రాంతి ప్రత్యేక సంచికలో ప్రకటిస్తాము కథలు డిసెంబరు 26 వ తేదీ లోగానే మా కార్యాలయానికి చేరాలి ఆ తరవాత వచ్చిన కథలు పోటీకి స్వీకరింపబడవు రచనపై "డిటెక్టివ్ కథల పోటీకి" అని స్పష్టంగా వ్రాయాలి

★ పోటీలో స్త్రీ పురుష రచయిత లెవరైనను పాల్గొనవచ్చును కథలపై తుదినిర్ణయం సంపాదకులదే

★ రచయితలు ఈ మహదవకాశాన్ని వినియోగించుకొని మా ప్రయత్నం జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము

★ సంక్రాంతి సంచికకు పంపించగోరే ప్రత్యేకవ్యాసాలు, కథలు, నాటికలు, పద్యాలు, చిత్రాలకు కూడా డిసెంబరు 26 వ తేదీయే గడువు

సంవత్సర చందా
రు 12-0-0
విడిపత్రిక 4 అ



సచిత్రవారపత్రిక

Founder K NAGESWARA RAO

సంపుటము 51
సంచిక 14
5-12-56

దుర్ముఖ మార్గశిర శుద్ధ తృతీయ బుధవారం

# *వనితలకు విజ్ఞప్తి*

## ముగ్గుల పోటీ! బహుమతి రూ. 20/-



## వ్యాసాల పోటీ! బహుమతి రూ. 20/-

# *సంక్రాంతికి మరొక ఆకర్షణ*

ముగ్గుల పండగ సంక్రాంతి వస్తోంది. ఆనాడు తెలుగుదేశంలో తెల్లవారేసరికల్లా ఇంటింటి ముంగిటా ముత్యాల ముగ్గులు, ముగ్గుల మధ్య బంతిపువ్వులు తురిమిన గొబ్బిళ్లు ప్రత్యక్షమవుతాయి. తెలుగు పడుచులకు ముగ్గులు పెట్టటం ఉగ్గుతో పెట్టిన విద్య

ఈసారి ఆంధ్ర వారపత్రిక సంక్రాంతి ప్రత్యేక సంచికలో వనితలకు ముగ్గుల పోటీ నిర్వహించదలిచాము. అన్నిటికంటె ఉత్తమమైన ముగ్గుచిత్రానికి రూ. 20/- బహూకరిస్తాము. స్త్రీలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి.

శుభ్రమైన దళసరి డ్రాయింగు కాగితం (10 × 8 అంగుళాలు) మీద, తుడుపులు గిడుపులు లేకుండా నీటుగా చిత్రించాలి. ఆ బొమ్మను బ్లాకు చేయడానికి వీలుగా ఇండియన్ ఇంక్‌తో మాత్రమే వేసిపంపాలి. ముగ్గుల బొమ్మలు మా కార్యాలయానికి డిసెంబరు 26 వ తేదీలోగానే చేరాలి.

ముగ్గు ఎలా వేయాలో చిన్న వివరణ కూడా వ్రాసి పంపితే అది చూచి నేర్చుకోదలచిన వారికి సహాయకారిగా ఉంటుంది. అవసరమైతే ఆ వివరణలో కూడా చిన్నసైజు బొమ్మలు వేయవచ్చు.

* * *

*సంక్రాంతి ముగ్గుల పండగే కాదు; ముస్తాబుల పండగ కూడాను. ఆడవారికి అలంకరణ ప్రియత్వం సహజం. పాతకాలపు అలంకరణ పద్ధతులుపోయి, కొత్త కొత్త ఫేషన్లు వస్తున్నాయి

"స్త్రీలు: అలంకరణ; పాత కొత్తల పరిశీలన" అనే విషయంపై రాబోయే సంక్రాంతి సంచికలో వ్యాసాల పోటీ నిర్వహిస్తున్నాము. ఈ పోటీలో కూడా స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. విషయాన్ని సమగ్రంగా చర్చిస్తూ, వారపత్రికలో రెండు పేజీలకు తగ్గకుండా మూడు పేజీలకు మించకుండా వ్యాసం వ్రాయాలి. వ్యాసాలకు కూడా డిసెంబరు 26 వ తేదీయే గడువు

**ఉత్తమ వ్యాసానికి రూ 20/- బహూకరిస్తాము. పోటీలో తుది నిర్ణయం సంపాదకులదే.**

రచయిత్రులు మా సంకల్పం జయప్రదం కావడానికి తోడ్పడతారని మా నమ్మిక.

—ముఖచిత్రం: గీతాబాలి.

# శ్రీరామ రక్ష

ఆంధ్రప్రదేశ్ శాసనసభ తొలి సమావేశం డిసెంబరు 3వ తేదీన జరగబోతున్నది. రాష్ట్రం ఏర్పడిన నెలరోజులకు రుగుతున్న ఈ ప్రథమ సమావేశంలో శాసన ర్మాణ కార్యక్రమమేదీ వుండదు. హైదరాబాదురాష్ట్ర విచ్ఛిత్తితో హైదరాబాదు సనసభ కూడా విచ్ఛిన్నమైంది. కాబట్టి తిన ఆంధ్రప్రదేశ్ శాసన సభ్యులుగా తెలంగాణా జిల్లాల శాసనసభ్యులందరూ ప్రమాణ స్వీకారం చేయవలసి వుంటుంది. ఈ 3-వ సమావేశం కాగానే సభకు తాత్కాలిక అధ్యక్షుణ్ణి ఎన్నుకుని తెలంగాణా వారి చేత సభ్యత్వ ప్రమాణాలు స్వీకరింపజేయడం రుగుతుంది. మరుసటిరోజు సభాపతిని న్నుకుంటారు. తర్వాత ఆంధ్రప్రదేశ్‌కు గువ శాసనసభ (లెజిస్లేటివ్ కౌన్సిల్)ను ర్పాటుచేసే విషయమై చర్చ జరిపి ఒక ర్ణయానికి వస్తారు. అంతటితో మూడు జుల కార్యక్రమం ముగుస్తుంది.

కొన్ని కొత్త రాష్ట్రాలలో ఎగువ శాసన భలు వుండబోతున్నవని రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ శాసనం ద్వారా పార్లమెంటుముందే ర్ణయించింది. మరికొన్ని రాష్ట్రాలలో గువ సభలు అవసరమో కాదో నిర్ణయించు నే బాధ్యతను ఆయా రాష్ట్ర శాసనసభలకే దలివేసింది ఈ విధంగా వదలివేసిన ష్ట్రాలలో ఆంధ్ర ప్రదేశ్ ఒకటి

ఎగువ శాసన సభలవల్ల అట్టే ప్రయోజన మీ లేదనీ, శాసన నిర్మాణ కార్యక్రమాన్ని అనవసరంగా ఆలస్యం చేయడానికి మాత్రమే ఎగువసభలు సహాయపడుతవనీ ఒక వాదన లేక పోలేదు. అయినప్పటికీ ర్వత్రా ఎగువ సభలు పూర్తిగా నిరుపయోగమైనవని చెప్పడం సాహసమే అనిపించుకుంటుంది. రాష్ట్రాలు చిన్నవైనప్పుడు ఎగువ సభలను భరించే ఆర్థిక స్తోమతు వాటికివుండక పోవచ్చు. ఆ సందర్భంలో ఎగువ సభ బరువు చేటుకావచ్చు విశాలమైన ఆంధ్ర ప్రదేశ్‌కు ఎగువసభ వుండడమే యోగ్యమనిపిస్తుంది. రాష్ట్ర సనసభ్యులు తదనుగుణంగానే నిర్ణయిస్తారనీ, ఈ నిర్ణయాన్ని కేంద్ర ప్రభుత్వం మోదిస్తుందనీ ఆశిద్దాం.

* * *



ఈ మధ్య జరిగిన రైలుప్రమాదాలకారణంగా రాజీనామానిచ్చిన రైల్వేశాఖ మంత్రి లాల్ బహదూర్ శాస్త్రి.

ఇకపోతే సభాపతి ఎన్నిక విషయం. కొత్త రాష్ట్రాలలో కొత్త సభాపతులను ఎన్నుకోవలసి వుంటుందనికూడా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ శాసనం ఆదేశించింది. నవంబరు 1-న జరిగిన రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణలో పాత శాసన సభాపతుల స్థానాలన్నీ రద్దయిపోయినవి అందరితోపాటు ఆంధ్ర శాసన సభాపతి స్థానంకూడా రద్దయిపోయింది. ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ పార్టీ ఎవరిని ఈ స్థానానికి తమ అధికార అభ్యర్థిగా నిర్ణయిస్తుందో తెలియదు. ఇది కాంగ్రెస్ శాసన సభ్యులు వివిధమైన అభిప్రాయ భేదాలకూ ఎడమివ్వకుండా ఏకగ్రీవమైన నిర్ణయానికి రావలసినవిషయం. అధికార అభ్యర్థిగా ఎవరిని నిర్ణయించినా, తామకూడా పోటీచేయాలని మాజీ సభాపతి శ్రీ రొక్కందొర అభిప్రాయపడుతున్నట్లు తెలియవస్తున్నది. సభాపతి స్థానంలోవుండే వ్యక్తి శాసనసభలోని వివిధవర్గాల, వివిధ పక్షాల ఆదరాభిమానాలకు, విశ్వాసానికీ పాత్రుడై వుండడం అవసరం. కాంగ్రెస్ పక్షంవారు ఈ ప్రాథమిక సూత్రాన్ని దృష్టిలో పెట్టుకొని సముచితమైన నిర్ణయానికి వస్తారో, లేక, ఈ ఎన్నికలో లేనిపోని రభస చేసి రచ్చగొడతారో చూడాలి

* * *

శేషో మాపో మంత్రివర్గ విస్తరణ జరగడం ఖాయమేనని తేలుతున్నది. ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డికీ, ఆంధ్ర మాజీముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డికీ నవంబరుమూడోవారంలో రాజధానిలో దీర్ఘ సమాలోచనలే జరిగినవి. సమాలోచనలకు ముంగే శ్రీసంజీవరెడ్డి తమకు మాజీ ముఖ్యమంత్రి సహకారం అవసరమనే నమ్మకానికి వచ్చినట్లు కనబడుతుంది. ఉభయులమధ్యా ఏదో విధంగా రాజీ కుదర్చడానికి హైదరాబాదు మాజీ ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణరావు కూడా గట్టిప్రయత్నమే చేసినట్లు అమధ్య వచ్చిన వార్తలు తెలియజేసినవి.

సమాలోచనలు జరపడానికి వచ్చినప్పుడు శ్రీ గోపాలరెడ్డిగారి శ్రీ సంజీవరెడ్డిగారి నివాసంలోనే మకాంచేస్తారని మొదట అనుకున్నారు గాని, అలా జరగలేదు. వారు ప్రభుత్వ అతిథిగృహమైన 'లేక్ వ్యూ' భవనంలోనే విడిగా బస చేశారు; సంప్రదింపులు జరిపారు. సంప్రతింపుల పర్యవసానంపై తమ తమకుని నిర్ణయాన్ని నవంబరు 25 నాటికి లేఖ ద్వారా తెలియజేస్తామని మాటయిచ్చి నెల్లూరుకు తిరిగివచ్చిన శ్రీ గోపాలరెడ్డిగారు అన్న మాట ప్రకారం ముఖ్యమంత్రికి వర్తమానం అందజేశారు ప్రస్తుతం వస్తున్న వార్తలనుబట్టి వీరు మంత్రివర్గంలో తప్పక చేరేసూచనలే కనుపిస్తున్నవి. ఇక కొన్ని రోజులలోనే వీరు పదవిని స్వీకరిస్తారు. ఉభయులకూ ఏ పద్ధతిమీద రాజీ కుదిరిందో తెలియదు మంత్రివర్గంలో చేరడమంటూ జరిగితే, ఒక్క శ్రీ గోపాలరెడ్డే చేరరు. సర్కారు జిల్లాలనుంచి మరొకరూ, తెలంగాణానుంచి మరొకరూ కూడా చేరవలసి ఉంటుంది. అనుభవజ్ఞులైన శ్రీ గోపాలరెడ్డిగారు మంత్రిమండలిలో చేరడం సర్వత్రా హర్షించదగిన విషయం.

* * *

వాణిజ్య పన్నులను ప్రభుత్వం ఇంకా కట్టుదిట్టంగా వసూలుచేస్తే, సులభంగా మరో రెండుకోట్ల ఆదాయం ప్రభుత్వానికి వస్తుందంటున్నారు ఆర్థికమంత్రి శ్రీ కళా వెంకటరావు. ఇప్పుడు ప్రభుత్వానికి వస్తున్న ఆదాయాన్ని వీలైనంత ఎక్కువ చేసి ప్రజాభ్యుదయ కార్యక్రమాలకు వినియోగించడానికి కృషిచేయాలని కూడా వీరి అభిప్రాయం. అభిప్రాయమైతే మంచిదే ఎంతవరకు ఆచరణ సాధ్యమన్నదే ప్రశ్న. వాణిజ్య పన్నుల వసూలును కట్టుదిట్టం చేయాలనే ఆలోచన ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పటినుంచీ మంత్రులు చెబుతున్నదే. క్రియ మాత్రం శూన్యం పూరూరా, పల్లె పల్లెనా వాణిజ్యపు పన్నులను జాగ్రత్తగా

# ఆంధ్రప్రదేశ్ సిరిసంపదలు

నాలుగువందల ఏళ్లనాడు విడిపోయిన తెలుగునాడు మళ్లీ ఈనాటికి ఏకమైంది. 3,12,68,801 తెలుగువాళ్ల సమష్టి కుటుంబం ఏర్పడింది.

వేరే వేరే ఉన్న వీరూ వారూ ఇప్పుడు కలుసుకుని పాటుబడితే పెరట్లో గాదె నిండగా, ఇరుగుపొరుగిళ్లకీ, ఊళ్లకీ పంపడానికి బోలెడుపంట మిగులుతుంది.

రాబడి ఖర్చులు జేరీజువేస్తే నాలుగు కోట్ల చిల్లరలోటు తేలినా, ఒక్క నిముషం అవి అలా ఉంచి, ఉన్న సిరిసంపదల వంక చూస్తే, సమృద్ధి అనేది సర్వత్రా గోచరిస్తుంది.

## పంటలు

ఇరవై జిల్లాలమీద లెక్క వేసిచూస్తే, మొత్తం భూమివైశాల్యం 681 లక్షల ఎకరాలు. ఇందులో సాగుబడిక్రింద ఉన్న భూమి 267 లక్షలు. (తెలంగాణాలో భూమి 114 లక్షల ఎకరాలు) ఇందులో వరిపండేది 95 లక్షల ఎకరాలుంది. ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద పండేవరి 30 లక్షల 32 వేల టన్నులు. (తెలంగాణా పంట ఐదు లక్షల పైచిలుకు) రాష్ట్రం అవసరాలు పోను మనం ఏడులక్షల టన్నులవరకూ ఎగుమతి చెయ్యవచ్చు.

వరి తరవాత మనం ఘనంగా చెప్పుకో తగ్గ వాటిలో పొగాకు ముఖ్యం. దేశం మొత్తంమీద ఆంధ్రదేశం ఇందులో అగ్రస్థానం. ఆంధ్రప్రదేశ్ పేరు చెప్పి మొత్తం 366 వేల ఎకరాలలోను 106 వేల టన్నుల పొగాకు (తెలంగాణాలో 8500 టన్నులు) ఉత్పత్తి అవుతుంది. ఎగుమతి అయేది 72 వేల టన్నులపై చిలుకు.

మిగతా ఉత్పత్తులు (ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద).

కాయధాన్యాలు 64 లక్షల 37 వేల టన్నులు. (తెలంగాణా 11 లక్షల 15 వేలు)

పప్పు దినుసులు రెండు లక్షల 95 వేలు (తెలంగాణా 157 వేలు)

వేరుశనగ 8 లక్షల 33 వేలు (తెలంగాణా 2 లక్షల 42 వేలు)

మిర్చి లక్షా 49 వేల టన్నులు (తెలంగాణా 15 వేలు)

ఉల్లిపాయలు లక్షానలభైవేల టన్నులు (తెలంగాణా 37 వేలు)

ప్రత్తి 184 వేల బేళ్లు (తెలంగాణాలో 39 వేలు); నూలు 162 లక్షల 26 వేల పౌనులు (తెలంగాణా 138 లక్షల 26 వేలు) నూలులోగే, రేయన్ నూలులోనూ, వస్త్రంలోనుకూడా తెలంగాణాదే పై చెయ్యి. రేషుకా నూలు 26 లక్షల పౌనులు, వస్త్రం తొమ్మిది లక్షల 39 వేల గజాలు.

చెరకు పంట 4 లక్షల 96 వేల టన్నులు (తెలంగాణా 176 వేల టన్నులు).

కాగితం 3 లక్షల 8 వేల క్వైర్లు (తెలంగాణా 2 లక్షల 68 వేలు). సిగరెట్లు తెలంగాణాలో 473 కోట్ల 70 లక్షలు తయారవుతాయి.

## ఖనిజాలు

మాంగనీసు మైకాలలో ఆంధ్రదీ, బొగ్గులో తెలంగాణాదీ పైచెయ్యి.

సాలుకు 63,555 టన్నుల మాంగనీసు, 87,43,000 టన్నుల మైకా, 175 వేల టన్నుల సిమెంటు 8 వేల టన్నుల బారిటిస్ ఆంధ్రలో లభిస్తాయి.

తెలంగాణాలో గనులు సాలుకు 15 లక్షల 29 వేల టన్నుల బొగ్గును ఇస్తున్నాయి చెప్పుకోతగినంతగా ఇనుము, సున్నపురాయి మొదలైనవి లభిస్తాయి.

## శక్తి

ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 15 కోట్ల 5 లక్షల వాట్లు. (తెలంగాణాది 6 కోట్ల 83 లక్షలు).

రెండవ ప్రణాళిక క్రింద తలపెట్టిన లక్ష్యం 28 కోట్ల 56 లక్షలు (తెలంగాణా 8 కోట్ల ఒక లక్ష).

ప్రస్తుతం సగటున తలసరి వాడకం ఆంధ్రలో 8 వాట్లు తెలంగాణాలో 5 వాట్లు రెండవ ప్రణాళికక్రింద లక్ష్యం ఆంధ్రలో 20 వాట్లు, తెలంగాణా 8 వాట్లు.

దుక్కిటెద్దుల శక్తిని పరిశీలిస్తే ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద 128 లక్షల 28 వేలఎద్దులున్నాయి. (తెలంగాణాలో 65 లక్షలు)

## శ్రీరామరక్ష

వసూలు చేస్తే, రాబడి పెరగవచ్చు. దాని వసూలుకు ప్రభుత్వ యంత్రాంగాన్ని ఎంత విరివిగా పెంచవలసి వుంటుంది? ఈ యంత్రాంగ నిర్మాణానికి ఎంత ఖర్చు చేయవలసి వుంటుంది? చివరకు సాహెబు బేం బూబు పుట్టుపోగులకు సరిపోకుండా చూసుకోవాలి.

27-11-56

[భార్గవ]

## రాబడి, ఖర్చు

1956-57 బడ్జెట్ పరిశీలిస్తే ఆంధ్రప్రదేశ్‌కు మొత్తంమీద ఖర్చు 47 కోట్ల 19 లక్షల రూపాయలూ, రాబడి 43 కోట్ల 23 లక్షలు, లోటు 3 కోట్ల 96 లక్షలూ ఉన్నట్లు తేలింది.

రెండవ పంచవర్ష ప్రణాళికకు ఆంధ్రలో అంచనాలు 118 కోట్ల 96 లక్షలు, ఇందులో ఉన్న వసతుల ద్వారా లభించేది 39 కోట్లు. భర్తీ కావలసినది 79 కోట్ల 96 లక్షలు. అలాగే తెలంగాణాలో ప్రణాళిక అంచనా 55 కోట్ల 16 లక్షలు కాగా భర్తీ కావలసిన లోటు 46 కోట్లు. ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద లోటు 126 కోట్ల 12 లక్షలకు వసతులు చూచుకోవాలన్నమాట.

ఉన్న పరిస్థితులను పరిశీలిస్తే, తెలంగాణాలో అభివృద్ధి ప్రణాళికలపై కన్న ఇతర అంశాలమీద ఖర్చు ఎక్కువ అవుతున్నట్టు గోచరిస్తుంది. ఆంధ్రలో పన్నులద్వారా రాబడిని హెచ్చించడానికి మార్గాలు అన్వేషించాలనిపిస్తుంది. ఈ రెండూకూడా సులభసాధ్యాలు కాకపోవచ్చు కాని అసాధ్యాలు అని మాత్రం అనుకోనక్కరలేదు. ఉభయప్రాంతాలవారూ అన్ని విభేదాలకు అతీతులై ప్రయత్నాలు చేస్తే మార్గాలూ మార్గాంతరాలూ గోచరించక పోవు. ★

## "చిత్రకళ"

[చిత్రసంపుటి చిత్రకారుడు: పి. ఆర్. రాజు, గుంటూరు.]

దీనిలో విశ్వకళామూర్తి, పాలానికి, నీలాటిరేవుకు మొదలైన 10 చిత్రాలున్నాయి.

'పాలానికి' అనేచిత్రంలో రేఖాలాలిత్యం తీర్చిదిద్దినట్లుగా సాగిపోయింది. ఇంకా ఈ చిత్ర సంపుటిలో కదలికలు, కోపగృహము, ఆశ్రయం ముఖ్యంగా ఎన్నదగిన చిత్రాలు.

ఈచిత్రసంపుటికి పీఠిక వ్రాసిన శ్రీ ఆచంట జానకిరాం వ్రాసినట్లు పి. ఆర్. రాజుగారు చక్కని సాధకులు.

చూడసొంపుగా ఈ సంపుటం ప్రకటించిన చిత్రకారు లభినందనీయులు. ★




దురాక్రమణ చెడదే, కాని అహంకారం ఇంకా చెడ్డది,' అని ఇటీవల భారతదేశ విదేశాంగ విధానంపై జరిగిన చర్చలలో స్పష్టమైంది. ప్రధానమంత్రి విమర్శలన్నిటినీ జయప్రదంగా ఎదుర్కొన్నారు. ఆయన ప్రారంభోపన్యాసం రాజనీతి చాతుర్యానికి ఉత్తమ తార్కాణం. తటస్థ విధానాన్ని ఆయన ఉపన్యాసం పునర్నిర్వచించింది. ఈజిప్టులోను, హంగరీలోను దురాక్రమణ ఎక్కడజరిగినా గర్హించదగినదేనని ఆయన ఉద్ఘాటించారు. బాహాటంగా చెప్పకపోయినా, ప్రధాన మంత్రి ఇద్దరు మీనన్‌లను మందలించారు. ఒక మీనన్ ఐక్యరాజ్య సమితిలో ఉన్న శ్రీ వి. కె. కృష్ణమీనన్. ఇంకో మీనన్ మాస్కోలోని భారత రాయబారి శ్రీ కె. పి. యస్. మీనన్.

ప్రధాన మంత్రి నిర్భయంగా, నిష్పక్షపాతంగా అనుకున్నది అనుకున్నట్లు చెపుతారనేకీర్తి ఉన్నది. మొన్న రష్యాను దువ్వ లేకుండా గర్హించడంతో ఈ కీర్తి ఇనుమడించింది. దురాక్రమణ దారులను ఆయన నిరసించారు. అంతేగాక భారత రాయబారుల అహంకారాన్ని కూడా ఆయన నిరసించారు. ప్రతి పక్షవిమర్శలేమీ పని చెయ్యలేదు. పార్లమెంటు ప్రధానమంత్రిలో విశ్వాసాన్ని వెల్లడించింది.

హంగేరియన్ సమస్యపై ఐక్యరాజ్య సమితిలో భారతదేశం వ్యతిరేకంగా ఓటు చేసినందుకు విమర్శించినవారిని తన రాజకీయ చాతుర్యంతో ప్రధాని ఊరుకోబెట్టారు. నిజానికి ప్రధాని స్వహానుమూసి భారత రాయబారుల గర్విష్టితనాన్ని మనం సహించడం జరుగుతోంది. మనమంటే సహించగలం గాని, ఇతరదేశీయులెందుకు సహిస్తారు? సమితిలోని భారతీయ ప్రతినిధులు కొందరు ఇతర దేశ ప్రతినిధులపట్ల అమర్యాదగా ప్రవర్తిస్తున్నారట. సోషలిస్టు నాయకుడు శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ఇంతవరకెప్పుడూ చేయనంత మోటైన విమర్శను శ్రీ కృష్ణమీనన్‌పై చేశారు. శ్రీ మీనన్ ఇకనైనా తన వాకచక్యాన్ని సక్రమపంథాలో ఉపయోగిస్తే బావుంటుంది.

* * *

పోర్టుఫోలియోలేనిమంత్రి (కృష్ణమీనన్) ప్రయాణాలకి అందరికంటె ఎక్కువ ఖర్చు చేశారని హోంశాఖామంత్రి లోక్‌సభలో వెల్లడించారు. 1956 ఏప్రిల్ 1 నుండి ఆయన 19,477 రూ॥ ఖర్చుచేశారట. తరవాత పెద్ద ఖర్చుదారు కార్మికమంత్రి. ఆయన పద్దు రూ॥ 10,261. తరవాత పెద్దపద్దుతంతి, తపాలామంత్రిది: రూ 8,196. ఈయన పద్దులో రూ. 3668.8 0 విమానాలకి అయింది. ఈయన దారిభత్యం రూ 770.

* * *

సిద్ధాంతరీత్యా ప్రభుత్వ ధనంపై అజ్మాయిషీ చేసేది పార్లమెంటు. డబ్బు అజ్మాయిషీ అనేది బాధ్యతాయుత ప్రభుత్వానికి గీటురాయి

మొదట్లో ఈ డబ్బు అజ్మాయిషీ రాజులకాలంలోనే బయలుదేరింది. రాజులు

## శ్రీ కృష్ణ
[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

చేసే ఖర్చుపైకూడా అజ్మాయిషీ ఉండేది. బాధ్యతాయుత ప్రభుత్వాలు వచ్చాక ప్రభుత్వాల ఖర్చుపై అజ్మాయిషీ ఏర్పడింది. ఇదంతా సిద్ధాంత విషయం. భారతదేశంలో పార్లమెంటు సభ్యులు రాజ్యాంగంలో గాని, ప్రజాధనం అజ్మాయిషీలో గాని శ్రద్ధ వహించినట్లు దాఖలా లేదు. వీరు చూపే శ్రద్ధకు ఇదిగో మచ్చుతునక:—

"కేంద్రప్రభుత్వ ఉద్యోగులకు ప్రివిలెజ్ టికెట్ ఆర్డర్ సౌకర్యాలు మంజూరు చేయడంలో గల ఆర్థిక సాధకబాధకాలను ప్రభుత్వము పరిశీలించిందా? పరిశీలించి ఏం నిర్ణయించింది?"

అని ఒక ప్రశ్నను ఆరుగురు సభ్యులు కలిసి వేశారు. కాని ప్రభుత్వ నిర్ణయం ఈ ప్రశ్న వేయడానికి ఒక నెలముందే, అంటే అక్టోబరు 11 వ తేదీకే వెలువడింది. కాని ఈ గౌరవనీయ సభ్యులు పేపర్లు చూడలేదని దీనివలన తెలిసిపోతోంది.

ప్రభుత్వం సమాధాన మిస్తూ హెడ్ క్వార్టర్సుకు 250 మైళ్ళకంటె ఎక్కువ దూరంలో స్వస్థలాలుగల కేంద్ర ప్రభుత్వోద్యోగులకు ప్రివిలెజ్ టికెట్ ఆర్డర్ సౌకర్యాలు ఇస్తున్నామనే పూర్వ నిర్ణయాన్ని మళ్లీ ప్రకటించింది.

దాంతో సభ్యులు ఆ సౌకర్యాలను 250 మైళ్ళలోపునే స్వస్థలాలుగలవారికి కూడా వర్తింపజేయాలని ఒత్తిడిచేశారు.

సభ్యులకు రెండు నాలికలున్నట్లు అనిపిస్తుంది అంచనాలసంఘంలో సభ్యులు గావీరు ఖర్చులు తగ్గించాలని ఒకప్రక్క ఒత్తిడి చేస్తారు. మరొక ప్రక్క పార్లమెంటు సభ్యులుగాఖర్చులు తగ్గించరాదని అంటారు.

సెంట్రల్ పే కమీషన్ 1946 లో ఈ ప్రివిలేజ్ టికెట్ పద్ధతిని సూచించింది. రైల్వేలలోకాక మిగతా కేంద్రప్రభుత్వ శాఖలలో మొత్తం ఉద్యోగుల సంఖ్య 1951 నుంచి మాత్రమే లభ్యమవుతోంది. ఈ సంఖ్య ఏటేటా పెరుగుతున్నటు కనిపిస్తోంది. 1956 జూలై అంతానికి మొత్తం ఉద్యోగుల సంఖ్య 7,42,518 (1951 డిసెంబరు ఆఖరున ఈ సంఖ్య 5,90,662. అంటే నాలుగేళ్ళ 7 నెలలలో 1,51,856 ఉద్యోగాలు పెరిగాయన్నమాట. ఒక్క గుమాస్తాల సంఖ్యే ఇలా పెరిగింది:

| | | | |
|---|---|---|---|
| 1951 | డిసెంబరు. | — | 1,42,850. |
| 1952 | ,, | — | 1,50,870. |
| 1953 | ,, | — | 1,54 364. |
| 1954 | ,, | — | 1,64,067. |
| 1955 | ,, | — | 1,98,558. |
| 1956 | జూలై | — | 2.08,734. |

అంటే మొత్తం 65 884 మంది గుమాస్తాలు కొత్తగా వచ్చినవారన్నమాట. మొత్తం పెరుగుదలలో సగందాకా గుమాస్తాల సంఖ్యలోనే జరిగిందన్నమాట. నిపుణులుకాని పనివారిసంఖ్య ఇదేకాలంలో తగ్గిందనేది ఇంకా ఆశ్చర్యకరమైన విషయం. కేంద్రప్రభుత్వంలోని ఈ పనివారి సంఖ్య 1951 డిసెంబరులో 2,47 694 ఉండగా, 1956 జూలైలో 2,45,274 మాత్రమే ఉంది

అంటే 2420 మంది తగ్గారన్నమాట.



నవంబరు 23 న అరియలూరు, కల్లగం స్టేషన్ల మధ్య తూత్తుకుడి ఎక్స్‌ప్రెస్ ఒక వంతెన దాటుతూ ఘోర ప్రమాదానికి లోనైంది. 144 మందిదాకా దుర్మరణం పొందారు.

# న్యూఢిల్లీ లేఖ

రెగ్యులర్ కాని పనివారి సంఖ్య 1955 ఆగస్టు అంతంలో 87,504 ఉంటే 1956 జూలై అంతంలో 78,646 ఉంది. అంటే పన్నెండు నెలల్లో 8,858 మంది తగ్గారన్న మాట. కాని నిపుణులు, ఒకమాదిరి నిపుణులు 1956 జూలై అంతానికి 1,49 390 అయ్యారు. అంటే 4,086 మంది ఎక్కువయ్యారన్న మాట. కనుక నిపుణులు కాని పనివారు, రెగ్యులర్ కాని పనివారు తగ్గిపోతున్నారనీ, నిపుణులు, ఒకమాదిరి నిపుణులు అంత ఎక్కువగా పెరగడం లేదనీ, గుమాస్తాల సంఖ్యమాత్రం బాగా పెరుగుతోందనీ తెలుస్తోంది. సచివాలయంలో ఉద్యోగులు ఎక్కువ కావడంగూర్చి పరిశీలించడానికి ప్రభుత్వం కొన్ని కమిటీలను నియమించింది. ఈ కమిటీలు నివేదికలు తయారుచేశాయి. ఈ నివేదికలను మ్యూజియములలో భావి తరాల చరిత్ర విద్యార్థుల పరిశోధనలకు పనికివస్తాయని భద్రపరిచినట్లున్నారు.

మాజీ ఆర్థికమంత్రి శ్రీ చింతామణి దేశ్‌ముఖ్ ఇద్దరు సభ్యులతో ఒక స్థాయీ సంఘాన్ని నియమించారు. ఈ సంఘం మరికొన్ని నివేదికలు తయారు చేసింది. వాటిని కూడా ఏ మూలనో భద్రపరిచారు. ప్రజా ధనంతో గుమాస్తాల సంఖ్యను పెంచడం మాత్రం యథావిధిగా జరిగిపోతూనే ఉంది. ఈ ఏడు మొదటి ఏడు నెలలలో గుమాస్తాల సంఖ్య ఇలా పెరిగింది:-

| | | |
|---|---|---|
| 1955 | డిసెంబరు | 1,98.553 |
| 1956 | జనవరి | 1,99,251 |
| ,, | ఫిబ్రవరి | 1,99,728 |
| ,, | మార్చి | 2,01 397 |
| ,, | ఏప్రిల్ | 2,02,797 |
| ,, | మే | 2,04,721 |
| ,, | జూన్ | 2,07,053 |
| ,, | జూలై | 2,08,734 |

పాల్ ఆపిల్‌బీ మన దేశం రెండు సార్లు వచ్చి వెళ్ళారు. వీరి రాక ఫలితంగా ఆర్గనైజేషన్ ఎండ్ మెథడ్స్ డివిజన్ స్థాపించబడింది ఈ డివిజన్ రంగు రంగుల పటాలు అవీ వేసి పనులెలా చేయిస్తున్నదీ వెల్లడిస్తోంది. కాని ఏ గుమాస్తా ఎంత పని చేస్తున్నాడనేది తెలియడానికి కొన్ని పటాలు తయారుచేయించడం ఇంకా మంచిది, అవసరం కూడాను.

భారత ప్రభుత్వం దృష్టిలో వోటింగ్‌లో ఎవరికెంత బలం ఉంటుంది, ఎవరెంత బాగా ఆందోళన చేయగలరు, అనేవే ముఖ్యం. అందుచేతనే నిపుణులు కాని పనివారు, రెగ్యులర్ కాని పనివారు తగ్గిపోతుంటే గుమాస్తాల సంఖ్య పెరుగుతోంది. గుమాస్తాలకు అలజడి చేయగలశక్తి బాగా ఉంది. తలుచుకుంటే ఎన్నికలలో తమ తడాఖా చూపగలరు!

ఉద్యోగుల పెరుగుదలతో సమంగా కార్యాలయ భవనాలు పెరగడం లేదు. కార్యాలయాలన్నీ ఒకేచోట ఉండడంచేత ఆందోళనలకు, ప్రదర్శనలకు, సభలకు మనుషులు కావలసినంతమంది దొరుకుతున్నారు. కార్యాలయాలను వేరువేరు చోట్ల పెట్టాలని వచ్చిన ప్రతిపాదనలన్నీ మూలపడి పోయాయి. సిమ్లా, నాగపూర్, రాజస్థాన్ మొదలైన ప్రాంతాల్లో మంచి మంచి భవనాలు పాడైపోతుంటే ఢిల్లీలో రాజభవనాల్లాంటి భవనాలు లేస్తున్నాయి. ఢిల్లీ నుంచి కార్యాలయాలను మార్చాలనే సూచన ఏడేళ్లనుంచి అలాగే ఉంది. ప్రజాధనం దుబారా అవుతుండగా ప్రధానమంత్రి నిర్లక్ష్యం చేసినంతకాలం ఆ సూచన అలాగే ఉంటుంది. అంత ముఖ్యంకాని కార్యాలయాలను ఢిల్లీనుంచి మార్చాలంటే ప్రధానమంత్రి మాత్రమే మార్చగలరు. న్యూఢిల్లీలో కొత్త భవనాలు కట్టేందుకు ఖర్చయ్యే డబ్బుతో మురికిపేటలను బాగు చేయించవచ్చును. కాని ఈ మురికిపేటల్ని గూర్చి పెద్దమనుషులెవరూ నోరెత్తరు. ఉత్పత్తి అధికం చెయ్యాలని అంతా అనేవారే. కాని ఎవరి క్షేమంకోసం? అని ఎవరూ ప్రశ్నించరు. ★

# బానిసవాడి యోగ్యత

ఆదిల్లా నవాబుగారి 'దిల్' ఏమంత ఖుషీగా లేదు!... కారణం సర్వసైన్యాధిపతి అమరాలీషా అనుకోకుండా, అంటే, రోగం రొష్టూ లేకుండా, 'ఖుదా!' వారి వద్దకు వెళ్ళిపోయాడు! ఇది ఆదిల్లా వారికి తీరనిలోటుగా ఏర్పడింది. చచ్చి స్వర్గాని కెళ్ళిన అమరాలీషా మంచి పరాక్రమశాలి! అతనంటే శత్రువులగుండె కొట్టుకుంటుంది! అలాంటివాడు చనిపోయాడని తెలియగానే శత్రురాజులు, ఆదిల్లావారి రాజ్యంమీద ఈగల్లా ముసుగుకోసాగారు. అడుగడుక్కీ యుద్ధాలు తప్పడం లేదు. అవసరం నిమిత్తం అనవసరమైన చిన్న సైన్యాధిపతిని సర్వసైన్యాధిపతిగా మార్చారు. అతగాడు శత్రువులమీదికి యుద్ధానికి వెళ్ళి, చిత్తుగా దెబ్బతిని, ఒక వేయిమంది భటుల్ని వారిచేతికి వప్పగించి, చిక్కకుండా చక్కా పారిపోయి వచ్చాడు. దానితో ఆదిల్లా నవాబుగారి అంతరాత్మ 'అల్లాహో..అక్బర్ ...' అని అంగలార్చింది.

'ఇస్లాంజాతి యింత చచ్చుబడిపోయిందేం! పౌరుషం, ప్రతాపం, శత్రువుల గుండెలోనికి దూసుకు పోవలసింది పోయి, సైన్యమే పిరికితనంగా వెనక్కి వెన్నిచ్చి దూసుకు వచ్చేస్తోంది ఏమిటి చెప్మా!' అని ఆదిల్లావారు అరగంటసేపు అసమాన ప్రజ్ఞా ధురీణతతో ఆలోచించారు.

దీనికంతకీ కారణం సరియైన సర్వసేనాధిపతి లేకపోవడమేనని స్ఫురించింది. "యుద్ధంలో సర్వసేనాధిపతి కాలికి బుద్ధి చెబితే, ఇక పొట్టకూటికోసం యుద్ధాలు చేసే భటులు నిలుస్తారా? వట్టిది! సైన్యాధిపతి గట్టివాడు కావాలి," అనుకున్నారు ఆదిల్లా నవాబు!

యోచించడమే తడవు ఆదిల్లావారికొక ఆలోచన తళుక్కున మెరిసింది! ఏమిటంటే, తన ఆంతరంగిక బానిస సులేమానుని సర్వసైన్యాధిపతిగా చేయడం.

'సులేమాన్ గట్టివాడు ... కర్కోటకుడు... దున్నపోతులా, నల్లగా, బలిష్ఠంగావుంటాడు...అవును! అలాంటివాడే సైన్యాధిపతిగా వుండతగ్గవాడు!' అనుకున్నారు.

ఆదిల్లావారి ఆలోచనకు ఒకరూపం ఏర్పడినతర్వాత మరునాడు మహామంత్రిని పిలిపించారు.

"ఏమయ్యా! సర్వసేనాధిపతి విషయంలో మేము ఒక నిశ్చయానికి వచ్చాము. మన రాజ్యంలోవున్న పిరికిపందలెవరూ పనికిరారు. నా అంగరక్షకుడైన సులేమాన్‌ను, సర్వసైన్యాధిపతిగా చేయాలనుకుంటున్నాను! ఏమిటి నీ ఉద్దేశం!" అనడిగారు.

వజీరు సాహెబ్‌వారు ఆశ్చర్యంతో నోరువెళ్ళబెట్టి, క్షణకాలం అల్లాగే వుండిపోయారు!

"చెప్పవయ్యా! అలా నిలువుగుడ్లు వేస్తావేం!" అని విసుక్కున్నారు ఆదిల్లావారు.

"ఏమిటి సెలవిచ్చారు 'ఆలంపనా!' చదువు, సంస్కారమూ లేని మొరటు మొద్దు సైన్యాధిపత్యం వహించడమా? మీకీ విపరీతపు టాలోచన ఎలాపుట్టింది! అయ్యో దేశానికి అరిష్టం దాపురించిందా! కాకపోతే వజ్రం తునకలాంటి అమరాలిషా,

## శింగంపల్లి అప్పారావు

అమరలోకం చేరుకోవడ మేమిటి? ఆ పిమ్మట వచ్చిన సైన్యాధిపతి చేతకాని వాడవట మేమిటి? ఇప్పుడు మీకీ విపరీతపు టాలోచన ఏమిటి? అంతా అయోమయంగా వుంది. మీరు కాస్త విశ్రాంతి తీసుకోండి. తరువాత మాట్లాడుదాం. యా ఖుదా!" అనుకుంటూ తెల్లటి గడ్డాన్ని మెల్లగా దువ్వుకుంటూ వజీరుసాహెబువారు గాభరాగా వెళ్ళిపోయారు!

ఈ సంగతి, వజీరు నోరు వెళ్ళగించుకొని చెప్పడం, ఛోటా మంత్రులను, సైన్యాన్ని, చేరుకుంది! అంతా చేరి గుండె బాదుకున్నారు.

వజీరుగారి అధ్యక్షత క్రింద అత్యవసర సమావేశం ఏర్పాటు చేయబడింది. "మనమీద ఒక బానిసవాడు, అధికారం చలాయించడం, మన జాతికే తలవంపు. నిజంగా ఆదిల్లావారి 'దిల్' ఖరాబయింది. దీనికిమనం ఎంతమాత్రం అంగీకరించకూడదు. ఆదిల్లా వారికి నచ్చచెప్పాలి. వినకపోతే ప్రతిఘటించనైనా ప్రతిఘటించాలి!" అన్నారంతా.

ముసలి వజీరు మెల్లగా లేచి "సభ్యులు, ఉద్రేకపడకూడదు! ఆదిల్లావారు మనకు ప్రభువు! అంటే 'అల్లా'తో సమానమన్నమాట. ఆయన సంగతి మనందరికీ బాగా తెలుసు పట్టినపట్టు విడువరు. దీనికి ఒక్కటే ఉపాయం వుంది. సుల్తానా బేగం సాహెబావారివద్దకు వెళ్లి వారిని ప్రార్థిస్తే వ్యవహారం చక్కబడుతుంది. ఆ నమ్మకం నాకుంది!" అన్నారు.

ఇకనేం. సుల్తానా బేగం సాహెబావారి వద్దకు, వజీరుగారినే, రాయబారానికి పంపించారంతా!

వజీరుసాహెబ్ రాణీ సాహెబావారి వద్దకు చేరుకొని "అమ్మా! ప్రభువులవారు బానిస సులేమాన్‌ను, సైన్యాధిపతిగా చేయాలని అనుకుంటున్నారు. వారిమాటకు తిరుగు లేదు. కాని ప్రజలూ, సైన్యమూ, గుజగుజలాడి పోతున్నారు. రాజ్యంలో ఏదైనా విప్లవం చెలరేగుతుందేమోనని, నాకు చాలా ఆందోళనగా వుంది ఇప్పట్లో తమరు ప్రభువులవారికి నచ్చచెప్పి, వారి నిర్ణయాన్ని మార్చగలిగితే, నాతోపాటు, దేశం యావత్తూ, సంతోషిస్తుంది." అన్నాడు.

సుల్తానా బేగం సాహెబావారు విచారంగా ముఖంపెట్టి "మేమూ విన్నాం. బానిసవాడు అధికారంలోకి వస్తే, మనం బానిసల్లా తయారవాలి. ఇది మేము ఎంతమాత్రం సహించం! ప్రభువులకు తప్పకుండా మనవి చేస్తాం! మీరిక వెళ్ళవచ్చు," అంటూ రాణీ సాహెబావారు అంతఃపురంలోనికి వెళ్ళిపోయారు.

సుల్తాన్ ఆదిల్లావారు, ఏకాంత మందిరంలో కూర్చొని, ఆలోచనా సాగరంలో మునిగి తేలుతున్నారు.

'ఇంతమంది యిన్ని విధాలుగా, భయపడతారెందుకు? తెల్లటి తెలలతో గడ్డం నెరిసిన వజీరుకూడా, వణుకుతున్నాడు... సులేమాన్ మంచి దృఢగాత్రుడు. మొరటువాడు. జాలి ఏకోశానాలేని రాక్షసుడు. మంచి ధైర్యం గలవాడు. వాడిసంగతి తనకు బాగా తెలుసు సైన్యాధిపతిగా రాణిస్తాడు దేశం బాగుపడుతుంది తను యిన్ని విధాలుగా ఆలోచించి చేస్తుంటే వీళ్లకువచ్చేదేమిటి? కొన్నాళ్ళిలా, గింజుళ్లాడుతుంటూ వుంటే, రాజ్యం కాస్తా, పరహస్తగతమైపోతుంది. తనని బాగా అర్థం చేసుకునే

# ★ బానిసవాడి యోగ్యత ★

రాణీసాహెబాకూడ, నచ్చ జెప్పడానికి ప్రయత్నం చేస్తూవుంది. బానిసవాడు మనిషి కాడూ. సమర్థత గలవాడు ఎవడైతేనేం, వీళ్లె పిచ్చిగాని!" అనుకున్నారు అదిల్షావారు.

* * *

మర్నాడు ఆదిల్షా నవాబుగారి సభాభవనం, కిటకిటలాడుతోంది.

సుల్తాన్‌వారు, ఏదైనా చెబుతారని, బానిసవాడిని — సైన్యాధిపతిగా చేస్తున్నామని అంటారేమోనని, అంటే సభలో అల్లకల్లోలం చేద్దామని చాలామంది వేచి వున్నారు.

ఆదిల్షావారు, తన అంగీలోనుంచి ఒక పెద్ద రత్నాన్ని బయటకుతీశారు. అది కాంతులీనుతూ ప్రకాశమానంగా కన్పించింది.

ఆదిల్షావారు, సింహాసనంనుంచి లేచి, వచ్చి ఆ రత్నాన్ని సభ మధ్యలో, ఒక బల్లమీద పెట్టారు. అందరికీ కనిపించేలా!

అక్కడనుంచివచ్చి, సింహాసనం మీద కూర్చుంటూ యిలా అన్నారు:

"మంత్రి సామంత సభాసదులారా! ఆ రత్నాన్ని చూశారా! దాని ఖరీదు యిరవై లక్షల బంగారు మాడలు. దీన్ని అరబ్ దేశం నుంచి కొందరు వర్తకులు, యీనాడే తీసుకువచ్చారు. ఇరవై లక్షల బంగారు మాడలంటే నిజంగా చాలా ఖరీదన్నమాట. ఈ రత్నం, యిరవై మాడల ఖరీదే చేస్తుందో......లేక యిరవై లక్షల మాడల ఖరీదు చేస్తుందో తేల్చిచెప్పడం కష్టం. ఈ రత్నం, దోషభూయిష్టమైనదో కాదో మనం కనిపెట్టాలి. ఇది రత్న పరీక్షకులవల్ల అయే పనిగాదు. దీనికి ఒక్కటే ఉపాయం. రత్నాన్ని పగులగొట్టాలి. దోషంవుంటే, అప్పుడే బైటపడుతుంది. అరబ్ వర్తకుల్ని శిక్షించవచ్చు. లేదా వారి యిరవైలక్షల బంగారు నాణేలనూ వారికి యిచ్చేద్దాం. ఇదిగో మంత్రీ! సుత్తితీసుకొని దాన్ని కాస్త పగలగొట్టి చూడండి!" అంటూ ముగించారు.

వజీరుసాహెబ్ వారి గుండె గుభిలుమంది. నోట తడి ఆరిపోయింది. "ఇరవైలక్షలు ఖరీదు చేసే రత్నాన్ని పగులగొట్టడమే. దోషంవుంటే సరేసరి. లేకుంటే అంత డబ్బూ, వృధాగా మంచినీళ్లలా ధార పోయాలికదా! ఇరవై లక్షలంటే మాటలా? తనకు యిరవై సంవత్సరాల జీతం! దేశం అరాచకంలో వున్నప్పుడు, సుల్తానుగారికీ వెర్రేమిటి! మతిపోయింది. వారికి మతి పూర్తిగాపోయింది." అనుకున్నారు.

"వజీర్ వారు, ప్రత్యుత్తరం యివ్వడం లేదు," అంటూ ఆదిల్షావారు, మహామంత్రి ముఖంవైపు చూశారు ప్రశ్నార్థకంగా.

"హుజూర్! ఇరవైలక్షల మాడలంటే, మాటలుకాగు. అంత ఖరీదు పెట్టి రత్నాన్ని కొనడం,దానిని పగులగొట్టించడం, కేవలం మనకు దమ్మిడీ లాభంలేని పని. దాన్ని కొనడం శ్రేయస్కరం గాదు" అన్నారు వజీరు సాహెబ్.

'సైన్యాధిపతి విషయం ఏమైనా మాట్లాడతాడేమోననుకుంటే' రత్న బేరంలోనికి దిగింది వ్యవహారం; సుల్తానావారికిపూర్తిగా పిచ్చెత్తింది' అనుకున్నాడు.

"నేను మీ ఉద్దేశాన్ని అడగటం లేదు. రత్నాన్ని పగలగొడతారా లేదా? అని ప్రశ్నిస్తున్నాను," రెట్టించారు ఆదిల్షావారు.

"క్షమించాలి! దేశ శ్రేయస్సు దృష్ట్యా నేనాపని చేయలేను. నావల్లగాదు. మీరు శిక్ష విధించినా సరే," అన్నారు వజీరు సాహెబ్.

ఆదిల్షావారుసభికులవంక తిరిగి"విన్నారా! ముఖ్యమంత్రిగారు, యీ చిన్న కార్యాన్ని చేయడానికి వెనుకాడుతున్నారు. కాబట్టి యీ సభలో వున్నవారు ఎవరైనా సరే, రత్నాన్ని పగులగొట్టగలిగితే, వారికి వెయ్యి దీనారాలు బహుమానంగా యివ్వబడుతుంది. అన్నారు.

అంతా ఒకరి మొఖం ఒకరు అయోమయంగా చూసుకున్నారు.

'ఇరవై లక్షల రత్నం, నాశనం చేసేవారికి, వేయిదీనారాలు బహుమానమా! ఎక్కడైనా, ఎప్పుడైనా వుందా యీ విపరీతం!' అనుకున్నారు కొంతమంది!

"ఓస్...సుత్తితో ఒక దెబ్బ కొట్టడమే కదా! అనాయాసంగా వేయి దీనారాలు సంపాదించవచ్చు" అన్న ఆలోచనలో పడ్డారు కొంతమంది.

"పగులగొట్టడమంటే పగులగొడతాం... కాని తీరా పగులకొటిన తర్వాత ఆదిల్షా వారు "ఛీ దుర్మార్గుడా! నేను చెబితే మట్టుకు, అంత ఖరీదుగల రత్నాన్ని నాశనం చేస్తావా? సభికుల్ని పరీక్షించడానికి అలాగన్నాను బహుమానాలకు ఆశపడిన నీలాంటి నీచుడు ఎంతకైనా తెగిస్తాడు. కాబట్టి నీకు ఉరిశిక్ష విధించాను" అంటే పెళ్లాం పిల్లల గతేం కావాలి "వద్దు బాబో వద్దు!" అనుకుంటున్నారు మరికొంత మంది.

"ఎవరూ ముందుకు రావటం లేదు. బహుమానం అక్కర్లేదా? రత్నాన్ని పగుల గొట్టలేరా? అంటూ అరిచారు ఆదిల్షా వారు.

అంతా తలలు వంచుకున్నారు. సభంతా నిశ్శబ్దమై పోయింది. వెంటనే ఆదిల్షావారి దృష్టి సింహాసనానికి కొంచెం దూరంలో నిలబడివున్న, బానిస సులేమాన్ మీదపడింది-

"సులేమాన్! యిలారా!" అంటూ పిలిచారు.

సభంతా సులేమాన్ వైపు తిరిగింది! కొంప తీసి వీడిచేత గాని రత్నాన్ని పగుల గొట్టిస్తారా? అనుకున్నారు.

"చూడు సులేమాన్!—అక్కడ రత్నం వుంది చూశావు కదూ? సుత్తితో దాన్ని పగుల గొట్టు!" ఆదిల్షావారు ఆజ్ఞాపించారు.

అంతే! ఆదిల్షావారినోట మాట వెలికి రాకుండానే, సులేమాన్ సుత్తితీసుకొని, వెళ్ళి రత్నాన్ని ఒక్కదెబ్బతో, నుగ్గునుగ్గు చేసి పారేశాడు!

సభలో హాహాకారాలు చెలరేగాయి!—అయ్యో,—అయ్యో,—ఇరవైలక్షల బంగారు మాడలఖరీదే,—ఈనీచుడు అన్యాయంగా నేలపాలు చేశాడే!—ఎవరికి దానం చేసినా, ఆదిల్షావారి పేరు చెప్పుకొని, కలకాలం బ్రతుకుదురే! అనుకున్నారు.

వజీరుగారి నాసికాపుటాలు, కోపంతో ఎగిరెగిరి పడుతున్నాయి 'ఇంకేముంది! యిరవైలక్షల బంగారునాణేలు, పోయినట్టే!...యాఖుదా!' అనుకున్నారు.

ఆదిల్షావారు, అందర్నీ ఒకసారి వీక్షించి, సులేమాన్‌వైపుతిరిగి "సులేమాన్! నీవు చేసింది మంచి పనేనంటావా!—ఇరవైలక్షల బంగారుమాడలు ఖరీదు చేసే రత్నాన్ని నాశనం చేయడంవల్ల, ఎంతమంది ఆగ్రహానికి గురి అయ్యారో చూశావా!—ఎవరూ చేయలేని, యీ వినాశకరమైనపని, నీవు ఎందుకు చేశావు." అనడిగారు.

సులేమాన్ చేతులు జోడించి "అన్నదాతా! అది యిరవైలక్షల బంగారు మాడలు కావచ్చు,—ఇరవై కోట్లు కావచ్చు!



ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవాలలో విద్యుద్దీప్తమైన చార్మినార్

దాని వెలతో నాకు నిమిత్తం లేదు! వీటన్నిటి కన్నా, మీవాక్కు, నాకు కోటానకోట్ల రెట్లు, ఎక్కువ విలువైనది! మీరు నా ప్రభువులు. మీరు చెప్పిన ప్రతిపనీ చేయడం నావిధ్యుక్త ధర్మం. మీరు రత్నాన్ని పగలగొటమన్నారు. అప్పుడు దానివిలువ కాదు కనిపించింది, మీ మాటను శిరసావహించవలసిన బాధ్యత! అందు వేత నే పగులగొటాను. పొరపాటు చేసివుంటే క్షమించండి!" అన్నాడు వినయంగా!

సులేమాన్ మాటలకు సభంతా ఆశ్చర్య పోయింది. వజీర్ సాహెబ్ విశేషంగా ఆశ్చర్యపోయారు.

ఆదిల్షావారు చిరునవ్వు నవ్వుతూ "చూశావా మంత్రీ! ఇప్పటికైనా గ్రహించావా బానిసవాడి యోగ్యత? సైన్యాధిపతి కావడానికి వాడికి అర్హతలేదంటావా? దూరాలోచన చేసి చెప్పు మీరు మహామంత్రులు కాబట్టి దేశశ్రేయస్సు దృష్ట్యా రత్నాన్ని పగులగొట్టడానికి నిరాకరించారు. అది మీ విధ్యుక్తధర్మం! మీ కే కనుక రత్నాన్ని పగులగొట్టివుంటే మంత్రిపదవికి అనర్హులన్నమాట. నరకమన్నవాడిని, నరకడమే సైన్యాధికారిలక్షణం. చేయమన్న పని చేసి పిదప ఆలోచించడం సైన్యాధికారి విధ్యుక్తధర్మం. ఆ లక్షణం సులేమాన్‌లో విశేషంగావుంది. నేటినుంచి సులేమాన్ మనరాజ్యానికి సర్వసేనాధిపతి! ... దీనికి ఎవరైనా అభ్యంతరం చెబుతారా!" అన్నారు గంభీరంగా.

అభ్యంతరం చెప్పే సాహసం ఎవరికుంటుంది!

రాజలాంఛనాలతో, సులేమాన్ అప్పటికప్పుడే సైన్యాధిపతిగా మారిపోయాడు.

ఆ పగులగొట్టించిన రత్నం అసలురత్నం కాదని, ఆదిల్షావారి, ఆలోచనాశక్తిలో ఉద్భవించి, నకిలీరత్నమని వజీరుసాహెబ్ వారు తరువాత తెలుసుకొని, మనసు దిట చేసుకొని పదిలపడ్డారు! 

# చూడండి!

## సన్‌లైట్
### సగంబిళ్ల మాత్రమే
### ఈ బట్టలన్నిటిని ఉతికింది!

అట్లు చేసినట్టిది దాని అధికమైన నురగ!




## సన్‌లైట్
## సబ్బు

బట్టలను తెల్లగాను, కాంతివంతముగాను ఉతుకును

S 242 X52 TL

భారతదేశంలో
తయారుచేయబడినది

# లోగుట్టు పెరుమాళ్ళకెరుక!

పరిస్థితులు హఠాత్తుగా ఎదురు తిరిగి తారుమారైనప్పుడు, వాటికి తట్టుకో గలిగిన మనోదార్ఢ్యం ఎంతటి వారిలోనైనా నశించిపోవడం సహజం.

చేజేతులా ఒక బ్రహ్మాండమైన జూదాన్ని ప్రారంభించి అందులో తన సర్వస్వాన్నీ సమర్పించడానికి సంసిద్ధుడైన వ్యక్తి మాన్యా వుండగానే భగ్న మనోరథుడైతే, అతగాడి మానసిక శారీరక స్వస్థత చెదిరిపోవడంలో ఆశ్చర్యమేమున్నది?

అందుచేతే, మనవాళ్లు, చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవా! అన్నారు.

* * *

ఈజిప్టు తన స్వాతంత్ర్యాన్ని ప్రాణప్రదంగా పరిగణించే చిన్న దేశం; చెప్పుకోదగిన సైనిక సంపదలేనిది. బ్రిటన్ ఫ్రాన్సులు అపార సైనిక సంపద గలిగిన రెండు అగ్రరాజ్యాలు. ఇజ్రేల్ దండయాత్రకు ఉపక్రమించిందనే నెపంమీద, ఈ రెండు సామ్రాజ్య దేశాలు కలసి దాదాపు 50 వేల మంది సైనికులను సమాయత్తపరిచి ఈజిప్టు మీద అమాంతం విరుచుకు పడడం జరిగింది బ్రిటన్ అండలేక పోతే, ఫ్రాన్సు ఒక్కటి ఇంతటి దుస్సాహసానికి ఒడికట్టెది కాదు "తోడు దొంగల" మాదిరిగా బ్రిటన్ ఫ్రాన్సులు ఈ కిరాతక కృత్యాన్ని ప్రారంభించినవి చెయ్యిజారిపోయిన సూయజ్ కాలువను మెరుపు యుద్ధం సాగించి చిటికెలో స్వాధీనపరుచుకుందామనే ఎత్తుగడ ఎత్తినవి. లాభం లేక పోయింది. నెలల పర్యంతంగా పన్నినకుట్ర ఎందుకూ కొరగాకుండా పోయింది. పైగా ఈజిప్టు వీరోచితమైన ప్రతిఘటన సాగించింది ఆకస్మికంగా వచ్చిపడిన అతి విషమపరిస్థితులలో రక్తపాత భీభత్సానికి ప్రెసిడెంట్ నాజర్ నాయకత్వాన అమోఘమైన మనోనిబ్బరంతో తట్టుకుని నిలవగలిగింది ప్రపంచ ప్రజాబాహుళ్యపు సానుభూతి సహకారాలనే గాక, సమితి అండదండలను కూడా పొందగలిగింది. బ్రిటన్ ఫ్రాన్సుల దుశ్చర్యను ఖండించడంలో అమెరికా స్థిర వైఖరిని ప్రదర్శించింది. అంతటితో బ్రిటన్ ఫ్రాన్సుల ఆటకట్టినంత పనిఅయింది.

* * *

బ్రిటిష్ ఫ్రెంచి ప్రధానులు కాలువను స్వాధీనం చేసుకుని, అవసరమని తోస్తే, దాన్ని తర్వాత ప్రపంచ రాజ్యసమితికి అప్పగిద్దామనుకున్నారు కాలువపై అంతర్జాతీయ ఆధిపత్యాన్ని స్థాపించి తీరాలనే పట్టుదల చూపిన బ్రిటన్ ఫ్రాన్సులు సమితి తమ చెప్పుచేతలకు లోబడివుండక ఏమి చేస్తుందనే ధీమాతో వ్యవహరించడం ప్రారంభించినవి. సమితి కార్యదర్శి డాగ్ హామ్మర్ షెల్డ్ అకుంఠిత ధైర్యసాహసాలతో పనిచేసిన కారణంగా బ్రిటన్ ఫ్రాన్సుల ఆట సాగలేదు. వాటికి శృంగభంగమైంది. కాలువప్రాంతాన్ని ఖాళీ చేసేది లేదని ముందు భీష్మించినా చివరకు ఈ రెండు సమితి ఆదేశాలను శిరసావహించక తప్పని పరిస్థితి ఏర్పడింది జట్లు జట్లుగా సేనల తొలగింపు ఇప్పుడే ప్రారంభమైనది.

* * *

వివిధ దేశాల నౌకలనూ దాదాపు యాభై వరకు ముంచివేసిన కారణంగా కాలువ ద్వారా రాకపోకలకు గతమాసం రోజుల నుంచీ తీవ్రమైన అవరోధం ఏర్పడింది కాలువ మరమ్మతు పూర్తి అయేవరకూ తమ సేనలు ఆ ప్రాంతంలోనే ఉంటవనీ, మరమ్మతుపనులను తామే సాగిస్తామనీ బ్రిటన్ మొదట వాదించింది. ఏదోవిధంగా కాలహరణం చేసి అక్కడ ప్రవేశించిన తమ సేనలు అక్కడే తిష్ఠ వేసేట్లు చూడడమే బ్రిటన్ ఫ్రాన్సుల పన్నాగం ఈశషభిషలు పనికి రావన్నాడు సమితి ప్రధాన కార్యదర్శి ముందు బ్రిటన్ ఫ్రాన్సులు తమ సేనలనుఉపసంహరించాలన్నాడుహామర్ షెల్డ్. అవసరమైన మరమ్మతు పనులన్నీ సమితీ ద్వారానే జరుగుతవని కూడా ఆయన స్పష్టపరిచాడు. కైరో రాజధానిలో మూడు రోజులపాటు సమాలోచనలుజరిపిన హామర్ షెల్డ్ నాసర్ల మధ్య సంపూర్ణ ఏకీభావం కుదిరింది బ్రిటిష్ ఫ్రెంచి సేనలు కాలువ ప్రాంతంనుంచి పూర్తిగా నిష్క్రమించే వరకూ కాలువ మరమ్మతు పనులను నిలిపి వేయవలసిందని కార్యదర్శి హామర్ షెల్డ్ ఆజ్ఞాపించాడు ఈజిప్టుపై దురాక్రమణతో సంబంధం లేని రాజ్యాల సహాయంద్వారా కాలువలోని నౌకలను బయటికి తీయించి మరమ్మతు పనులు చేయించదలచినట్లు సమితికి ఒక నివేదిక అందజేశాడు.

* * *

దురాక్రమణానంతరం సూయజ్ కాలువ రాజకీయ పరిణామాలు ఈ విధంగా తయారైతే, బ్రిటన్, పశ్చిమయూరపియన్ రాజ్యాలలో ఆర్థికపరిణామాలు మరీ అధ్వాన్నంగా తయారైనవి సూయజ్ కాలువద్వారా రాకపోక సౌకర్యాలు సక్రమంగా పనిచేస్తేనే, యూరపియన్ రాజ్యాల ఆర్థికవ్యవస్థ స్థిమితంగా వుండేది. బ్రిటన్ పై విజృంభించిన ఆగ్రహావేశంలో మధ్యప్రాచ్యంలో అమర్చిన నూనెసప్లయి గొట్టాలను అరబ్బుదేశాలు ధ్వంసం చేసి వేసినవి. నూనె సప్లయి ఆగిపోయే సరికి, బ్రిటన్ ఉక్కిరిబిక్కిరై పోతున్నది. నవంబరు మధ్యనుంచి పెట్రోలు రేషనింగును అమలుపరుచుకోవలసి వచ్చింది. నూనె సప్లయిచేసి సహాయపడవలసిందని అమెరికాను కోరితే, ముందు ఈజిప్టునుంచి సేనలను ఉపసంహరిస్తే తర్వాత మీ అభ్యర్థనను గురించి ఆలోచిస్తామని అమెరికా జవాబు చెప్పింది దానితో బ్రిటన్ కు తలప్రాణం తోకకువచ్చింది.

* * *

ఈవిధంగా బ్రిటన్ ఫ్రాన్సుల ప్రతిష్ఠ ఆర్థికంగా, నైతికంగా బుగ్గిపాలై పోయింది. ఈపరిస్థితులలో బ్రిటన్ కు ఏమి చేయడానికి ఆలోచనలు పాలుపోలేదు.

ఇది ఇలావుండగా, బ్రిటిష్ ప్రధాని అంథోనీ ఈడెన్ కు ఆరోగ్యభంగం జరిగిందని, అధికార బాధ్యతలను కామన్సు సభానాయకుడైన రిచర్డ్ బట్లర్ కు అప్పగించాడని లండన్ నుంచి వార్త.

"ఇప్పటికి ఏడాది నుంచీ ఏమాత్రం విరామంలేకుండా పనిచేస్తూ వచ్చిన కారణంచేత బ్రిటిష్ ప్రధాని ఈడెన్ చాలా బడలిక చెందాడు; విశ్రాంతి అవసరమని వైద్యులు సలహాఇచ్చారు" అని 10 డౌనింగు వీధి భవనంనుంచి ప్రకటన. ఇది వెలువడిన మూడోనాడే, ఈడెన్ విశ్రాంతి కోసం అట్లాంటిక్ తీరంలోని వలస ప్రాంతమైన జమైకాకు ప్రయాణమై వెళ్లాడు.

* * *

దేశంఅంతర్జాతీయంగా అతి విషమపరిస్థితులను ఎదుర్కొంటున్న సమయంలో సారథ్యం వహించవలసిన ప్రముఖనాయకుడు దేశంవదలి ఈవిధంగా వెళ్ళిపోవడం అపూర్వమైన విషయం. రాచకార్య నిర్వహణంతో ఈడెన్ బడలిక చెందాడనే అంటున్నారే గాని అసలు పరిస్థితి ఏమిటో ప్రపంచానికి తెలియదు ఇది ఈడెన్ అధికార సన్యాసానికి నాందికాదుగదా? అర్ధాంతరంగా ఎన్నికలు జరగవని ఎవరు చెప్పగలరు?

ఏదిఏమైనప్పటికీ, లోగుట్టు పెరుమాళ్ళకెరుక! ఇంతకూ చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ!!



## ★ హమేషా తమాషా ★



'ఫలించని ప్రేమ'

చిత్రకారుడు: పిళ్లా సుబ్బారావుశాస్త్రి

# [illegible]ంకాని అనుభవం

లింగం వీరభద్రయ్యచౌదరి

సెప్టెంబరు 26వ తేదీగల ఆంధ్ర పత్రిక సచిత్ర వారపత్రికలో శ్రీ కృష్ణగారి "ఆక్స్‌ఫర్డులో శృంగారలీలలు" అనే రచన చదివి చకితుడనైనాను. చదివినప్పుడు, వారు ఇంగ్లండుకు మొట్టమొదటిసారిగా వెళ్లారనీ, అక్కడి అపూర్వ దృశ్యాలు వారిని తలక్రిందులు చేసినవనీ అనుకున్నాను తాను బ్రిటన్‌లో ఐదు వారాలు మాత్రమే వున్నట్లు వ్రాసుకున్నారు. దాన్నిబట్టి, వారికి ఆ దేశానుభవము బహుస్వల్పమైనందువల్ల, విచక్షణ చేయలేకపోయినారేమో ననుకున్నాను. కాని వారి మొదటి (29-8-56) వ్యాసంలో తాము 28 సంవత్సరాలకు పూర్వమే ఇంగ్లండుకు వెళ్ళినట్లు వ్రాసుకున్నారు ఎందుకు వెళ్ళినది తెల్పలేదు ధోరణిని బట్టి చూడగా, చదువుకోడానికి వెళ్ళి వుండలేదని, ఆసామాషీకో, వ్యాపారరీత్యానో వెళ్ళివున్నారనీ తోస్తుంది. ఈ ఊహ సరియైనదయితే, వారికి ఆ దేశపు విశ్వవిద్యాలయాలనుగురించిగాని అందలి విద్యార్థుల విషయములలో గాని, స్వానుభవము లేదని తేలుతుంది విచిత్రమేమంటే, వారి ఇప్పటి ఐదు వారాలపర్యటన కార్యక్రమములో ఆక్స్‌ఫర్డును చేర్చలేదు. ఆ నగరం వారు వెళ్ళినట్లుగాని, అచ్చటి విద్యార్థులతో పరిచయం సంపాదించుకొన్నట్లు గాని కన్పడదు వారు కేంబ్రిడ్జి వెళ్లారు కాని, వారెవరిని కలుసుకొనవలెనని అక్కడకు వెళ్ళినారో, వారిద్దరు (స్పియర్, ఇయాక్ స్టీఫెన్స) వారి కొక చీటి ముక్కనైనా, వ్రాసిపెట్టిపోకుండా ఆ నగరం నుంచి అదృశ్యులయినారు అక్కడి పబ్లిక్ రిలేషన్సు ఆఫీసరు వ్యవధి లేదని చెప్పినందున ఏ ప్రముఖుని కలుసుకోకుండానే, తిరిగి వచ్చినారు విద్యార్థులతో ఏ మాత్రం పరిచయమూ కలిగించుకొన్నట్లు కన్పడదు. కాని వీరు ఆక్స్‌ఫర్డు విద్యార్థులను గురించి అసమంజసముగా, అసభ్యముగా వ్రాయ సాహసించారు. అంతే గాదు; ఆ విశ్వవిద్యాలయం యావత్తూ కుళ్లుకంపుగా వున్నదని తేల్చి చెప్పడానికి ప్రయత్నించారు. పక్షపాతమెందుకని కేంబ్రిడ్జి విద్యార్థులను కూడా అవినీతిపరులుగా వర్ణించారు.

పైగా, ఈ రెండు ప్రఖ్యాత విశ్వవిద్యాలయాల ఉదాహరణంతో బ్రిటీషు యువకుల జాతి, అధోగతి పాలవుతున్నట్లు సూచించారు. వీరితీర్పు కాధారము వార్మన్ లాంగ్ మేట్ వ్రాసిన "ఆక్స్‌ఫర్డు ట్రయంఫెంటు" అనే గ్రంథమట దీనినుంచి కొన్ని వాక్యాలు ఎత్తి వ్రాసి పై నిశ్చయానికి వచ్చారు. "ఆక్స్‌ఫర్డు ట్రయంఫెంటు" అనగా "దిగ్విజయ ఆక్స్‌ఫర్డు" అని అర్థం. దీనినిబట్టి, ఆక్స్‌ఫర్డు పతనమౌతున్నదని తోచునా? గ్రంథరచయిత ఆక్స్‌ఫర్డు విద్యార్థుల జీవితాన్ని వర్ణిస్తూ, కొంతమంది విద్యార్థులలో ఒక చెడు లక్షణము కూడ కనిపించినట్లు చెప్పారు ఆ చెడులక్షణము (ఏకలైంగికదుష్కామము) కూడ కొంత కాలము తర్వాత దానంతటకదే సర్దుకుంటుంది అని కూడా తెలియజెప్పినారు కాని ఈ ధోరణి "గుడ్డివాడు, ఏనుగు" కథను గుర్తుకు తెస్తున్నది

ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయము బహుముఖమైనది. అది యొక గొప్ప మూస రకరకాల విద్యార్థులను తన సముజ్వల గాఢాలింగనములోనికి దిసికొని, మురిపించి, కరగించి, వడగట్టి నిగుడేల్చుతుంది అది ఒక మహామాత-తన విశాలహృదయానికి హత్తుకొని, లాలించి, పాలించి, తీర్చిదిద్దుతుంది అచ్చటి విద్యార్థుల, జ్ఞానసముపార్జనలో ఎట్టి నిషేధము (ఇన్‌హిబిషన్) లేక, స్వేచ్ఛాపూర్వక స్వచ్ఛంద వాతావరణంలో ఉత్తేజితులవుతారు విద్యార్థి వ్యక్తిత్వము సర్వతోముఖంగా, పరిపూర్ణత నొందడానికి విశ్వవిద్యాలయమన్ని విధములా అవకాశమిస్తుంది ఆయా విద్యార్థుల మనోవైదగ్ధ్యము, రాజకీయ ఆర్థిక దృక్పథము, లలితకళారాధన, రసాత్మక చింతనలను బట్టి పలువిధములైన విద్యార్థి సంఘములు, కూట

(47-పేజీ చూడండి)

# తిక్కన

[బృందగానము]

శ్రీహరి లోకస్థితి కారకుడై
వెలుగుచునుండగ శివు నేమిటికో
చేరిభజింతురు మూఢులటంచును
చెప్పెడివారలు ఘనులో
మంగళకరుడగు శంకరుడుండగ
విష్ణుని గొలుచుట తగవో
అనియెడువారలు ఘనులో .. శ్రీహరి॥
తెలియక లోకులు తికమకపడుతటి
తిక్కన పుట్టెను తీర్పరియై
సృష్టిస్థితిలయ కారకు డొక్కడె
పరమేశ్వరుడని మున్నటి సభలో
తీర్పరి తిక్కన తెల్పెను గదరా!
లోకక్షేమంకరమగు మార్గము
తిక్కనవాక్కుల వినలేదో... సృష్టిస్థితి॥
ఏటికి తగవులు మానుడు మోక్ష
ప్రాప్తికి మార్గము కనుగొనుడీ

* * *

తిక్కన -కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా పరిష్క్రియా యాం బహుమన్య సేత్వం? కిం కాలకూటం కిము వా యశోదా స్తన్యం తవ స్వాదు వద ప్రభో! మే॥

గురునాథుడు గురువర్యా, తమ పరిష్కారం ప్రజలలో ఇప్పటికే గొప్పమార్పు తెచ్చినట్లున్నది

తి ఎవరు? గురునాథమా? నాయనా! చిన్న సందేహము తోచినదోయీ!

గురు సర్వకవితాస్పృహకర్తా, తమకా సందేహము! ఏదో శ్లోకము చదువుచున్నారు? అది సందేహము నే స్ఫురింపజేయుచున్నది అది మరొక్కమారు సెలవింక. అది తమ రచన మేయగు నకొందును.

తి బిడ్డా, ఒకనివ్యక్తిపొందిన నా చిత్తమున కొక వింత యూహ పొడమినది. వినుము. "కి మాస్థిమాలా . ." (మరల చదువును)

గురు: గురువర్యా, నా సందేహము తీరినది

తి: ఏమిసందేహము? అదెట్లు తీరినది?

గురు: మీకు సందేహమెట్లు కలిగినదో అని సందియపడితిని. మీకు సందియము లేదని తోచుటయే నాసందేహము తీరుట.

తి. చక్కగమాటాడితివిరా నాయనా!

## పాత్రలు:

తిక్కన : కవి
గురునాథము: తిక్కన శిష్యుడు
మనుమసిద్ధి : నెల్లూరురాజు
గణపతి } ఓరుగల్లురాజు
రుద్రదేవుడు }
శివదేవయ్య: గణపతి-మంత్రి
పౌరుడు :
సేవకుడు :
వందిమాగధులు :

గురు. నాయందుమీకున్న అనుగ్రహమే, ఇప్పుడిట్లు మీ కొభాసించినది.

తి ఔనుగాని గురూ! నీవేదో చెప్ప వచ్చినట్లున్నావు?

గురు: పరమగురువర్యా! తమ చే నే నట్లనిపించుకొనుట నాకు బాధాకరముగ నున్నది

తి అదికాదురా గురునాథమూ! అది నీకు నా ముద్దుపేరు లోకైకగురుడు హరిహరనాథుడే. 'ఏకమే వాద్వితీయం బ్రహ్మ'

గురు మనుమ సిద్ధిభూపాలుని సభలో మొన్న తా మొనర్చిన దివ్యోపదేశమున సర్వమతసమైక్యతకు దారిచూపు చిన్నెలు కానవచ్చుచున్నవన్నారు

తి ధన్యోస్మి, ఒరే, గురునాథమూ! వ్యాసభారతము ననువదించెదనురా!

గురు కవివర్యా, అది అరణ్యమున పడినదని నేను దుఃఖించుచుందును నేడు మహాపర్వదినమువలె తోచుచున్నది. నా కంతటను శుభసందేశమే వినిపించుచున్నది

తి దానినటుండనిమ్ము. విరాటను దొర కొని పదునెనిమిది పర్వములు త్వరలో తెనిగింపవలెను.

గురు: తమదయ.

తి: నీ దయయు ఉండవలెనుగదా!

గురు మహాత్మా! తమ పరిహాసాదరము నా హృదయము భరించుకోలేకున్నది.

తి. తొందరపడకు గురూ!

గురు: పరమేశ్వరా! లోకైకగురూ!

తి: నీవు ప్రాయసకాడవు కావలెనని నా యూహ

గురు. తమ అనుగ్రహ మున్న అదెంత పని?

తి మరి నీవు తొందరగాడవుకదా!

గురు కావలసినదదియేగదా గురువర్యా!

తి త్వరపడి, ఒకమాట కింకొక అర్థము చేసుకొనుటా?

గురు: ఆచార్యా, క్షమింపుము. లేఖినికి త్వర ఆవశ్యకమంటిని

తి నా వాక్కు ననుసరించు వేగము నీ గంటమున కున్నదా?

గురు: ఉన్నది.

తి ఎక్కడిది?

గురు. తమను శుశ్రూషించిన భాగ్యముచే ప్రాప్తించినది

తి. నిజమా?

గురు: నిజమే

తి అటయిన అర్థము చేసికొను బాధ్యత నీకు లేదా?

గురు: ఆ మహాయజ్ఞము ప్రారంభించినంత నే తదర్థవిజ్ఞానసామర్థ్యము తామే నా కబ్బింతురని నా విశ్వాసము

తి అన్నట్లు గురూ! ఒక యజ్ఞము చేయవలయునురా!

గురు తత్సంకల్పమైనది గదా!

తి అదియే నీతొందర

గురు: స్వామీ! మన్నింపుడు.

తి సోమయాజినై, భారతానువాద మహాధ్వరము నారంభించెద ననుచున్నాను.

గురు: తిక్కయజ్వా, నా ఒడలు పొంగుచున్నది.

★ జోశ్యుల సూర్యనారాయణమూర్తి ★

# ★ తిక్కన ★

తి నీతోందరవన్నప్పు జేయజ్ఞను గూడ చేసినది.

గురు: కవిబ్రహ్మ, నేనిక భారతరచనము చేయఁనే ఉండలేను.

తి నీవే చేయుదువా?

గురు. మీ వాగ్రూపమునకు నా లిపిరూపమని నా తలంపు; క్షమింపుడు

తి. పూర్తిగ వ్రాయనిదే, నిన్ను క్షమించుట ఎట్లు?

గురు. కృతిపతి మనుమసిద్ధియేనా మహాప్రభూ!

తి: నన్ను ప్రభు అనుచున్నావేమిరా!

గురు లేదు మహామంత్రీ, క్షమింపుడు.

తి. ఓరి, నీ తెలివి బంగారముగానూ?

గురు: మీ దయవల్ల అట్లే కానున్నది

తి: నిర్వచనోత్తర రామాయణమంతయు వివి, రామునకు సీత యేమగునన్నట్లున్నది!

గురు: మీ యనుగ్రహమున్నచో, నిర్వచనోత్తర రామాయణములో అపుట



యేల? భారత కృతిపతిమాత్రము అతడేల కావలెను?

తి అదియే నీ దేశకాలజ్ఞానవిహీనత

గురు: నా ఒడలి పొంగు, కడలి పొంగగుచున్నది.

తి. ఒక్క నిమిషమది ఆపి, భారత కృతిపతి ఎవ్వరో చెప్పుము

గురు ఉభయకవిమిత్రా! అర్థమైనది. హరిహరనాథుడు.

తి. శాబాసు, నా హృదయమెఱింగితివి. తెలుగు భారతము వ్రాయతగ్గవాడవు

గురు: ఎప్పుడు?

తి మనుమసిద్ధి ఆదేశము కూడ వినది. యజ్ఞానంతరము ఆరంభింతము

గురు. తండ్రీ! ధన్యుడను.

## [2 వ రంగము]

వందిమాగధులు. జయజయ, మహారాజాధిరాజ, పత్క విమిత్ర పరాస్తపలవ, చోళస్థాపనాచార్య తిక్కభూపాలపుత్రా, విక్రమసింహపురాధిపా, మనుకులదీపా, మనుమసిద్ధి జనాధిపా! బహుపరాక్.

[దూరమున తూర్యధ్వనులు]

సేవకుడు. మహారాజా, తిక్కనామాత్యులు వేంచేయుచున్నట్లున్నారు

మనుమసిద్ధి: స్వాగతము నెరపి దర్బారులోనికి గొనిరండు. నేనును ఎదురువచ్చుచున్నాను

[తూర్యధ్వనులు దగ్గరపడును]

మను. శ్రీమదుభయకవిమిత్రా, కొమ్మనామాత్యపుత్రా, బుధారాధనవిరాజీ, తిక్కన సోమయాజీ, నమస్కారము

తిక్కన: మహారాజ మనుమసిద్ధీ, నీ సకల మనోరథములు సిద్ధించుగాక.

మను మామా! ఆసనము నలంకరింపుడు. నా ఉద్యోగము సఫలమగుచునే యున్నది మీవంటి దండనాయకులు నా కండయై అజ్ఞానాంధకారము పోగొట్టు కవిభాస్కరులై ఉదయించుచుండగా, నాకు కొదువ ఏముండును! మామా! ఉద్యోగపర్వము పూర్తియైనదా?

తిక్కన. చెప్పలేదుగా బోలు! ఉద్యోగమప్పుడే పూర్తియైనది యుద్ధపర్వములు కూడ త్వరగ ముందుకు సాగుచున్నవి. శాంతి సప్తకము త్వరలోనే అందుకొందము

మను. వినచో నా చిత్తమునకును శాంతియేర్పడినట్లే కాని మహాకవీ, ఏదో తెలియని ఆందోళనము నా యెద నంటియే యున్నది

తి నే నెఱుగుదును. ఏమియు నుండదు లే ఎల్లయర్థములు సుసంగతములై శుభోదర్కముగా విరాజిల్లుదువు. నేను గుంటూరునకు పయనమైతిని. నిన్నును వెంట నిడుకొని పోవలెనన్న తలంపుతో వచ్చితిని.

మను మామా! ఉత్సవములకా! నేనను కొనుచునే యున్నాను. కాని ఇప్పటి ఇక్కడి కార్యభారము మీ రెరుగనిది కాదు గదా! మీవంటి దండనాయకుని అండ వీడుటకు కూడ నిజమునకు నాకిష్టమిష్టములేదు కాని ఇప్పటి పరిస్థితులలో ఈ యేడైనను మీ రచటికి వెళ్ళకుండుట తగవు కాదని మిమ్మును పోనిచ్చుచున్నాను మీరైనచో అక్కడ నా పాత్రకూడ నిర్వహింపగలరు మిమ్మొసి నే వెళ్లుట ప్రయోజనకారి కాదు

తి మహారాజా! అటంటివేమి? మా తండ్రిగారికి నేనెంతో, నీవు నంతే

మను. అందుచేతనే తనుయజ్ఞ మిక్కడ కొనసాగినది

తి. అంతేయు ఈశ్వరేచ్ఛ ఓరుగల్లుకూడ పోయి రావలెనని ఉన్నది.

మను ఈ రాజ్యము మీది. మీ ఇచ్ఛ వచ్చినట్లు చేయుడు.

తి ఈ రాజ్యము నీదే చేసెదనులే శాంతచిత్తముతో నుండుము. పోయివత్తునా.

మను రాజకీయధురంధరా! సెలవు

## [3 వ రంగము]

### బృందగానము

అన్యాయమ్ముగ అక్కట బయ్యన<br>
లాక్రమించుకొనదలచిరి రాజ్యము<br>
మనుమసిద్ధి మృగయాలంపటుడై<br>
అడవికి నేగిన అదను కనుంగొని<br>
ఆక్రమించి బంధించిరి రాజును॥ అన్యా॥<br>
అయ్యో తిక్కన కవివరుడయ్యోగ<br>
ఆదుకొనక తన యూరేగను<br>
ఉత్సవమ్ముల సందడిలో పడి<br>
ఊరుకొనెనో యేమో!॥ అన్యా॥

పౌరుడు: అయ్యా, గురునాథం! గుంటూరు వెళ్లావని విన్నామే? ఎప్పుడు వచ్చావు?

గురు. ఇప్పుడేనయ్యా, ఏమిటి విశేషాలు?

పౌరు నీకింకా తెలియలా? పెద్దచిక్కే వచ్చింది. సూర్యవంశపురాజు, మహారాజు, చల్లగా పాలిస్తున్నాడు. ఏ బాధ లూ ఎరగ మింతవరకు. రేపటినుంచి మన గతులేమవుతాయో? మీ గురువుగారు రాలేదు బాబూ!

గురు ఏదో కాలప్రభావం! జీవికి మనమేం చెయ్యలేం. మా గురువుగారిక్కడికి రాలేదులే వారేదో పనిమీదింకెక్కడికో వెళ్లారు

పౌరు ఎక్కడికి బాబూ!

గురు అది రహస్యము ఈ నడివీథిలో ఎందుకు? లోపలికిరా! చెపుతాను.

తెర పడుబాబూ పడు

## [4 వ రంగము]

తిక్కన —

శ్రీ యన గౌరినా బరగు చెల్వకు
చిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు
రూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని
పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చు పరతత్త్వము
గొల్చెద నిష్టసిద్ధికిన్"

గణపతి రుద్రదేవుడు — తిక్కయజ్వా, కవిబ్రహ్మా, తమిన్ని రోజులుగ వ్యాసభారతార్థమును, ద్వైతాద్వైతములు, ప్రకట ధర్మాధర్మపదతులు, వ్యాఖ్యానము చేసి చెప్పినదొక యెత్తు, ఈపద్య మొకయెత్తు అనిపించుచున్నది.

మహాత్మా, తమరు నిజముగ లోకక్షేమంకరులై ఉద్భవిల్లిరి. తప్పక భారతమునకు సమగ్రాంధ్రరూప మిచ్చి దేశమున వెలయింపవలసిన అవసరము వచ్చినది

తిక్కన — సమయజ్ఞా, గణపతి రుద్రదేవ మహాప్రభూ! తమ అపార విక్రమమునకు తోడు, తమ వైదికధ్యాయితకు ఆ పరతత్త్వము ఇచ్చ మెచ్చును.

గణపతి — మహామంత్రీ! నీ ప్రతిష్ఠ యంతయు నాకు విదితపూర్వమే అయినను, భారతామ్నాయమునకు వ్యాఖ్యానము చెప్పునప్పుడు తాము వెల్లడించిన రాజనీతిప్రకారము తమ సహజ సముదాత్త ప్రతిభావిశేషమును అడుగడుగునకు వెల్లడించినది శివదేవయ్యగారూ! తమకెట్లు తోచినది? నా ఊహ సరియేనా?

శివదేవయ్య — మహాప్రభూ! తాము దక్కగా సెలవిచ్చిరి. అసలా ఉద్యోగపర్వము వ్యాఖ్యానించునప్పుడు, ఈ తిక్కయజ్వముఖములో, గంభీరముద్రతో పాటు ఏదో కార్యదీక్ష కూడ నాకు తోచినది

గణపతి — ఆ మహాభారతవీరుల మహిమ కళ్ళకు కట్టినట్లున్నది. తిక్కయజ్వ మన భాగ్యవిశేషంవల్ల మన కొలువునకు దయచేసి, ఈ పది రోజులు తమ అనంత బహుముఖప్రజ్ఞ వెలయించి, భారతామ్నాయము వినిపించినందులకు నా రాజ్యమంతయు ఇచ్చినా చాలదని నే నెరుగుదును. అసలు నా కీ మహాకవిముఖములో మా మహామంత్రి సెలవిచ్చినట్లు ఏదో అవ్యక్తమయిన వ్యగ్రత పొడగట్టుచున్నది. అందుచే భారతామ్నాయపఠన మింక ప్రస్తుత మాపవలెనని నాకు తోచినది. నిజమునకు ఎంతకాలము విన్నను మనకీ మహాగ్రంథ స్వవిషయము లింత పదార్థవ్యాఖ్యనంగునప్పుడు తృప్తిపొడమదు. కాని ఇప్పుడీ సోమయాజులవారి భారత ప్రారంభమైన పద్యము విన్న నాచిత్తమునకు ఎందుచేతనో ఆంధ్ర భారతమందలి కొన్ని పద్దెములు వినవలెనని తోచుచున్నది. ఈ సవలక్షు ధనము, ఈ యజ్ఞకుండలములు మాత్రమొసగి నాభక్తి నెరపుచున్నాను.

(సభలో కరతాళ కలకల ధ్వనులు)

తిక్కన — ధన్యోస్మి మహాప్రభూ, నా యూహలన్నియు తమ కేరూపమున జెప్పినవేమి? నా మాటలు విన్నారు. వ్యాసహృదయము నా నేర్చినభంగి చెప్పితిని. ఇట్లే పద్యములలో పూర్తిచేసి చెప్పి భక్తకోటికి వరణీయము నొనర్చెదనని విన్నవించుచున్నాను. తమ ఆమోదముద్ర చూడగ నా యొనర్చు భారతామ్నాయము ఆంధ్రావళి మోదము పొరయునట్లుగా ఉండగలదని విశ్వాసము మహాప్రభూ! కథ జగత్ప్రసిద్ధ గావున ప్రత్యేక సందర్భవివరణ మక్కరలేకయే సర్వజ్ఞులనదగిన తమ రసజ్ఞ సభలో అక్కడక్కడ నాల్గుపద్దెములు చదివెదను.

ఉత్తరగోగ్రహణ ఘట్టములో అజ్ఞాతవాసమయభంగశంకతో ద్రోణుడను మాటలు.

వెరవరిగాక పీడు పగవీరులకుం
బొడసూపువాడె యె
వ్వగ వొక్క్రము నిపేర నిట
నేరగవచ్చునన్న నా డహం
కరణము గాని యుండొకటి
గానడు మూర్తివిశేష మారయన్
సురపతియట్ల, వీనిమది చొప్పది
యెట్లొ యెఱుంగ నయ్యెడున్"

భీష్ముని సమాధానము.—

"కలపగ రిపులకు నిమ్మగు
కొలది గడచి వచ్చితిమి అకుంఠిత బాహా
బలము సెలుప దఱియయ్యెను
గెలిపింపవల దింక మనకు శత్రులవలనన్."

శివదేవయ్య - తిక్కన సోమయాజి మహామంత్రివోలె నా కగపడుచున్నాడు గాని కవివలె కాదు

గణపతి మహామంత్రీ! తమకట్లే కనిపించును. మధ్యలో ప్రసంగమేల? మరి రెండు పద్యములు విందము.

తిక్కన: సంధికి పంపుచు కృష్ణునితో ధర్మరాజు:

ఆపద గడవం బెట్టగ
ఓపి శుభం బెవడానిపొడగూర్చను నా
కీ పుట్టువునకు పాండు
క్ష్మాపాలుడు నిన్ను చూపి చనియె మహాత్మా!
'నమ్మె యెఱుగు దెదిరి నెఱుగుదు
నెమ్మి యెఱుంగు దర్పసిద్ధి నెట్టి యెఱుం
[గుదు నా
కృత్యమ్ములపద్ధతి నెఱుంగుదు
నే మైవ్వడ నేను నీకు బుద్ధులు సెప్పన్.

కృష్ణుడు సభలో పలికిన ఈ రెండు మాటలతో నామాటల నాపెదను; క్షమింపుడు ప్రభూ!

జననాథ నీ యెఱుంగని
పనులు గలవె యైన దగవు బరమహితంబుం
ఎనవారికి జెప్పగదగు [మంచిన్.
నని వచ్చితి భారతాన్వయము ప్రియము

పారపు ధర్మముకు విమల సత్యము
శాపము చేత బొంకు చే
పారము బొందలేక చెడబారినదైన
యవస్థ దక్షులై
వ్వార లుపేక్ష సేసి గది వారల
చేటగుగాని ధర్మని
స్తారకమయ్యు సత్యశుభదాయక
మయ్యును దైవ ముండెడున్"

గణపతి తిక్కయజ్వా, మీ భారతామ్నాయము సమగ్రమై వర్ధిలి లోకమున కొసంగుడు.

మహామంత్రీ! శివదేవయ్యగారూ! తమ యూహలు పరేంగితజ్ఞములైనవి. తిక్కనగారిని తమ యాంతరికమైన కోరిక యేదో వెల్లడింపగోరుచున్నాను. వారి కోర్కె దీర్చ నేను దక్షుడనని వారికి దోచినచో ఆ ధర్మమేదో నేను గ్రహించి ఇప్పటువ నాధర్మము నెఱవేర్ప దలంతును

తిక్కన — మహారాజా! కృపామతీ! మాప్రభువు మనుమసిద్ధి అక్కన్న బయ్యన్నలచే బంధింపబడినాడని కంటూరులో నున్న నాకు దెలియవచ్చి అక్కడ నుండియే తమదర్శనార్థమై వచ్చితిని. తమకు నే నేమి విన్నవించుకొనుటకును తగిన యవకాశమే చిక్కక తామొనర్చిన మర్యాదల నందుకొనుచు, నా నేర్చినభంగి వింధుపన్యాసములు నెరపితిని. నా ప్రాణములు నెల్లూరిలో నున్నవి ప్రభూ! రక్షింపవలెను.

గణపతి — తిక్కన మంత్రీ! ధ్వనిమార్గమున తాము తమవచ్చిన పని నెఱవేర్చికొన్నారు. ఇక నే నాలసింపను. తమరు త్వరపడుచున్నట్లున్నారు. నెల్లూరికి పయనము కావచ్చును

శివదేవయ్యగారూ! సేనలను నడుపుకొని నేనే స్వయముగాపోయి మనుమసిద్ధిని రాజ్యప్రతిష్ఠితుని చేసి వచ్చెదను. త్వరగా సర్వసన్నాహములు చేయవలెను.

శివదేవయ్య: చిత్తము మహారాజా! సర్వము సంపన్నము చేయింతును

తిక్కన ధన్యోస్మి, సెలవు మహారాజా! సెలవు

[యుద్ధభేరులు - వాద్యములు] ★

# నేడే చూడండి...

# దేవత

..హింద...

నారాయణన్ కంపెనీ వారి
చిత్రము



విజయవాడ • శ్రీ సరస్వతిపిక్చర్‌ప్యాలెస్
గుంటూరు • శ్రీ సరస్వతిపిక్చర్‌ప్యాలెస్
నెల్లూరు • శేష్‌మహల్
రాజమండ్రి • అశోక్ మహల్
కాకినాడ • క్రౌన్ టాకీస్
విజయనగరం • శ్రీ కృష్ణాసినిమా
విశాఖపట్నం • శ్రీ సరస్వతి పిక్చర్‌ప్యాలెస్
కర్నూలు • చాంద్‌టాకీస్
అదోని • వసంత్ పిక్చర్-ప్యాలెస్ లలో

వాహినీ వారి విడుదల

BAKTHA

సంగీతము • సి. రామచంద్ర ✦ దర్శకత్వం • పట్టన్న

# చీకటి వెలుగులు

రాత్రి బండిలో నిర్మల నాంపల్లి స్టేషనులో దిగింది. స్టేషన్ దగ్గరికి భర్త వస్తాడో, కారు పంపుతాడో అనుకున్న ఆమె ఆలోచనలు వట్టిఅడియాసలయ్యాయి రిక్షా చేసుకొని వెళ్ళి తలుపు తట్టింది చాలా సేపటికి తలుపుతీసి తీవ్రంగాచూసి క్రోధ కంపితస్వరంతో "ఎవరు రమ్మన్నారని వచ్చావ్? బయటికినడు" అని కసిరికొట్టి తలుపువేసేసుకొని లోపలికి వెళ్లాడు వీరభద్రరావు

ఆమె బయట అలాగే మంచులో చీకటిలో నిల్చుండి పోయింది కన్నీరు చెక్కిళ్ళ మీదుగా జారి పమిటంతా తడిపి వేశాయి ఇంత దారుణమైనశిక్షకు తనుచేసిన తప్పేమిటో ఎరుగని ఆమె భయంతో గజ గజ వణకిపోసాగింది నిస్పృహో, నిస్సహాయతో ఆమె చుట్టూ మరింత చీకటిగూడు అల్లుకో మొదలు పెట్టాయి దుఃఖావేశంతో ఆమె మనస్సు పట్టుతప్పి పోయింది.

కోళ్ళు కూయసాగాయి క్రమంగా జనం రాకపోకలు సాగించారు. ఆమె అక్కడే మూర్తీభవించిన శోక దేవతలా పడిఉంది

రావు వున్న డాబాకు ఎదురుగాఉన్న మేడ క్రింది అంతస్థులో డాక్టర్ వెంకట రమణ ఉంటున్నాడు తలుపు తట్టిన చప్పుడుతో అతనికి నిద్రా భంగమై కోపంతో ఏదో అంటూ విసురుగా తలుపు వేసిన చప్పుడూ తరువాత కుమిలి కుమిలి సన్నగా ఏడుస్తున్న చప్పుడూ అతనికి యిక నిద్రను పట్టనివ్వలేగు.

తెల్లవారేవరకు ఓపిక పట్టి తెల్లవారు తూనే నిర్మల దగ్గరకు వెళ్ళి "ఏమిటి?" అని అడిగాడు ఏమీ చెప్పలేకపోయింది

ఎండెక్కింది. తలుపు తెరవబడలేదు

ఎప్పటికో రావు డ్రెస్ చేసుకొని వచ్చి యింటికి తాళంవేసి కారు డ్రైవ్ చేసుకొంటూ ఎక్కడికో వెళ్ళాడు.

రమణ గంటల తరబడి చూశాడు నిర్మల దగ్గరికి వెళ్లి "రావు వచ్చాక నేను మాట్లాడతాను. అంతవరకు మా యింట్లో వుండ"మని బ్రతిమలాడి బలవంత పెట్టాడు తన ఇంటికి పిల్చుకువెళ్లాడు.

రావు, రమణ యిళ్ళు ఎదురెదురుగా ఉండటంవల్ల పరిచయం ఏర్పడి స్నేహితులయ్యారు నిర్మల రమణను 'అన్నయ్యా' అని పిల్చేది రమణ నిర్మలను 'అమ్మాయీ' అని పిల్చేవాడు ఆమెను అంతగా బలవంతం చేయడానికీ, బ్రతిమలాడటానికీ ఆ చనువే కారణం రావు వచ్చాక మాట్లాడి విషయం ఏమిటో తెలుసుకొని సరిచెయ్యవచ్చుగదా అని అతని ధైర్యం

రావు మూడు రోజులకుగాని రాలేదు. తరువాత రమణ అతనితో మాట్లాడాడు. అతను నిర్మల తన దగ్గర ఉండటానికి ఒప్పుకోలేదు. కారణమేమిటో స్పష్టంగా చెప్పలేదు నిర్మల తనకు ఎంత దూరంగావుంటే తన జీవితానికి అంత శాంతీ, సుఖం ఉంటాయనీ, ఆమె పెరిగిన విధం, ఆమె చదువు సంస్కారాలు తనకు అనుకూల పడలేదని, ఆమెవల్ల ఏ లోపమూ లేదనీ, ఆమె బ్రతుకు ఆమె బ్రతకవచ్చనీ, కావలిస్తే డబ్బుపంపుతూ ఉంటాననీ చెప్పాడు రమణ ఎంతో దూరం 'నీవంటి చదువుకున్నవాడు యిది చేయకూడని పనీ, ఎవడో మూర్ఖుడు చెయ్యవలసిన పనీ' చెప్పిచూశాడు ప్రయోజనం లేకపోయింది ఏమి చెయ్యటం అనే సందిగ్ధావస్థలో పడ్డాడు

చక్రవర్తి రంగస్వామి

ఆమెకు యీ సంగతంతా ఎలానో కష్టపడుతూ చెప్పాడు

అది విని ఆమె ముఖం పాలిపోయింది ఏమీ తోచక కుప్పకూలిపోయింది అంతులేని కన్నీరుకార్చింది. కుమిలి కుమిలి ఏడ్చింది.

ఆమె దుఃఖాన్ని చూసి రమణ మనస్సు క్షోభ పడిపోయింది

"అన్నయ్యా, ఇక ఎక్కడికి వెళ్ళను? అమ్మ ఎప్పుడో చనిపోయింది నాన్న ఈ మధ్యనే చనిపోయాడు. పుట్టిన ఊరికి వెళ్లి ఏమని చెప్పుకోవాలి? ఏ తప్పూలేనిది భర్త ఎందుకు వదిలి పెట్టాడని లోకం అనుకోదా? ఇక ఎల్లాగ?" అని అంది చెమర్చిన కళ్ళతో చూస్తూ నిర్మల.

"అయితే యిక్కడే ఉండిపో అమ్మాయీ" అన్నాడు రమణ ఆర్ద్ర కంఠంతో.

"అలాగే అన్నయ్యా ఇక్కడుంటే వారిని అప్పుడప్పుడూ కళ్ళతో నైనా చూస్తూ ఉంటాను" అంది

డాక్టరు వెంకట్రమణకు గవర్నమెంట్ హాస్పిటల్‌లో రోజుకు కొన్ని గంటలు మాత్రమే పని మిగిలిన సమయంలో నగరంలో రెండుచోట్ల వున్న స్వంత డిస్పెన్సరీలను చూసుకొంటూ ఉంటాడు. ఆదాయానికి ఏమీ లోటులేదు.

అతను వివాహం చేసుకోతలచలేదు. అందువల్లే ఎన్ని సంబంధాలు వచ్చినా యింతవరకు త్రోసివేశాడు. ఏ బంధం లేకుండా హాయిగా బ్రతకాలని అతని ఉబలాటం

అతని యింట్లో అతనూ, పెంపుడు కుక్కా, పెంపుడు పిల్లీ, వంటవాడూ, పని మనిషీ ఉంటారు నర్సూ, కాంపౌండరు, డ్రైవరూ ఆయా సమయాలోవచ్చి వెళుతూ ఉంటాగు

శోకమూర్తి నిర్మల కొత్తగా అతని పాదాలకు చుట్టుకుంది.

* * *

రావుకు ఇంజనీరింగ్ చదువుతూ ఉండగానే నిర్మలతో వైభవంగా వివాహం జరిగింది. తగిన కట్నం, లాంఛనాలూ యథావిధిగా ముట్టాయి. ఆ కొత్తరోజుల్లో ఆమెను అత్యధిక వ్యామోహంతో చూశాడు. అద్దము వంటి ఆమె మనస్సూ, వెన్నెలవంటి ఆమె శరీర కాంతీ, పొంగుతూన్న యౌవనపు మిసమిసా, పల్లెటూరి జీవనం యిచ్చిన శరీర సౌష్ఠవమూ, సహజప్రాప్త సౌందర్యమూ అతనికి వెర్రులెక్కించాయి

అలా కొంతకాలం వుండి ఉన్నత విద్యకోసం ఇంగ్లండు వెళ్ళాడు కొత్త డిగ్రీలతో పెద్ద హోదాతో సుఖంగా తిరిగివచ్చి హైదరాబాద్‌లో పెద్ద జీతంతో ఉద్యోగంలో ప్రవేశించాడు

తరువాత కొన్ని రోజులకే వసంతతో పరిచయమయింది.

వసంత హైదరాబాద్‌లోనే పుట్టి పెరిగి కళాశాలలో చదివింది నాలుగైగు భాషలలో మాటాడ గలిగి సభలు, సమావేశాల్లో పాల్గొంటూ అందరి పరిచయాన్నీ పొందుతూ ఉండేది ఆమెలో వయసూ, అందంతోపాటు నిర్మలలో లేని నవనాగరికత తెచ్చిపెటిన పట్నవాసపు ఒయ్యారమూ, ఉత్సాహ వైగష్యాలూ ప్రత్యేక ఆకర్షణను కలిగించి అతన్ని వ్యామోహ పెటాయి

ఆమె యింకా వివాహం మాడలేదు పట్న

 

# చీకటి వెలుగులు



వాసపు నాగరికత జీర్ణించి, సంఘాన్ని లక్ష్యపెట్టవలసిన అవసరం లేనంత ఆర్థిక స్తోమతున్న వాళ్ళయింట్లో ఇదొక సమస్య కాలేకపోయింది

పైగా, చదువు పూర్తిఅయిన కొద్దికాలానికే ఆమెకు స్త్రీల కళాశాలలో ఉద్యోగం కూడా లభించింది

రావుకు వసంతకు కలిగిన పరిచయం స్నేహంగా పరిణమించి ఏదో మైకం వాళ్ళ మనస్సులమీద తెరకట్టింది వసంత సీతాకోక చిలుకలా, చిలిపి నవ్వులతో, వయ్యారం ఒలికిస్తూ అతని హృదయాన్ని మోహజ్వాలలతో రగిలించింది అందీ అందని మెరపు తీగలా అతన్ని మోహపెట్టింది

అతనికి అప్పటినుంచీ నిర్మలలో అన్నీ పల్లెటూరి లక్షణాలే కనిపించడం మొదలుపెట్టాయి నాగరిక సంఘంలో తనతో పాల్గొనటానికి కలసిన అర్హత ఆమెలో లేదని అతను అభిప్రాయపడ్డాడు అవును నిర్మల తల్లిదండ్రులది పల్లెటూరు కావటం వల్ల ఆమెకు పట్నవాసపు చదువు, సంగీతాలు, వేషభాషలు, పైమెరుగులు, నొరవ లాంటివి అలవడని మాట నిజమే

అతను నిర్మలను దూరంగా ఉంచడానికి ప్రయత్నం మొదలుపెట్టాడు

నిర్మల తండ్రికి జబ్బుగా వున్నట్లు జాబు రావటం సాకుగా ఆ తక్షణం ఆమెను పుట్టింటికి పంపాడు

నెలలు గడిచాయి నిర్మలతండ్రి చనిపోయాడు రావు వెళ్ళలేదు మళ్ళీ నెలలు గడిచాయి

"ఎప్పుడు రమ్మంటారు?" అని ఆమె ఎన్ని జాబులు వ్రాసినా ఎన్నాళ్ళకూ జవాబు లేదు ఉండబట్టక "బయలుదేరి వస్తున్నాను" అని జాబు వ్రాసి వేసి తగువాటి బయలుదేరి నాంపల్లి స్టేషనుకు టిక్కెట్ తీసుకొని రైలెక్కి కూర్చుంది.

## 2

ఒకరోజు నిర్మల రమణతో అంది అన్నయ్యా, నన్ను నర్సుకోర్సు చదివించు. నాకూ ఏమీ తోచటం లేదు ఎప్పుడూ





నర్సుకోర్సు చదివిస్తే బ్రతికినన్నిరోజులూ నీ డిస్పెన్సరీలో సేవచేస్తూ ఉంటాను" అంది.

అతని హృదయం తరుక్కుపోయింది

రోజూ ఆమెను తనకారులో నర్సెస్ స్కూలుకు పంపేవాడు. మళ్ళీ రావటానికి కారును పంపేవాడు.

కోర్సు పూర్తి అవటంతో అతని డిస్పెన్సరీలోనే రోగులకు ఉపచర్యలను చేస్తూ, ఆ సేవాభావంతో విచారాన్ని కొంత కొంత తగ్గించుకొంటూ వస్తోంది.

ఒకరోజు రమణ ఒకశిశువును తెచ్చి నిర్మల చేతుల్లోపెడుతూ అన్నాడు "ఎవరో అనాథస్త్రీ కని చనిపోయింది ఈ దిక్కులేనిబిడ్డను పెంచుతూ దీని ఆటపాటలతో కొంత విచారాన్ని మరచిపో అమ్మాయీ"

హృదయంలో అప్పుడప్పుడూ సెల వేస్తూఉన్నా నిర్మల తనదుఃఖంలో చాలా భాగాన్ని అణచివేసుకొందని చెప్పవచ్చు.

శిశువుకు వసుంధర అని పేరు పెట్టింది వసు అని ముద్దుపేరు వసుధఅని మరోపేరు. చిట్టితల్లి అని యింకోపేరు ఇలా ఎన్నో పేరు, ఎన్నో ఆటవస్తువులు, ఎన్నోదుస్తులు, ఎన్నో ఆటలు, ఎన్నోపాటలు, ఎన్నో పనులు

వసు అడుగులేస్తోంది నిర్మలను "అమ్మా, అమ్మా" అని పిలుస్తోంది నిర్మలలో మాతృభావం పొంగి పొర్లేలా

వసు చిన్నతనపు అల్లరి పనులకు ఒక్కోసారి నిర్మలకు నవ్వువచ్చేది. ఒక్కోసారి విసుగూ, కోపమూ వచ్చేవి కన్న బిడ్డను స్వంతతల్లిలా కసురుకొంది వసు "అమ్మా, అమ్మా" అనేది స్వంత తల్లిని కన్నబిడ్డలా చూస్తూ. పరుగెత్తుకొంటూ వెళ్ళి వసును ఎత్తుకొని హృదయానికి హత్తుకొనేది ఏదో మధురానుభూతిని పొందుతూ తాను వసుకు తల్లి అనుకొనేది ఈ అనుభూతివల్ల ఆమె బిడ్డ తల్లిలా కనపడేది! వసు ఆ తల్లికి పుట్టిన బిడ్డలా కనపడేది!

రమణను "మామా" అని పిలవటం వసుకు నిర్మల అలవాటు చేసింది

ఆ యిలు పలుమాటలు తప్పటడుగులు వేస్తూ వసు తియ్యని పసిగొంతుతో పని లేనిదే మాటిమాటికీ పిలచే "అమ్మా, మామా" అనే చిలుక పలుకుల్లాంటి, కోయిల కూసరింపుల్లాంటి పిలుపులతో వసంతఋతువు లోని మామిడతోటలా ప్రతిధ్వనించి పోతుండేది అదేపనిగా. వాళ్ళ హృదయాలు పులకరించి పారవశ్యం పొందేవి వసు పాలబుగ్గలు ముద్దులతో కందిపోయేవి

## 3

వసుకు ఏడెనిమిదేండ్లు వచ్చాయి. నిర్మల వదలిపెట్టి వచ్చేది మళ్ళీ స్కూలుకాగానే వెళ్ళి ఇంటికి పిలుచుకవచ్చుకొనేది

ఈ విధంగా వాళ్ళిద్దరూ లోకందృష్టిలో పడ్డారు.

వసు నిర్మలకు దొరికినబిడ్డ అన్న వాస్తవాన్ని లోకం నమ్మతలచుకోలేదు నిర్మల సౌశీల్యాన్ని సందేహించ తలచింది

వసు నిర్మలను "అమ్మా" అని పిలిచినప్పుడల్లా లోకం కసిగా చూసేది.

రమణను "మామా" అని పిలిచినప్పుడల్లా లోకం చాటుగా వెక్కిరించేది

ఈ వెక్కిరింపును రమణ మొదటగా తెలుసుకున్నాడు. నిశ్శబ్దంగా బాధపడి, అసహ్యించుకొని ఉపేక్షించాడు.

ఆలశ్యంగా నిర్మలకూడా తెలుసుకుంది ఆమె సహించలేకపోయింది. పిచ్చిపట్టిన దానిలా అయిపోయింది "ఇక యీ ప్రపంచంలో తల ఎత్తుకుని బ్రతకడం ఎలా? ఈ నిర్దయ నీచపిశాచాల మధ్యనుంచి – ఈ పీడకల జ్ఞాపకానికిరాని మరో ప్రపంచానికి పోవడం కంటే చేయగలిగిం దేముంది?" అనుకుంది. ఆమె ప్రాణానికి వచ్చిన యీ విషమ పరీక్షకు ఆమె తట్టుకోలేకపోయింది

మేడపైకి వెళ్ళి మూడవ అంతస్థుమీది నుంచి క్రిందకు దుమికి ప్రాణాలను వదలడానికి నిశ్చయించుకుంది

చివరిసారిగా చిట్టి తల్లి వసుధను, తనతోపాటు అపనిందను భరిస్తున్న అన్నయ్యను చూచి చనిపోవాలనుకుంది

మెత్తని వెన్నెలలాంటి బెడ్ లైట్ వెలుతురులో నిద్రపోతున్న ప్రపంచ కళ్మలం అంటని చిట్టితల్లి వసుధను, స్వార్థమంటే ఏమిటో తెలియని అన్నయ్యను చూస్తూ నిల్చుంది, "లోకం అంతా చెడ్డదే అయితే ఇంత మంచి అన్నయ్యా, చిట్టితల్లీ ఎలా దొరుకుతారూ" అని ఆలోచిస్తూ.

రమణ కదలి కళ్ళు తెరచి చూసి "అమ్మాయీ, ఎందుకలా నిద్రపోకుండా నిల్చొని ఉన్నావు?" అని అడిగాడు

"ఏమీ లేదన్నయ్యా. లోకాన్నిగూర్చి ఆలోచిస్తున్నాను"

"ఓహో! అలాగా.. నేనూ ఆలోచించాను కొన్ని ఏండ్లు ఆలోచించాను ఆ ఆలోచనవల్ల లాభం ఏమీ లేదు. లోకం కొందరిపాలిటికి కేవలం దుఃఖం, కష్టం, నిష్ఠురం. బహు కొద్దిమందికి యిష్టమొచ్చినట్లాడే ఆట మిగిలిన అందరికీ కలగాపులగం దీనికి పరిస్థితులు, పరిసరాలు ప్రవృత్తులు, అందచందాలు, వ్యక్తిత్వాలు, ప్రభావాలు, కలిమిలేములు, బలహీనత – ఆధిక్యతలు ఎన్నో కారణాలు

ప్రపంచాన్ని గురించిన ఆలోచనలు అలా వుంచి మనస్సాక్షితో మన ప్రవర్తనలో (ప... వలసినన్ని రోజులూ మనవంతుకు వచ్చిన తప్పని సరైన యీ వంకరటింకరబాటలో ఒడుదుడుకులల్లో అగచాట్లుపడుతూ నడచుకొంటూ-వెళ్ళడమే అంతే ప్రపంచం పెట్టే మంచిచెడ్డ పేర్లు పిచ్చివాడిచేతి రాళ్లు అని నా అభిప్రాయం వాటికి పిరికిపడకుండా, మనస్సును పాడుచేసుకోకుండా ధైర్యంగా బ్రతకడమే మనం చెయ్యతగ్గ పని"

నిద్రిస్తున్న వసు అమాయిక సుందర వదనాన్ని చూస్తూ రమణ మాట్లాడుతున్నాడు యింకా

"ఈ ప్రపంచంలో ఏదీ అసంభవం కాదు అమ్మాయీ. ప్రతి జీవితం యంత్రబద్ధంగా నడిచేరోజువస్తే తప్ప జోశ్యం నూటికి నూరుపాళ్ళు ఫలించదు

నీ భర్త వసంతమీద వ్యామోహపడి నిన్ను యింటినుంచి వెళ్లగొట్టాడని ఊహించగలిగామా? అలాగే ఏదో ఒక కారణంగా నీ భర్తలో పరివర్తనం ఎందుకు కలగకూడదు? జీవితం తెలుపునలుపు దారాలతో నేసిన బట్టలాటిదని అంటారు"

రమణ తనకేదో ఉపదేశిస్తున్నట్లు భావించి ఆమె శ్రద్ధతో వింది వసుకోసం, అన్నయ్య కోసం, మరేదో ఆశతో బతకాలనిపించింది. బ్రతకటానికి కావలసిన ధైర్యం ఆమెకు వచ్చింది. మరో ప్రపంచానికి పారిపోవాలన్న పిరికి నిశ్చయాన్ని ఆమె మానుకుంది.

"లోకం అంతా చెడ్డదీకాదు, మంచిదీ కాదు చెడూ మంచీ రెండూ ఉన్నాయి" అనుకుంది

ఆమె వన్నెలవంటి శరీరంలోని కుడిసగం మీద దీపపువెలుగుపడి మెరుస్తోంది; ఎడమ సగంమీద క్రీనీడపడి ఆడుతోంది! ★

# బుడుగు! చిచ్చుల పిడుగు!



అసలు ప్రవేటు చెప్పడం అంటే తిట్టడం అని అర్థం. కొట్టడంఅని కూడా అర్థం.

ఈ ప్రపంచకంలో ప్రవేట్లు ఎన్నో రకాలు. ఎన్ని రకాలో నే చెప్పలేను. వృదిరకాలుంటాయేమో. ప్రవేటు మేష్టర్లుకూడా ఎన్నో రకాలున్నాయి.

మొగమేష్టర్లూ, ఆడమేష్టర్లూ, కళ్లజోడువీ, నల్లకోటువీ ... ఇంకా గుండుమేష్టర్లు, పిలకమేష్టర్లూ (పూర్వకాలంలో నాకు ఈ రెండూ ఉండేవి. మేష్టర్లుకాదు. గుండూ పిలకాను)

కొంతమంది చూట్టానికి అచ్చంగా ప్రవేటు మేష్టర్లులా ఉంటారు కాని నిజంగా కాదు.

కొంతమంది చూట్టానికి ప్రవేటు మేష్టర్లా ఉండరు. కాని నిజంగా అవును

ఇంకొంచెంమంది చూట్టానికీ, నిజంగానూ ప్రవేటుమేష్టర్లే అలాగే, కొన్ని మేష్టర్లు కొంచెం పారం చెప్తారు కొందరు ఉత్తినే తిట్తారు.

మా యింట్లో బామ్మ, నాన్న, బాబాయి వీళ్లు ఇంకోరకం ప్రవేటు మేష్టర్లు అన్నమాట.

పొద్దున్నే అమ్మేమో బామ్మకి వంటకి కావలసినవి అన్నీ చప్పున యియ్యాలి. యియ్యకపోతే బామ్మ యిలా కోపంగా మొహంపెట్టి అమ్మకి ప్రవేటు చెప్తుంది.

అమ్మ నన్ను ఎప్పుడేనా కొడితే, నాన్న అప్పుడు అమ్మకి ప్రవేటు చెపాడు. నేను దెబ్బలాట అనుకున్నాను కాని, ప్రవేటు అని బాబాయి చెప్పాడు.

మధ్యాహ్నం అప్పుడు, బామ్మ ఒక్కోసారి అమ్మ బుగ్గమీద వేలితో పొడిచి నీయిల్లు బంగారంగానూ అని కోప్పడుతుందా; అమ్మమాత్రం యేడవదు. ఓలా నవ్వుతుంది. (అమ్మ అలా నవ్వితే భలే బావుంటుంది. నేనుకూడా అలా నవ్వగలను.) ఒక్కోసారి నాన్న ప్రవేటు చెప్పినప్పుడుకూడా అమ్మ గట్టిగా నవ్వుతుంది.

ఓసారి నాన్న, అమ్మ చెవి పట్టుకుని కీ ఇస్తున్నాడు.

అంతట్లోకీ నాకు ఆకలేసింది. అమ్మా ప్రేవేటు అయిందా, ఆకలేస్తోంది అన్నం పెట్టుదుగాని అన్నాను

అమ్మకి కోపం వచ్చింది కాబోలు కాని అప్పటికింకా నవ్వు అయిపోలేదు. అందుకని రెండుతోటీ, "ఛీ ఫోకిరీ వెధవకానా"





అంది కోపంగానూ, నవ్వుతూనూ.

నాకు తరవాత బాబాయి చెప్పాడు ప్రైవేటు చెప్తుంటే అలా అన్నం పెట్టిన కూసెదూ అని ఇగో ఈ పెద్దవాళ్ళం, ఎప్పుడూ ఏమిటి సరిగ్గా చెప్పక గిన్నె లోపం అంటారు ఇలా అని మనం అంటే మళ్ళీ కోపం.

ఇంతెందుకు, ఆ వేళ సాయంత్రమే బాబాయి నన్ను సావిట్లో కూర్చోపెట్టి ప్రైవేటు చెప్తున్నాడు లెక్కలో ఏవో అంతలోకి ఓ నిజం ప్రైవేటు మేష్టరు గాంటాయన వచ్చాడు

వచ్చి, నన్ను చూసి ప్రైవేటు చెప్పకుంటున్నావా బాబూ అన్నాడు

నాకు ఒళ్లు మండిపోయింది పొద్దున్నే గదా, ప్రైవేటు చెప్తున్న ప్పుడు ఎవరూ వచ్చి మాట్లాడకూడదన్నాడు బాబాయి పొద్దున్న అందుకనే అమ్మ నన్ను తిట్టిందికూడా. ఈ ప్రైవేటు మేష్టరులాంటి ఆయన చిన్నవాడా చితక వాడా అందుకని నాకు ఒళ్లుమండి పోయింది

"ఛీ ఫోకిరి వెధవకానా" అన్నాను.

అంతే. ఇంకేం అనలేదుగదా కాని బాబాయి మొట్టికాయ వేసేశాడు అంతి ట్లోకే బామ్మవచ్చి అరి పిసుగా అంద అమ్మవచ్చి దిబ్బకాయి వెధవా అంటే ఆ ప్రైవేటు మేష్టరులాంటి ఆయనకూడా అరి భడవా అనేశాడు.

ఇంతవరకూ నా తప్పు ఏమిటో వాళ్ళు చెప్పలేదు గురువు దేవుడు అని మాత్రం చెప్పారు. హూన్నా అన్నాగా. అప్పుడు వచ్చినవాడే నాకు కొత్త ప్రైవేటు మేష్టరుట.

ఎవడికి తెలుసు ముందస్తుగా చెప్పక పోతే? మహామహా మా బామ్మకే తెలీదు.

అందుకని ప్రైవేటు మేష్టర్లు కొత్తగా వచ్చినప్పుడు ముందస్తుగా వాళ్ళేనా చెప్పాలి. లేపోతే అమ్మా నాన్నయేనా చెప్పాలి.

లేకపోతే, ఇలాగే అవుతుంది. ఇలాగే అయితే, పిల్లలు ఊరుకోరు. నేను మంచివాణ్ణి కాబట్టి (అప్పుడు అందరూ నన్ను పెంకిపెధవాయి అన్నా) పోనే గదా అని, ఆ మేష్టరుచేత మూడ్రోలుదాకా ప్రైవేటు చెప్పించాను. అదే యింకోడైతేనా ఒకరోలుకూడా ఛాన్సు ఇవ్వడు.

నాదగ్గిర పది మేష్టరు పనిచేశారనుకో; వాళ్లందరూ నిజంగా మంచివాళ్ళే నేనంటే ఇష్టం. కానిపాపం రెండ్రోల్లో, పదిరోం డ్రోలో అయ్యాకా వాళ్లేమా వేసీవాళ్లు. నన్ను భరించలేను అని చెప్పారుట నాన్న తో. (భరించడం అంటే మొయ్యడం అని బాబాయి చెప్పాడు) ఉత్త అబద్ధం నేను వాళ్ళ వీపుమీద సవారీ చేస్తానని ఎప్పుడూ అనలేదు కూడా. అయినా వాళ్లలా అనడం అన్యాయం కాదూ? అని అడుగుతున్నాను.

అయితే అన్యాయం అని తెలీసు వాళ్ళకి. అపార్థం తెచ్చుకున్నారన్నమాట. అంటే కోపం తెచ్చుకోవడం ఇలాఅయితే పిల్లలు ఎంత అపార్థం తెచ్చుకోవాలి?

ఒకమాట చెప్తావినూ. నేను న్నానుకో. నాకు ప్రవేటు చెప్పిన ఒక్కొక్క మేష్టరు ఒక్కొక్క లాంటివాడు ఒక మేష్టారేమో నా చెవికి, కి ఇచ్చినపుడేమో యిలా ఎడం వేపుకి తిప్పతారు.

పోనే అని ఊరుకుంటూగా ఇంకో కొన్నాళ్ళకి కొత్తవానొ నాడు కొగుకి వాడేమో ఆ చెవినే కుడివేపుకు మెలిపెడ తాడు. మళ్లా ఇంకో మేష్టరు ఎడంవేపుకు తిప్పతాడు ఇలాఅయితే చెవిపాడైపోదూ

అంతేకాని అయ్యో కుర్రవెధవ, వీడి చెవిని ఇదివరకటి మేష్టారు మెలి వేశాడని అనుకుతడా అని చూస్తాను ఎప్పుడూ అడగడు.

# నాసలహాలు

మా నాన్నా, అమ్మ పోనీ ముంద స్తూగా చెప్తారా చెప్పరు

నేనెందుకు చెప్పాలి చెప్పను.

యిప్పుడు చెప్తానినుకో

యేమిటంటే, ముందు మేష్టర్లకి సల హాలిస్తాను యెందుకంటే, మేష్టరం టేనువ్వు గురువంటే దేవుడుట. అందుకు.

ఒకటి ప్రవేటు మేష్టరు కొత్తగా ఒక కుర్రాడింటికి వచ్చేటప్పుడు ముందస్తుగా పాత మేష్టరుఇంటికెళ్ళాలి వెళ్లి ఇగో పాత మేష్టరూ నువ్వు అల్లవారి పిల్లడు ఫలానా బుడుగుకి చెవి ఎలా మెలిపెట్టేవాడివి? ఎడం వేపుకా, కుడికా? అని అడిగిరావాలి లేక పోతే, ఫలానా నన్నే అడిగెయ్యాలి అప్పు డు నేనే చెప్తాను

ఇంకోటి. కొత్త మేష్టరు కొంచెం రోజులేనా తలపాగా చుట్టుకురావాలి ఎందుకంటే, కొన్నిసార్లు పెంకిపిల్లలుం టారు పెంకిపిల్లలేమిటిలే ఓసారి నేనే అలాచేశాను ఒక మేష్టర్ని.

మూడు: చాక్లేట్లు తెస్తే యేంలాభం లేదు పిసిపకోడీలు తెస్తే పిల్లలు మీమాట వింటారు.

"కొత్తగా వచ్చే మేష్టర్లు కొన్నాళ్లు తలపాగా చుట్టుకోవాలి."

# ★ బుడుగు! చిచ్చుల పిడుగు! ★



(నన్నడిగితే, ఓ కబురుచెప్తా. మా పక్క వీధిలో నారాయణకొట్టులో పకోడీలు బావుంటాయి)

పదకొండు: పెద్ద పెద్ద మీసాలతో మాయింటిదగ్గిర నాగన్న అంత మీసాలతో, చిన్నపిల్లలకి చదువుచెప్పడానికి రాకూడదు. కొందరికి భయంవేస్తుంది. ఇంకొందరికి, పాఠంవిన్నా బుర్రకెక్కదు. ఊత్తినే అలా ఆ మీసాలవేపే చూడాలనిపిస్తుంది. మేష్టరు మాట్లాడినప్పుడు "విష్వక్సేనుడు" (ఈమాట ఎలా రాయడమో బాబాయి నేర్పాడు) లాంటి మాటలు అన్నప్పుడు మీసాలు తమాషాగా కదులుతాయి. అందుకు.

డజ్ను: మేష్టరు రోజూ రాకూడదు. ఓసారి తలనెప్పి అని, ఇంకోసారి జొరం అని (కడుపునెప్పి అనకూడదు ఎందుకంటే, అది మేష్టరొచ్చినపుడు పిల్లలికి రావాలి) ఎగగొట్టాలి. అలాచేస్తే పిల్లలు నేస్తంఅవుతారు.

పంద: ఇంకొక్కటి. ఈ ప్రైవేటుకోసం అని స్పెషల్ గా వేరేగదిఇస్తే ఒద్దు అని చెప్పండి నామాట వినకపోతే మీకే నష్టం




ఇంక పిల్లలికి కొంచెం చెప్తాను. ఇకడ్నించి పెద్దవాళ్లు — ముఖ్యంగా ప్రైవేటు మేష్టర్లు అస్సలు చదవకూడదు.

వన్. ఇగో, ఈ మేష్టరున్నారే చూట్టానికి మంచివాళ్లలాఉన్నా, కొంచెం రోలుపోయాకా కొట్టుతారు అలుసుఇస్తే ఇంకా కొట్టుతారు. అందుకని అది ఇవ్వకండి

ఏంలేదు ఒకటే చిట్కా. ముందస్తుగా, ప్రైవేటుకి స్పెషల్ గా ఓ గది కావాలని అలరిపెట్టాలి. అందులో కూర్చున్నాక, ఓ పావుగంట మామూలుగా ఊరుకోవాలి మేషరు నచ్చితే సరే లేకపోతే, ఒక్కసారిగా, "బామ్మోయ్ వీడు గిల్లేస్తున్నాడేవ్" అని గట్టిగా అరవడమే. వాడు నిజంగా గిల్లడనుకో. అయినా గిల్లినట్లు యాడవాలి. మీకు బాగా తెలుసుగా. ఈజీ. కదూ? అలాచేస్తే మా బామ్మ మేష్టరూ పోట్లాడుకుంటారు — తరవాత మేష్టరు మానేస్తాడు. ఇంకో కొత్తవాడు రావడానికి పదిరోజులుకూడా పట్టుతుంది.

టూ: మంచి మేష్టరనుకో, అప్పుడు వాడు ఎలాగా రోజూరాడు. అలాంటి వాళ్లతో పోట్లాటవేసుకోకూడదు. మనకే మంచిది.

టెన్. చిన్నపిల్లలు గుండూ పిలకా పెట్టకోకూడదు నాకు పూర్వకాలంలో రెండూ ఉండేవి. అప్పుడు మాబామ్మ నన్ను చూసి పండులా ఉన్నావు అనేది. కాని గుండు ఉంటే ఎంత నష్టం అని? అందరికీ టెంకిజెల్లకొట్ట బుద్ధేస్తుంది, కొట్టుతారుకూడా మేష్టర్లు మొట్టికాయలు కూడా కొట్టుతారు పోలడు నూని ఇంకిపోయేలా. ఇంకొన్ని నష్టాలున్నాయి నాకు చాలా అనుభవంఉంది కనుక చెప్తాను అనుభవం అంటే టెంకిజెల్లలు, మొట్టికాయలు తినడం.

ఓసారి మాబాబాయి, వాళ్ళ ఫ్రెండు సీత గదిలో కూర్చుని చదువుకుంటున్నారు కబుర్లు చెప్పుకుంటూ అప్పుడు బామ్మేమో వాళ్ళని చూసి, "వాళ్ళ వరసేం బాగులేదు" అని అమ్మతో చెప్పింది అప్పుడేమో నేను,

(ఇంకా ఉంది)




"ప్రైవేటుకని స్పెషల్ గది ఇస్తే వద్దనాలి"

# గాఢానురాగం

## ప్రాచీన గాథాలహరి

"ఎక్కడికమ్మా! ఇలాగ అభిసారికలా బయలుదేరుతున్నావీ చీకటి వేళ!"

"కామదేవాయతనానికి"

"అది నాకు తెలియకపోలేదులే! ఇంతగా చీకటిపడ్డాక బయలుదేరావేమని నే నడిగేది!"

"స్వామి కల్యాణ మహోత్సవం కాస్త కళ్ళారా చూచివత్తామని!"

"కాదు! నీ వెందుకు బయలుదేరి వెళుతున్నావో నే నెరగ ననుకున్నావా?"

అని గట్టిగా నిలబెట్టి అడిగింది రత్నావళిని ఆమె చెలికత్తె అపరాజిత. రత్నావళి ప్రశ్నతో తెల్లబోయింది అయినా ఏమీ ఎరగనట్టే అమాయకంగా ఆశ్చర్యం నటించింది :

"అంత తెలిసినప్పుడు వేరే నన్నడుగడ మెందుకో!" అని రత్నావళి పక్క నేప్రాల సజ్జలోని వకుళమాలిక తీసి ఒయ్యారం ఒలకబోస్తూ సిగలో తురిమింది

అపరాజిత ముక్కుమీద వేలు వేసుకొని అలాగే విస్తుపోయి చూసింది :

"కాదుగాని రత్నావళీ! గొప్పఇంటి బిడ్డవు! నీకీ సాహసం తగదుసుమా!"

రత్నావళి ఇంకా అలాగే గుంభనగా ఏమీ ఎరగనట్టొకమారు బొమముడి విరిచింది :

"ఏ సాహసం?"

"చాల్చాలులే! నీ నటన! ఈ మధ్యన మీ యిద్దరి హావభావచేష్టలు నేను గమనించడం లేదనుకొన్నావా? నేనన్నీ ఒకకంట కనిపెట్టి చూస్తూనే ఉన్నానులే! నిన్న నేను దేవాయతనానికి రాలేదని అనుకున్నావేమో! నీ వెనకాలే వచ్చి మీ ఇద్దరి గుసగుసలు పూర్తిగా విన్నాను... తెలిసిందా?"

ఆ మాటతో రత్నావళి ముఖం గాగా వెలవెలబోయింది. అయినా ఆమె ఇంకా లేని ధైర్యం నటించడం మానలేదు.

"ఊర్తిది! అంతా అభూతకల్పన! నేను నమ్మను."

"మీ సంకేతం కూడా చెప్పమన్నావా? అయితే చెబుతున్నాను విను! స్వామి కళ్యాణమహోత్సవసమయంలో సరీగా మంగళసూత్రధారణకాగానే నీవా నాగరశ్రేష్ఠితో ఆయన భవంతిప్రాంగణంలో అడుగుపెట్టి తీరతానని మాట ఇచ్చావు?... అవునా? ఇప్పు డేమంటావు!"

ఆ మాటతో రత్నావళికి తన పరాజయం అంగీకరించక తప్పలేదు :

"స్మరేగాని మే మిదరమేగాని అక్కడ ఎవరూ లేరనుకున్నానే! ఇదంతా నీ కెలా తెలిసింది. నీ వప్పు డెక్కడ నిలబడ్డావు?"

"మంటపస్తంభం మాటున! దాని కేమిగాని నేను చెప్పినదంతా అక్షరాలా నిజమేనా?"

ఆ ప్రశ్నతో రత్నావళి వంచిన తల మరి పైకెత్తలేదు అలాగే తలవంచి ఒక్క వేడి నిట్టూర్పు విడిచి పెట్టింది :

"నీవు చెప్పింది నిజమే!"

ఆ మాటమీద అపరాజిత సన్నసన్నగా చీవాట్లు పెట్టింది :

"రత్నావళీ! పాలవంటి శ్రీ చందనశ్రేష్ఠి వంశంలో పుట్టావే! అభిజాత్యానికి పేరెక్కిన వజ్రశ్రేష్ఠి భవంతిలో అడుగు పెట్టావే! నీ భర్త రత్నశ్రేష్ఠి నీవంటే పంచప్రాణాలు ఇస్తూ నిన్నెంతో ఆప్యాయంగా చూచుకుంటున్నాడే! నీ వీ విధంగా మీ కులగౌరవం అంతా ఒక్కమారుగా మంటగలిపివెయ్యడం భావ్యమేనా? నా మాట విను! కొంచెం నిదానించుకో!"

ఆ సదుపదేశంతో రత్నావళి శిరస్సింకా కిందికి వంగిపోయింది :

"అపరాజితా! నే నివ్వన్నీ ఆలోచించలేననుకొన్నావా? కాని నేను నాగరశ్రేష్ఠిని ఆ కళ్యాణోత్సవంలో ఏ క్షణంలో చూచానో అప్పటినించీ నామనస్సలాగయిపోయింది. నే నేం చెయ్యను! ఇవి చేతులు కావు? కాళ్ళనుకో! ఇక పాలముంచినా నీట ముంచినా నీదిభారం!"

అని రత్నావళి ఎంతో ఆప్యాయంగా అపరాజిత రెండు చేతులు పట్టుకుని అతిదీనంగా బతిమాలింది. అయినా అపరాజిత ఆమె మాట వినలేదు. ఆమె రెండు చేతులతోను అతిదీనంగా పట్టుకున్న తన రెండు చేతులూ ఒక్కమారుగా విదిలించి వేసింది:

"చాల్చాలులే! ఊరుకో! ఎవరైనా వింటే నవ్విపోతారు!"

అని గట్టిగా కసిరింది. ఆ తిరస్కారంతో రత్నావళికి తలకొట్టివేసినటయింది ఆమె అలాగే దిగాలుపడిపోయి పులుతూ పులుతూ అపరాజితవైపు చూచి మళ్ళీ ఉసూరుమని ఒక దీర్ఘనిశ్వాసం విడిచి పెట్టింది:

"అపరాజితా! ఎంతగా మళ్లించినా నా హృదయం అవశమై పోయిందే! మరింక నేనేమి చెయ్యగలను!"

అని అతిదీనంగా బతిమాలుకుంటూ అపరాజితవైపు చూచింది రత్నావళి కంఠంలో గద్గదిక పొడచూపింది క్రమంగా రెండు కళ్ళలోను రెండు కన్నీటిబిందువు లుదయించాయి. అవిక్రమంగా రెండు పెద్ద ముత్యాలై నెమ్మది నెమ్మదిగా రెండు చెంపలమీద దిగజారాయి :

"ఈ బుడిబుడి దీర్ఘాలకేమిలే! ఎల్లాగో అలాగ మనసు నిలవరించుకో! ఇంత మాత్రానికే ఇలాగ బెంబేలుపడిపోతే ఎలాగ? మగవాలి కింతటి తెగింపు తగదుసుమా!"

ఆ మాటతో రత్నావళి గొంతెండిపోయింది అయినా సన్నగా గొంతు సవరించుకుంది:

"అపరాజితా! నే నెన్నో విధాల మనస్సు మళ్ళించి వేసుకోవాలనే నిశ్చయించాను. కాని రాత్రింబగళ్ళనుక్షణము ఆయన నీడ నన్ను వెన్నాడుతున్నట్టే ఉంది. నా బ్రతుకంతా ఒక దుర్భరభారంగా మారిపోయింది. ఆయన ఒక్కమారు కళ్ళబడగానే ఆ బరువంతా తీరిపోయి, హఠాత్తుగా ఆకాశాని కెగిరిపోయినట్లుంటుంది. ఇక నేనేమి చెయ్యగలనో చెప్పు?"

ఆ విధంగా బతిమాలిన తరవాత అపరాజిత నిశ్చలంగా రత్నావళి కేసి చూసింది. రత్నావళి ఆమె మనసు ఇంకా కొంచెం కరిగించడానికదే అదనని కనిపెట్టింది:

"ఆయనను చూచినప్పటినించీ నాలో ఏదో అంతర్గతజ్వరం కాస్తున్నట్టే ఉంది. నా అనురాగబలం అలాంటిది. ఇదేమి దురదృష్టమోమరి నేనేమి చెయ్యను!"

అయినా ఇంకొక క్షణంవరకు అపరా

*◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆*

పి. గణపతిశాస్త్రి

*◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆*



# గాఢానురాగం



జిత ఆమెకేసి అలాగే గమనించి చూచింది:

"నీవేదో వల్లమాలిన గాఢానురాగంతో తల్లడిల్లి పోతున్నానని భ్రమిస్తున్నావుగాని అసలిది అనురాగం కానేకాదు!"

"అయితే ఏమిటిది?

"కేవలం అనురాగ భ్రమ, పైగా ఆత్మవంచన; అంతే!"

"నీకెలాగ తెలుసును!"

"ఒకసారి పరీక్షగా కళ్ల లోతులు పరిశీలిస్తే అది ఎంతటి గాఢానురాగమో ఇట్టే కనిపెట్టగలను! తెలిసిందా? మీ ఆయన వట్టింటలేకుండా దేశాంతరం వెళ్లడం వల్ల తాత్కాలికంగా నీకీ మతిభ్రమణం బయలుదేరింది అంతేగాని ఇది అనురాగం మాత్రం కాదు లేనిపోని దాని కోసం నీవెందుకింత రొష్టుపడతావు? నా మాట విను. కొస్త తమాయించుకో! చేతులారా పండంటి కాపరం పాడుచేసుకోకు!"

ఆ ఉపదేశం అంతా విని రత్నావళి అలవోకగా సాధిక్షేపంగా ఒక చిరునవ్వు విరజిమ్మింది:

"అపరాజితా? నీకెప్పుడైనా ఎవరిమీదనైనా కొంచెం గాఢానురాగం కలిగిందా?"

"ఎందుకలాగడుగుతున్నావు?"

"ముందు నా ప్రశ్నకు సమాధానం చెప్పు."

"ఆ కలిగింది! ఇంతకంటె పదివేలింతలు ఎక్కువ గాఢానురాగమే కలిగింది. చివరికి నే నాయన్నె వివాహం చేసుకున్నాను. అప్పటినించీ నా మనస్సులో మరి అన్యచింతే బయలుదేరలేదు. తెలిసిందా?"

"ఉత్తది! అబద్దా లాడుతున్నావు! ఆ మాత్రం గాఢానురాగం చవిచూచివుంటే నీవింత నిర్దాక్షిణ్యంగా కఠినశిలలాగ మాట్లాడవు. అంతే!"

దానిమీద అపరాజిత పక్కుమని ఒక్క నవ్వునవ్వింది. అపరాజిత ప్రౌఢయః పరిపాకం బాగా చవిచూచింది. రత్నావళికి పట్టుమని ఇంకా ఇరవయ్యోపడి అయినా దాటలేదు! అందుచేతనే అపరాజితకంత నవ్వు వచ్చింది:

"ముక్కుపచ్చలారని దానవు నీవేదో గాఢానురాగంతో వేగిపోతున్నానని భ్రమిస్తున్నావే! ఈ విషయంలో నేనొక పరీక్ష చేసాను గాని, ఆ పరీక్షకు నిలబడగలవా?"

"ఏ పరీక్ష?"

నీ అనురాగం ఎంతటి గాఢమైనదో కొంచెం పరీక్షిస్తాను?"

రత్నావళికూడా పక్కుమని నవ్వింది:

"ఎలాగ పరీక్షిస్తావు?"

"నీకొక చిన్నకథ చెబుతాను. తరవాత నిన్ను కొన్ని ప్రశ్నలడిగి పరీక్షిస్తాను"

"ఎందుకలాగ పరీక్షించడం?"

"ఇప్పుడే చెప్పానుగా! నీ గాఢానురాగం లోతెంతో పరీక్షించడానికని!"

"ఆ పరీక్షలో నేను నెగ్గితేనో?"

"నేనే స్వయంగా నిన్ను తోడుకుపోయి నీ ప్రాణేశ్వరుని శయ్యాగారంలో ప్రవేశపెడతాను సరిగదా?"

"నిజంగా నేనా? ఇదంతా తప్పించినెయ్యడానికి ఈ విధంగా పన్నాగం పన్నుతున్నావా?"

"నిజంగా నే! నాకంత పన్నాగం పన్నవసినంత అవసరం ఏమివచ్చింది? నాకిష్టం లేకపోతే బాహాటంగా నే ఇది వల్లకాదని చెప్పివుండును నీ అనురాగపరీక్ష కోసమే నేనీకథ చెబుతున్నాను."

"నన్ను చంపుకుతిన్నట్టేనా?"

"ఆ నిజంగా నిన్ను చంపుకుతిన్నట్లే!"

మళ్లీ రత్నావళి కొంచెం ఆలోచించింది:

"ఒకవేళ నేనా పరీక్షలో ఓడిపోతేనో!"

"ఓడిపోతే నీకు కలిగింది గాఢానురాగం కాదన్నమాట!"

"కాకపోతే!"

"నీవిక ఈ గుమ్మం కదిలి వీధిలోకి వెళ్లడానికి వల్లపడదు! తెలిసిందా?"

"ఏమో! నన్నేదో మోసగించాలని ప్రయత్నిస్తున్నావేమో. నాకే కథా వద్దు! పరీక్షా వద్దు! నా దారిని నన్ను పోనీ!"

"ఏదో గాఢానురాగంతో వేగిపోతున్నాననీ నీ హృదయ వేదన ఇంకెవరికీ తెలియదని ప్రగల్భాలు పలికావే! ఇంతమాత్రాని కా ప్రగల్భాలెందుకు? ఆ మాట మొదటే చెప్పలేక పోయావా? నీ వ్యవహారం అంతా నేను మొట్టమొదటే గ్రహించానులే!"

"ఏ వ్యవహారం?"

"నీ అనురాగము, నీ గుండె అంతటి తైవి కావని!"

ఆ ఎత్తిపొడుపు రత్నావళికి బలెంలా పొడుచుకుంది. వెంటనే బింకంగా అడిగింది:

"అయితే ఈ కథా పరీక్ష ఎంతసేపు జరుగుతుంది?"

"ఎంతోసేపా! ఒక్కగడియ చాలు!"

"నేను కల్యాణ సమయానికి ఆయన భవంతికి వెళ్లే అవకాశం ఉంటుందా?"

"ఓ మహారాజులాగ. కాని నీ వా పరీక్షలో నెగ్గితేనే అక్కడికి వెళ్లడం! తెలిసిందా?"

"అలాగే! కథ మొదలుపెట్టు!"

"ఇలాగ ఆదరా బాదరాగా విన్నావంటే పరీక్షలో నెగ్గురావడం చాలా కష్టం. బాగా జాగ్రత్తగా వినాలి మరి!"

"అయితే ఒక్క నిమిషం ఆగు!"

అని రత్నావళి తొందరగా భవంతి లోపలికి వెళిపోయింది.

## ౨

కార్తిక కౌముది పలచ పలచని గోక్షీరంలా ప్రపంచంఅంతటా ప్రసరించింది. రత్నశ్రేష్ఠి భవంతి అంతా ఆ వెన్నెల వెలుగు వెలువలో ఒక పెద్దనౌకలా నెమ్మది నెమ్మదిగా తేలింది వెన్నెల వెలుగులు లతానికుంజాల నలని నల్లని నీడలలో తెల తెల్లని పూలగుత్తుల్లా మెరిసిపోయాయి ఆకాశంనిండా మంచుతెరలు నిశ్చలంగా వేలాడాయి. దూర దూరంగా దేవాలయంలో కల్యాణసన్నాహం మంగళ తూర్యాలు వినవస్తున్నాయి. ఆ మంగళ తూర్యాల ప్రతిధ్వనులు రత్నావళి హృదయంలో మంద్ర మంద్రంగా ప్రతిధ్వనించాయి. ధారానగరం అంతా ఆ లేత లేత వెన్నెల వెలుగుల్లో వేలాడే మంచు తెరలలో దృశ్యా దృశ్యంగా భాసించింది. జీవ్వమ వే చలి ప్రాణుల హృదయాలలో వెచ్చ వెచ్చని అనురాగగుగ్గం పొంగించింది.

రత్నావళి తన అభిసారికా వేషం అంతా ముగించుకొని ముంగురులపై నీలివన్నె కాశ్మీర రత్నాలున మేలిముసుగుగా ధరించి తిరిగీ ఒక నిమిషంలోనే అపరాజిత దగ్గిరికి వచ్చింది. వారిద్దరు సుఖంగా ఒక రత్నకంబళంమీద కూర్చున్నారు. రత్నావళి ఉజ్జ్వలవేషం చూసి అపరాజిత కన్నుగీటింది:

"నీ ధోరణి చూస్తే తప్పకుండా ఈ విషమపరీక్షలో నెగ్గగలననే ధీమాతో నే వచ్చినట్లున్నావే!"

"దాని కేమితే. అనవసర కాలక్షేపంలోకి దింపి కాలహరణం చేద్దామని చూస్తున్నావేమో. నీ పరీక్ష కానీ!"

అపరాజిత అంగుకుంది:

"అయితే కథ ప్రారంభించమన్నావా?"

"త్వరగా ప్రారంభించు అయితె ఈ కథ నీ స్వకపోలకల్పితమా? ఎక్కడైనా జరిగిందా?"

"నేనేమి కల్పించడం లేదు అంతా నా కళ్ళ కెదురుగుండా జరిగిందే!"

"ఎక్కడ?"

"ఈ ధారా నగరంలోనే!"

"ఈ ధారా నగరం లోనా? ఎప్పుడు జరిగింది?"

"అంతా ఇంచుమించుగా ఇరవై ఏళ్ళవుతుంది. అప్పటికి నీవింకా పుట్టనే లేదేమో!"

"మరి నీ వప్పుడెక్కడ ఉండే దానవు?"

"ఈ కథ జరిగిన భవంతిలోనే దాదిగా ఉండేదాన్ని!"

"ఎవరికి?"

"కాంచనమాలకు"

"అయితే ఆ కాంచనమాలే ఈకథకు కథానాయిక అన్నమాట!"

"అవును!"

"ఆమె ఇప్పుడెక్కడ ఉంది?"

"కథ మొదటి నించీ చెప్పనీయకుండా అడ్డు తగిలితే ఎలాగ? కథ కొంచెం మొదలుపెట్టి చెప్పనీ!"

"అయితే కానీ మరి!" అని రత్నావళి మేలిముసుగు ఒళ్లంతా కప్పుకుని ఎంతో ఆత్రంగా కూర్చుంది. అపరాజిత కథ మొదలు పెట్టింది:

"పాపం కాంచనమాలను తలుచుకున్నప్పుడల్లా ఆమె నా కళ్ళలో మెదులుతున్నట్టే ఉంటుంది. ఆమె కేవలం బంగారపు బొమ్మ! ఎంత పలకరించినా చిరునవ్వులతోనే సమాధానం చెప్పేది. సన్నగా శిలాకలా కుండేది."

"కథ చెబుతానని నాయిక పాదాదిశిరః పర్యంత వర్ణన మొదలు పెట్టా వేమిటి?"

కొంచెం విసుగ్గా అడ్డు తగిలింది రత్నావళి

"అదే చెబుతున్నాను. చెప్పనీ! అంతలోనే అడ్డు తగిలితే ఎలాగ!"

అని అపరాజిత మళ్ళీ తన కథ మొదలు పెట్టింది:

"కాంచనమాల అతురాలా కాంచనమాలే అని అందరు ఆమె నెంతో మెచ్చుకొనే వారు. ఆమె మన ధారానగర దండనాయకుడు చండవర్మ కడగొట్టు కుమార్తె. లేక లేక ఆరుగురు మగపిల్లల తరవాత కలిగిన ఆడపిల్ల కదా అని ఆమె నెవ్వరు నేలమీద నడవనిచ్చే వారు కాదు అంత అల్లారు ముద్దుగా పెరిగింది, కాంచనమాల!"

"తరవాత?"

"తరవాత క్రమంగా కాంచనమాలకు పెళ్ళీడు వచ్చింది. అదేమి చిత్రమో గాని ఎన్ని సంబంధాలు తీసుకువచ్చినా ఆమెకేదీ నచ్చనేలేదు"

అని అపరాజిత ఒక్క పెద్ద నిట్టూరుపు విడిచిపెట్టింది. రత్నావళి అడిగింది:

"దానికి కారణం?"

అపరాజిత మళ్లీ కథ మొదలు పెట్టింది:

"దానికొక పెద్ద కారణమే ఉంది. చండవర్మ మేనలుడు చంద్రవర్మ చిన్నప్పటి నించీ చండవర్మ ఇంట్లోనే పెరిగి పెద్దవాడైనాడు. కాంచనమాలా చంద్రవర్మ లిద్దరు చిన్నప్పుడు కలిసిమెలిసి ఆడుకునే వారు. చంద్రవర్మ తలిదండ్రు లిద్దరు చిన్నతనంలోనే స్వర్గస్థులైనారు. అందుచేతనే చండవర్మ చంద్రవర్మను అల్లారుముద్దుగా పెంచి పెద్దవాణ్ణి చేశాడు—"

"అయితే కాంచనమాలకు క్రమంగా చంద్రవర్మపై అనురాగం బయలుదేరిందన్నమాట! అంతేనా?"

"కథ చెప్పనీ! నే నెరిగినంత వరకు కాంచనమాల ఎన్నడు చంద్రవర్మనే వివాహమాడతానని పట్టుపట్టలేదు. కాని ఎలాంటి సంబంధం తీసుకువచ్చినా తలఊంచుకొని తన కక్కరలేనన్నట్టుగా కంట నీరు పెట్టేది."

మళ్ళీ రత్నావళి ప్రశ్నించింది:

"ఇంతకీ చంద్రవర్మపై ఆమె కనురాగం కలిగిందా? లేదా?"

"రత్నావళీ! నామాటవిని అనవసరంగా అడ్డుదగలకు. నా మానాన నన్ను చెప్పుకు పోనీ!"

రత్నావళి మౌనం వహించింది. అపరాజిత కథ అందుకుంది:






LUX
TOILET SO



# గాఢానురాగం



"కాంచనమాలతల్లి కొంతకాలానికి చంద్రవర్మకు కాంచనమాలపై అనురాగం కలిగిందని గ్రహించింది. కాని ఆమె కాంచనమాలను చంద్రవర్మ కివ్వడానికి ఇష్టపడలేదు. ఇక కాంచనమాలమాట! ఆమె అగాధ హృదయరహస్యం అటుపిమ్మట చాలా కాలంవరకు ఎవ్వరికీ తెలియలేదు.

ఒకనాటి సాయంకాలం నేను కాంచనమాలను ఆ ప్రశ్నే అడిగాను. కాంచనమాలను చిన్నప్పటినించీ నేనే పెంచి పెద్దదాన్ని చేశాను. అయినా ఆమె నోరువిడిచి తన హృదయరహస్యం నాకెరిగించలేదు. ఎంతసేపు ఒకటేమాట! నా తల్లిదండ్రులిద్దరు ఎవరిని వివాహం చేసుకోమంటే వారినే వివాహం చేసుకుంటాను దీనిలో నా ప్రమేయం ఏమున్నా ఉందిగనకనా? ఎంతసేపు ఇదే ధోరణి!

ఇక చంద్రవర్మమాట! అతడు చిన్నప్పటినించీ మేనమామ వద్దనే పెరిగాడు. మేనమామకంటె చంద్రవర్మకింక వేరె కావలసినవారెవరులేరు! అతని మనస్సులో కాంచనమాలపై అనురాగం అంకురించి చిగిర్చినమాట నిజమే! కాని ఏమి చెయ్యగలడు? పైగా మేనమామ భార్యకు కాంచనమాలను తనకిచ్చి వివాహం చెయ్యడం ఇష్టంలేదని గ్రహించివేశాడు.

కాని చండవర్మ కాంచనమాలను చంద్రవర్మకిచ్చి వివాహంచేస్తే బాగుంటుందని అనుకోకపోలేదు. ఒకనాడా విషయం భార్యతో ప్రస్తావించాడు. భార్య ఆ మాట విని విరుచుకుపడింది:

"నాపిల్లను శుభిమల్లే ఆఊరు పేరు లేని నిర్భాగ్యుడికిచ్చి పెళ్లి చెయ్యాలని మీకెలాగ తోచింది? ఇంతకీ ఏమిచూసి మీరీసంబంధం చేస్తున్నారు. భాగ్యాలా! భోగ్యాలా? ఏమున్నాయి! పట్టుమని పదివేళ్లు నోట్లోకి వెళ్లే తాహతయినా లేదయిరి! ఈసంబంధం చెయ్యడంకంటె నాపిల్లకంఠాని కురిబిగించడం మంచిది."

అని ఊరికే ఉత్తపుణ్యానికని బుడిబుడి దీర్ఘాలు ప్రారంభించింది.

చండవర్మ ధారానగరంలో అంతటా చండప్రచండుడని పేరుపొందాడు! కాని ఏంలాభం! భార్యదగ్గర పిల్లిపిల్ల అయిపోతాడు. అయినా ఆవేళ కొంచెం సాహసించి, ఏదో పసివాళ్లిద్దరూ ఒకరొకరంటే ఇష్టపడుతున్నారనీ వారిద్దరికీ వివాహం చేస్తే సుఖపడతారనీ నీళ్లునములుతూ సన్నసన్నగా నసిగాడు. కాని చండవర్మ భార్య దానికంగీకరించలేదు. ససేమిరా వల్లగాదని శఠించింది. మేనలుడికిచ్చి పెళ్లిచేస్తే పిల్లాతనూ కలకట్టుకుని దిగుడుబావిలో దిగుతామని బెదిరించింది.

చండవర్మ పెద్దకుమారుడు కూడా తల్లితో ఎన్నెన్నోవిధాల చెప్పి చూచాడు. ఎంత చెప్పినా ఆమె దానికంగీకరించలేదు.

భార్యభర్తలిద్దరిమధ్య ఇలాగ జంఝామారుతం చెలరేగుతూంటే కాంచనమాల, చంద్రవర్మ కళ్లనీళ్లు గుక్కుకుని మాట్లాడకూరుకున్నారు. చండవర్మే ఏమీ చెయ్యలేకపోతే ఇక వారేమి చెయ్యగలరు?

ఇలాగుండగా ఇంకొక విడ్డూరం కూడా విరుచుకుపడింది. ధారానగర సైన్యాధ్యక్షుని కుమారుడు విక్రమవర్మ కాంచనమాల రూపురేఖల ప్రశస్తి కర్ణాకర్ణిగా విన్నాడు. ఒకనాడు విక్రమవర్మ రాజవీధిలో తన ఉత్తమాశ్వంమీద ఒయ్యారంగా స్వారీ చేస్తూ కాంచనమాల సౌందర్యం స్వయంగా తిలకించాడు.

ఆనాటినుంచీ విక్రమవర్మ కాంచనమాలను తప్ప ఇంకెవరినీ వివాహమాడనని భీష్మించుకుని కూర్చున్నాడు. క్రమంగా ఆవిషయం చండవర్మ చెవినిపడింది. అతడేమీ అనలేక వినీవిననట్టుగా మాట్లాడకూరుకున్నాడు.

పాపం కాంచనమాల ఆ సంగతి విన్నప్పటినుంచి బాగా చిక్కి శల్యమైపోయింది. క్రమంగా ఆసంబంధంవ్యవహారం కొంచెం దగిరబంధువులద్వారా కాంచనమాల తల్లికి తెలిసింది. అదివినగానే ఆమె ఒక్కమారుగా ఎగిరిగంతేసింది. కాంచనమాలకన్నివిధాలా అదే తగిన సంబంధమని నిశ్చయించింది. నిజానికనేక విషయాలలో అది తగిన సంబంధమే.

విక్రమవర్మ తల్లిదండ్రులు మహైశ్వర్యవంతులు! పైగా విక్రమవర్మ తండ్రి ధారానగర సైన్యాధ్యక్షుడు. వారికి అధికారము, వైభవము, ఐశ్వర్యము అన్నీ ఉన్నాయి. విక్రమవర్మకూడా చూడడానికి కొంచెం బాగానే ఉంటాడు.

చండవర్మ మరి భార్యపోరు పడలేక ఆ సంబంధంవైపు కొంచెం మొగ్గుదల చూపించాడు.

అయితే ఆసంబంధం కాంచనమాలకు నచ్చలేదని అతనికి తెలుసును. పైగా కాంచనమాల ఆసంబంధం మాట విన్నప్పటినించీ బాగా పాలిపోయింది. అందుచేత ఒకనాడు చండవర్మ భార్యతో ఆమాట బెదురుతూ బెదురుతూ ప్రస్తావించాడు. భార్య అదివిని పకపక నవ్వింది:

"ముక్కుపచ్చలారని పిల్ల! తనకి తగిన సంబంధం ఏదో దానికేం తెలుసును? ఏదో చిన్నతనంకొద్దీ మన చంద్రవర్మ అంటే కొంచెం మమకారంతో పడి ఏడుస్తూంది. పెళ్లి చేసిన మరునాటినించీ ఈ మమకారాలన్నీ అవే మాయమైపోతాయి.

అదీగాక చంద్రవర్మ ఈ ఇంట్లో ఉన్నంతకాలము అది అలాగే ఉంటుంది. అందుచేత ఏదో మిషపెట్టి చంద్రవర్మ నిక్కడినించి పంపించి వెయ్యండి! ఆ మర్నాడది తనంతట తానే విక్రమవర్మను వివాహమాడడానికి సిద్ధపడుతుంది. ముందెలాగైనా నేను చెప్పిన పని చెయ్యండి. తర్వాత దానిచేత ఒప్పించే పూచీ నాది."

అని చాలా చురుగా సలహా ఇచ్చింది.

ఆ తర్వాత కొన్నాళ్ళకు చంద్రవర్మకు విశాలాపుర దండనాయక పదవి లభించింది.

ఆపని కొంచెం రహస్యంగా చంద్రవర్మ చేయించిందే!

అటుపిమ్మట కొంతకాలానికి చంద్రవర్మ విశాలాపురానికి బయలుదేరి వెళ్ళిపోయాడు.

—ఇంకా వుంది.

# ఫ్రాన్సిస్ డీక్, కోసత్ ప్ర

## నూరేళ్ల క్రితం ఆస్ట్రియన్

# హంగరీ సహాయనిరా

తూర్పు యూరప్ దేశాల్లో, ముఖ్యంగా హంగరీలో రష్యా
రష్యన్ల జోక్యాన్ని సహించేది లేదని స్పష్టం చేశారు. నెలరోజులపా
సహాయనిరాకరణోద్యమం మాత్రం ఇంకా సాగుతూనే ఉన్నది.

సహాయనిరాకరణోద్యమం హంగరీకి కొత్తకాదు. సు
హంగేరియన్లు శాంతియుత సహాయ నిరాకరణోద్యమంద్వారానే ఎదురి
హంగేరియన్లకు ఫ్రాన్సిస్ డీక్ నాయకత్వం వహించి, ఆస్ట్రియాను శా
నోరెత్తని దేశం ఏం దేశం? అన్యాయాన్ని, దౌర్జన్యాన్ని ప్రతిఘటించని

ఆ చరిత్రను ఈ వ్యాస

ఆయుధబలంగల జాతి ఆయుధ బలం లేని జాతిని లొంగదీసి పరిపాలిస్తుంది. ఆర్థిక బలంగల జాతి ఆర్థిక బలం లేని జాతిని దోచుకుని మరింత బలపడుతుంది. బలవంతుడు దుర్బలుణ్ణి, ధనవంతుడు నిర్ధనుణ్ణి బానిసలుగా చేసుకుని అధికారం చెలాయిస్తారు. మానవచరిత్ర అంతా ఈ సూత్రానికి ఉదాహరణగా నే కనిపిస్తుంది.

కాని పరాక్రాంతమైన ఏ జాతీ కలకాలం బానిస జాతిగా ఉండిపోలేదు. స్వాతంత్ర్యేచ్ఛ ఆరని అగ్నిహోత్రం వంటిది. ఒకప్పుడు నివురుగప్పి నా మరొకప్పుడైనా స్వాతంత్ర్యాగ్ని విజృంభించి బానిసజాతులను ఉత్తేజితం చేసింది. గడచిన శతాబ్దంలో యూరప్‌లోని అనేక జాతులు జాతీయవాదంతో ప్రబుద్ధములయ్యాయి. ఈ శతాబ్దంలో ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని వివిధ జాతులలో ఈ జాతీయవాదం నూతనోత్సాహాన్ని, ఆవేశాన్ని కలిగించింది.

ఆయుధాలు, సైన్యాలు, ధనసంపత్తి కలిగిన ఒక దేశం మరొక దేశాన్ని గాని, దేశంలోనే ఒకవర్గం మరొకవర్గాన్ని గాని నిర్దాక్షిణ్యంగా అణచివేసి అధికారం చెలాయిస్తుంటే ఆ పీడిత జాతిగాని, వర్గం గాని ఆ దౌర్జన్యాన్ని ఎలా ఎదుర్కొవాలి? దౌర్జన్యాన్ని దౌర్జన్యంతోనే ఎదుర్కొన్న ఘట్టాలు చరిత్రలో విరివిగా కనిపిస్తాయి. అమెరికన్ స్వాతంత్ర్య యుద్ధం, ఫ్రెంచి విప్లవం, రష్యన్, చైనీస్ విప్లవాలు ఇలాగ ఎన్నైనా ఉదాహరణలు చూపించవచ్చును. ఇవన్నీ హింసాయుత సంఘర్షణలే. కాని ఈ శతాబ్దంలో భారతదేశం శాంతియుత మార్గంలో స్వాతంత్ర్యం సాధించి అపూర్వ చరిత్ర సృష్టించినది. గాంధీమహాత్ముని



ఇటీవల రష్యన్లు మాయోపాయంపన్ని ఎత్తుకుపోయిన మాజీ ప్రధాని నాజ్.

నాయకత్వాన భారతీయులు మూడు దశాబ్దాలపాటు బ్రిటిష్ దౌర్జన్యాన్ని శాంతియుతంగా ఎదుర్కొని స్వాతంత్ర్యం సంపాదించుకున్నారు. ఈ సంఘటన ప్రపంచప్రజలను ఆశ్చర్యచకితులను చేసినది.

దౌర్జన్యాన్ని సౌజన్యంతో ఎదుర్కొని సమగ్ర ఫలితాలను సాధించిన మొట్టమొదటి దేశం భారతదేశమే. కాని భారతదేశం ఈ మార్గాన్ని అవలంబించడానికి మార్గదర్శకమైన సంఘటనలు ఇతరదేశాల చరిత్రలో లేకపోలేదు. ఇటువంటి దేశాలలో హంగరీ ఒకటి.

## భారత ప్రభుత్వ వైఖరి

హంగరీ కల్లోలంపై భారత ప్రధాన మంత్రి తమ వైఖరిని ఇటీవల స్పష్టం చేశారు. హంగరీ ప్రజలు రాజకీయంగా, ఆర్థికంగా మార్పులు రావాలని కోరారనీ, ఈ మార్పులు సాధించడంకోసం తిరుగుబాటు చేశారనీ, ఈ తిరుగుబాటు అణచి వేయబడిందనీ ప్రధాని

# భృతుల నాయకత్వాన
# సామ్రాజ్యంపై సాగిన
# కరణోద్యమ చరిత్ర

నెహ్రూ నవంబరు 19 వ తేదీన పార్లమెంటులో విదేశాంగవిధానంపై చర్చ ప్రారంభిస్తూ చెప్పారు హంగేరియన్ తిరుగుబాటుదార్లపక్షాన ఫాసిస్టుమూకలు లేకపోలేదనీ, బయటినుంచి తిరుగుబాటుదారులకు ఆయుధ సహాయం కూడా అందినదనీ, అయినప్పటికీ హంగరీ ప్రజలో అధికసంఖ్యాకులు స్వాతంత్ర్యం కోసమే తిరుగుబాటు చేశారనీ, సోవియెట్ సేనలు దేశంలోంచి వెళ్ళిపోవాలనీ, ప్రభుత్వంలో మార్పులు రావాలని కూడా వారు కోరారనీ, దిన్ని కాదనలేమనీ భారత ప్రధాని స్పష్టం చేశారు.



ప్రధాని మరొక ముఖ్య విషయాన్ని ఉద్ఘాటించారు. సాయుధ విప్లవంకంటె అది ముఖ్యమైనదన్నారు. హంగరీ ప్రజలు సాయుధ విప్లవం విఫలమైన తర్వాత శాంతియుత ప్రతిఘటన సాగిస్తున్నారు. బుడాపెస్టు పౌరులు పనుల్లోకి వెళ్లడానికి నిరాకరిస్తున్నారు. పనులు స్తంభించిపోవటం వల్ల నగరం ఎన్ని ఇబ్బందులకు లోనవుతున్నా కార్మికులు సమ్మెసాగిస్తున్నారు. సాయుధ విప్లవంకంటె ఈ శాంతియుత విప్లవంచాలా గొప్పదని ప్రధాని నెహ్రూ చెప్పారు. ఈ సందర్భంలో ఆయన ఇంకా ఇలా అన్నారు.



హంగరీలో రష్యను సేనలు నెలకొల్పిన నూత్న ప్రభుత్వంలో ప్రధానమంత్రి కదర్.

"నలభైఏళ్ళ క్రిందట మహాత్మాగాంధీ సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించినప్పుడు, ఇతరదేశాల్లో ఈ ఉద్యమం చరిత్రను మేమందరం ఎంతో ఆసక్తితో చదివేవాళ్లం. అటువంటి దేశాల్లో ముఖ్యంగా హంగరీ ఒకటి. హంగరీలో 19 వ శతాబ్దపు మధ్యకాలంలో శాంతియుతమైన సహాయ నిరాకరణం, ప్రతిఘటన జరిగాయి. ఆశాంతియుత ప్రతిఘటన పూర్తిగా కాకపోయినా చాలవరకు ఫలితాలు సాధించింది."

నూరేళ్ళకిందట హంగరీలో జరిగిన శాంతియుత ప్రతిఘటన వంటిదే ఇప్పుడు కూడా జరుగుతోందని ప్రధాని నెహ్రూ భావించారు.

[illegible]

[illegible]

నూరేళ్ళకిందట [illegible]

అనాటి పరిస్థితి [illegible]

[illegible] "ప్రజల హక్కులు భంగమవుతున్న [illegible] శక్తిలేదు" అని [illegible]

[illegible]

## హంగరీపై ఆస్ట్రియా ఆధిపత్యం

రెండువందల ఏళ్ళకు పూర్వం ఆస్ట్రియా, హంగరీలు కలిసి పరాయి దండయాత్రలను నిరోధించి స్వాతంత్ర్యం పొందాయి. ఉభయ దేశాలూ ఒకేరాజు పాలన క్రింద ఏకమయ్యాయి. ఏకమైనా, రెండు దేశాలు సమానమని, స్వతంత్రములనీ సంధిలో ఒక షరతువుంది. రాజుగారు మాత్రం ఆస్ట్రియన్ రాజుగారే. వియన్నాలోని రాజదర్బారుకు హంగేరియన్ సామంత ప్రభువులు హాజరయ్యేవారు. ఈ ప్రభువులలో క్రమంగా దేశభక్తి నశించిపోయింది. ఆస్ట్రియాపై భక్తి పెరిగిపోయింది. ఆస్ట్రియన్ చక్రవర్తులు

# ★ హంగరీ సహాయనిరాకరణం ★

హంగేరియన్ ప్రభువుల అలసతను ఆసరా తీసుకుని హంగరీ హక్కులను క్రమంగా హరించివేశారు. ఒకసారి హంగేరియన్ జాతీయవాదుల కుట్ర బయట పడింది. అప్పుడు కుట్ర నాయకులను ఉరితీసి హంగరీని బానిస దేశంగా మార్చివేశారు

కాని జాతీయవాదం అంతటితో నశించలేదు. హంగరీలో సైనికులను పోగుచెయ్యడానికి చక్రవర్తి ప్రయత్నించినప్పుడు హంగేరియను "మేము ఎన్నుకున్న పార్లమెంటుకే సైనిక సమీకరణ చేసే అధికారముంది," అని ఎదురు తిరిగారు. ఇలా ఒక అయిదేళ్ళు ఘర్షణ జరిగాక చక్రవర్తి పార్లమెంటు ఎన్నికలను అనుమతించాడు

1833 లో హంగరియన్ పార్లమెంటు సమావేశమైంది. అప్పటిదాకా హంగేరియన మాతృభాష మీద నిషేధం ఉండేది ఆ సమావేశంలో మొదటిసారిగా కౌంట్ షెచెన్యీ అనే ధనిక యువకుడు హంగేరియన్ భాషలో ప్రసంగించాడు! ఇది ఆ కాలంలో గొప్పసాహసమే అతని తోటి ప్రభువులందరూ నిర్ఘాంత పోయారు తెలియక చేశాడనుకున్నారు కాని మరునటి సమావేశంలో కూడా షెచెన్యీ అదే పని చేశాడు. అతడు హంగేరియన్ల హీనస్థితిని హంగేరియన్ భాషలోనే వర్ణించాడు. హంగరీ తిరిగి ఉన్నతస్థితికి రాగలదనే విశ్వాసం వెలడించాడు. వృద్ధులైన ప్రభువులందరూ అతడా భాషలో మాట్లాడుతున్నందుకు ముక్కుమీద వేలేసుకున్నారు కాని యువ సభ్యులు మాతృస్తన్యం గ్రోలినంత ఆనందంతో ఆ మాతృభాషా ప్రసంగాన్ని విని తన్మయులయ్యారు. ప్రసంగం పూర్తయిన తర్వాత సభాభవనం మారుమ్రోగేట్లు హర్షధ్వానాలు చేశారు.

ఈ సంఘటనతో హంగేరియన్ జాతీయవాదానికి కొత్తఊపు వచ్చింది షెచెన్యీ ప్రభువును రాజకీయనాయకత్వం వహించవలసిందిగా ప్రజలు ఒత్తిడిచేశారు. కాని అతడు నిరాకరించాడు విద్య, సారస్వతం, వ్యవసాయం, పరిశ్రమలు వీటిని పునరుద్ధరించడానికే అతడు జీవితాన్ని అంకితం చేశాడు. అతడు స్థాపించిన 'నేషనల్ అకాడమీ ఆఫ్ సైన్సు' గొప్ప విజ్ఞాన కేంద్రంగా ప్రఖ్యాతిపొందింది

హంగరీ రాజకీయ నాయకత్వం ఫ్రాన్సిస్ డీక్, లూయీకోసత్ ల చేతుల్లో ఉండేది డీక్ భూస్వామి; కోసత్ బారిస్టరు.

## నోరెత్తనిదేశం ఏందేశం?

"ఆస్ట్రియాను మనం యుద్ధంచేసి జయించలేము మనం లొంగిఉండక చేసేదేముంది?" అని మితవాదులు ఫ్రాన్సిస్ డీక్ ను అడిగారు.

"మీ హక్కులు భంగమవుతున్నాయి కాని మీరు నోరెత్తడంలేదు హక్కులు భంగమవుతున్నప్పుడు నోరెత్తని దేశం ఏం దేశం? అన్యాయానికి, దౌర్జన్యానికిలొంగి పడిఉండే దేశానికి ముక్తిలేదు." అని డీక్ ఎలుగెత్తిచాటాడు.

1836 లో పార్లమెంటులోని జాతీయవాదులు జాతీయ విద్యా ప్రణాళికను తయారుచేశారు ఆస్ట్రియన్ ప్రభుత్వం దాన్ని అంగీకరించలేదు. లూయీకోసత్ ఆ ప్రణాళికను ప్రజల్లో బాహాటంగా ప్రచారంచేశాడు అతన్ని తమపక్షానికి తిప్పుకోడానికి ఆస్ట్రియను ప్రభుత్వం ఉన్నతపదవిని ఎరపెట్టింది కాని అతడు నిరాకరించాడు. ఇక చేసేదిలేక ప్రభుత్వం అతన్ని, షెచెన్యీని, వెసిల్యీనీ అనే మరొక ప్రభువును, జాన్ బెలాగ్ అనే పార్లమెంటు సభ్యుణ్ణి అరెస్టు చేసింది. బెలాగ్ స్థానంలో మళ్ళీ ఎన్నికను జరిపించింది. కాని ఖైదులో ఉన్న బెలాగ్ నే ప్రజలు పెద్ద మెజారిటీతో ఎన్నుకున్నారు.

మళ్ళీ రెండేళ్లదాకా పారమెంటు సమావేశంకాలేదు సమావేశం కాగానే కోసత్ ను తదితరులను విడుదల చెయ్యాలని ఒత్తిడి చేసింది. "మీరు మీ వైఖరి మార్చుకుంటే విడుదల చేస్తా"మని ప్రభుత్వం అన్నది.

"మార్చుకోము" అని డీక్ ఖచ్చితంగా సమాధానమిచ్చాడు. "మా స్నేహితుల విడుదలకంటే మాదేశం భవితవ్యమే మాకు ముఖ్యం. దేశాన్ని కాదని తాము విడుదల కావడం మా స్నేహితులకు కూడా బాధాకరమే" అన్నాడు.

చివరికి ప్రభుత్వం మళ్ళీమెత్తబడి కోసత్ ప్రభృతులను విడుదల చేసింది.

లూయీకోసత్ విడుదల కాగానే "పెస్ట గెజెట్" అనే పత్రిక పెట్టాడు ప్రజలకు అది అభిమాన పాత్రమైంది. ఏ సమస్య వచ్చినా "కోసత్ ఏం రాశాడు?" అని పెస్ గెజెట్ చదివేవారు.

జాతీయ వాదులు తమ ఆందోళన అంత రెండు విషయాల మీద కేంద్రీకరించారు. ఆస్ట్రియన్లతో సమానంగానే తమ మీద పన్నులు వెయ్యాలనీ, హంగేరియన్ భాషను దేశభాషగా అంగీకరించాలనీ వారుకోరారు.

(54 వ పేజీ చూడండి)

# మంత్రాలు: నమ్మకాలు

## మంత్రంతో మాయమైన 'కంఠసర్పి'

ఈ మధ్య కొన్ని వారాలుగ ఆంధ్ర పత్రికలో మంత్రాలను గూర్చి జాబులు ప్రచురిస్తూన్నారు. వాటిని చూస్తూంటే నాకుకూడా తెలిసిన విషయాలు వ్రాయాలని కుతూహలం కలిగింది. మా ప్రాంతంలో నా చిన్నతనంలో నిభానుపూడి సుబ్బయ్యగారని ఒక పాముమంత్రవేత్త ఉండేవారు. మా ప్రాంతంలో ఎవరికి పాము కరచినా వారిని తీసుకవస్తూండేవారు. ఒకరోజున మా వడ్లమన్నాడులో ఒక కాపుకు కట్లపాము కరచింది. కొంతసేపటికి అతని నాలుక పెద్ద సొరకాయవలె నోట్లోనుంచి 20 అంగుళాలవరకూ పెరిగి బయటకొచ్చింది. మనిషి చచ్చిపోయినాడని అనుకున్నారు. మధ్యాహ్నానికి శ్రీ సుబ్బయ్యగారిని తీసుకవచ్చారు. ఆయన వచ్చి ఒక తురాయి చేతికికట్టగా రెండు నిమిషాలలో ఆ నాలుక హఠాత్తుగా లోపలకు లాక్కుపోయింది. పదినిమిషాలలో రోగి లేచి కూర్చున్నాడు. నిభానుపూడి సుబ్బయ్యగారి మంత్రమునకు అంత ప్రసిద్ధి వుంది. ఆయన కుమారులు రామచంద్రయ్యగారు నేటికీ గుడివాడలో మంత్రం వేస్తూంటారు.

ఒకరోజున తిరిగొప్పలనుంచి రాత్రి 12 గంటలకు ఒక కేసువచ్చింది. చావలి సుబ్బారావుగారని నాకు బంధువు, మిత్రులు వారి అమ్మాయికి (డిఫ్తీరియా) 'కంఠసర్పి' అనే వ్యాధివచ్చింది. వాళ్ల గ్రామంలో వున్న డాకరుకు చూపితే మావల్ల కాదు బెజవాడ తీసుకపొమ్మని చెప్పారుట. బెజవాడకు తీసుకవచ్చి కన్ను, ముక్కు, చెవి, నోరు స్పెషలిస్టుకు చూపారు. ఆయన రోగిని చూచి అయిదువందల రూపాయలు యిస్తే చికిత్స చేయగలనని, ముందు యిప్పుడు రెండువందలు బజానాగా యివ్వాలని, మిగతా మూడువందలు రేపుసాయంత్రంలోగా యివ్వాలని చెప్పాడు. పాపం ఆ పల్లెటూరి పెద్దమనిషి అప్పటికి పైకం తీసుకరాలేదు. ఇంటివద్దనుంచి తెప్పించి యిస్తాను, చికిత్స ప్రారంభించమని చెప్పినా ఆ వైద్యుడు వివక్ర డాయరు మీద పైకం పడితేనే చికిత్స చేస్తానని కసాయివలె మొండిపట్టు పట్టాడు. అంతట ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకవెళ్ళగా, ఇది అంటువ్యాధి యిచట చికిత్స చేయ వీలుపడదు తీసుకపొమ్మన్నారు. మరియొక పెద్ద డాక్టరుకు చూపగా యిది ప్రమాదమైన వ్యాధి అని చెప్పారే గాని వ్యాధి ఏమిటో ఎవ్వరూ చెప్పాకారు. దానితో అమెరికన్ ఆసుపత్రికి తీసుకవెళ్ళి చూపగా వారు యాంటీ డిఫ్తీరియా సీరం కొనుక్కురమ్మని చెప్పగా అది కొని తెచ్చి ఇచ్చారు. పిమ్మట ఒక ఇంజక్షను యిచ్చి అంటువ్యాధి ఇచట వుంచుటకు వీలుపడదు ముందురోగిని బయటకు తీసుకపొమ్మన్నారు. అప్పటికి రాత్రి 11 గంట లయింది 20 రూపాయల సుంగులు తెప్పించి బయటకు తీసుక పొమ్మంటే యిక పిల్ల బతకదని నిశ్చయించుకొని నావద్దకు తీసుకవచ్చారు. నేను ఉదయం చూదామని చెప్పి మాయింట్లో ఉంచి ఉదయం పరీక్షించి చూచితిని. అది కంఠసర్పి. జ్వరమున్నది కూడా. అంతట నాల్గు దినాలకు మందు యిచ్చి గుడివాడ తీసుక వెళ్ళి మంత్రం వేయించమని సలహా చెప్పాను. గుడివాడలో నిభానుపూడి రామచంద్రరావు గారుంటున్నారు వారితో మంత్రము వేయించమని చెప్పగా అలాగే తీసుకవెళ్ళి మూడు దినాలు మంత్రం వేయగా సర్పిమాడిపోయింది. మొత్తం పది రూపాయల తిరుగుళ్ళతో వ్యాధిపూర్తిగా నిర్మూలించి పిల్లకు ఆరోగ్యం కల్గింది. ఇది నా అనుభవంవల్ల చెప్పేడి మాటలు.

నా చిన్నప్పటినుంచీ మాయింటో కొన్ని వ్యాధులకు మంత్రములు వేసి కుదిర్చే ఆచారంఉంది. కామెర్లకు చీటికట్టుదురు. ఆచీటి ఒకచోటపాతి ఆరోగి స్నానం చేయుట, మూత్రవిసర్జన, అన్నంతిన్నకంచం అందుకడుగుట మొదలైన చేసిన ఆరోగికి కామెర్లుపోతాయి సూదులుమాత్రం కూడా వేసే ఆచారంకద్దు. పసిపిల్లలకు 1 రోజు మొదలు 12 నెలలవరకు గ్రహబాధలు కల్గుతాయి దానికి చీటికట్టి కుదిర్చే ఆచారమున్నది. నాకు పాముమంత్రం ఒకటేవచ్చు. ఆ మంత్రంవ్రాసి ఎటిభయంకరమైన ప్రదేశంలోపరున్నా నివసించినా అచటకు పాము, తేలు రాదు. ఇలాంటిమంత్రాలు ఎన్నో వున్నాయి ఇంకా చాలామంత్రాలు నశించిపోయాయి.

మేము వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మొదలైనవారము భక్తిరహితతారక రాజయోగమండలిలో సభ్యులము. అందులో యోగసంబంధమైన మంత్రచికిత్సయున్నది. '64 బ్రీదింగుకోర్సు' అనియున్నది. ఏవ్యాధికైనా ఆ బ్రీదింగ్సులో ఏది ఎలా పనిచేసేది వివరముగాఉంది. దీనిని కుంభకోణంలోని శ్రీ వెంకటసామిరావుగారు కనిపెట్టారు. ఈ చికిత్సకూడా చేసి వ్యాధులు నయముచేయు ఆచారముకలదు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు, మా పినతండ్రిగారు యీ చికిత్స చేస్తూండేవారు. ఏమందుతో నూ నయంకానిరోగాలు యీ చికిత్సలవల్ల కొన్ని వేలమంది వ్యాధులనుండి రక్షింపబడ్డారు. ఇలాటి మంత్రచికిత్సలు మన ఋగ్వేదంలో కోకొల్లలుగా నున్నవి. ఇవన్ని శాంబరమంత్రములె నీచంగా పరిగణింపబడుతున్నాయి. క్షీణాయుష్కునకు ఒకమంత్రం పారాయణంచేయిస్తే ఆయుర్వృద్ధికలిగి రోగనివారణ మవుతుంది. ఇది క్షయలోప్రశస్తము. కానరోగానికి ఒకటివుంది. మరొకవిచిత్రమైన మంత్రముంది. మనము ఎచ్చటకైనా ప్రయాణం చేయదలచినప్పుడు ఆమంత్రం మూడుసార్లు పఠించి బయలుదేరివెళ్ళాలి ఆప్రయాణం విజయవంతంగా ముగుస్తుంది. రైళ్లు బోల్తాపడటం, దొంగలు కొట్టడం, ప్రయాణములలో ఇబ్బందులు పడటం ఏమీజరగదు. సుఖవంతంగా ప్రయాణంచేసి తిరిగి రాగల్గుతారు. ఈ మంత్రాలన్నీ దైవోపాసనబలము కలవారికి ఎక్కువత్వరగా ఉపయోగపడతాయి. లేక ఎక్కువకాలం పఠించి సిద్ధిపొందాలి.

నమశ్శివాయ, బెజవాడ.

# ★ మంత్రాలు, నమ్మకాలు ★

## తలనొప్పికి మంత్రం

మంత్రాలు మహత్తరశక్తి గలవని - అందులో ఏమాత్రం సంశయం లేదని నమ్మేవారిలో నేనొకర్ని. ఆ సంగతి అర్థం చేసుకోవాలంటే కొంత పరిజ్ఞానం, సాధన, అనుభవం వుండాలి నేను కూడ మొదట - యిదంతా బూటకంఅని వాదించేవాణ్ణి కాని 1934 నుంచి 36వరకు యోగాభ్యాసం చేశాను. ఆ సందర్భంలో బొంబాయి కాల్బాదేవి మార్వాడీ గ్రంథాలయంలో అనేకం మంత్రం, శాస్త్రం, రోగశాస్త్రంపై ముఖ్యగ్రంథాలు, పత్రికలు చూస్తూ తెలుసుకున్నాను. ప్రస్తుత, పత్రికా పఠన ఎటువున్నా నా యోగసాధనానుభవంలో గడించినశక్తి, అనుభవంవల్ల - పురాణాలలో మన మహర్షులు, పురాణకారులు చెప్పియున్న ప్రతిదివ్యశక్తి - నగ్న సత్యము, సాధ్యము అని తెలుసుకున్నాను దురదృష్టవశం వల్ల నాయోగాభ్యాసానికి ప్రతిబంధకాలు కలిగి నిలిచిపోయింది ఆటి ప్రతిబంధకాలకు కారణాలన్నీ చెప్పితే ఆశ్చర్యపడతారు ఇంతకూ-విధినన్ను మార్గాన్నుండి విరోధించి పతనం చేసిందంటే నమ్మండి! నేను కుంభకాసనంలో భూమినుండి ఆధారం లేకుండా తొమ్మిదంగుళాల ఎత్తులో గాలిలో (భూమి ఆధారం లేకుండా) కూర్చునేవాడినంటే మీరు నమ్ముతారా! లేదు

నాకు మంత్రశాస్త్రమంటే అచంచల విశ్వాసమని చెప్పానుగదూ! ఒక రోజున కోరువాయిదా వుండి 11 గంటలకు వెళ్ళాను. ఎందుకో సాయంత్రం 2 గంటలకు భరింపరాని తలనొప్పివచ్చింది. నేను బాధపడుతుండగానూ మా ప్లీడరు గుమాస్తా శ్రీ జి. వి. ఎస్. కృష్ణమూర్తి చూచి 5 నిమిషాలలో పోగొట్టగలనన్నాడు. అతను చూస్తే పిచ్చివాడు, అమాయకుడుగా వుంటాడు నేను "నీముఖం" అని దప్పరించివేశాను అతను మీసం మీద చెయ్యివేసి-"నా దెబ్బ యిక చూడు - గ్యారంటీగా పోగొట్టగలను - అని సవాలుచేశాడు. దానికి నేనాశ్చర్యపడి, ఆ నమ్మకం కలవానిని కాదనడెంల్ల - "సరే మంత్రం వెయ్యి" అని కూర్చున్నాను. వేశాడు. ఆశ్చర్యం 5 నిముషాలకే చాల వరకు పోయింది. 10 నిముషాలకు నా తలనొప్పి ఏమైందో - అతి తేలికగా - అసలు నాకు తలనొప్పి వచ్చిందా-ఉట్టిదే - అన్నట్లు ఆశ్చర్యపోయాను.

అప్పుడే నా మోచేతికి కూడ మంత్రం వేయమంతో, 7,8 మాసాల్నుండి మోచేతిలో కీలునొప్పిగా వుండి అటుయిటు మోచెయ్యి కదిలినప్పుడు నొప్పిగా వుంటూవుండేది. ఉట్టిది ఆయన మంత్రం వేసిన తర్వాత ఏమైపోయిందో భగవంతునికే ఎరుక.

మానవునికి, ప్రకృతిశక్తులకు గల పరస్పర సంబంధాలు తెలియని మూఢత్వంవల్ల తెలుసుకోలేక పోవచ్చు. కాని మంత్రం సర్వశక్తివంతమైనది.

బండి బుచ్చయ్య.

సంపాదకుడు: ములుకోల, బెజవాడ.

* * *

## మంత్రాలన్నీ బూటకాలే

నేను 1947 సం॥ లో కనిగిరి తాలూకాలో ఆయుర్వేద వైద్యము చేస్తూఉండే వాణ్ణి. మంత్రాలన్నా, దయ్యాలన్నా నే నెంతమాత్రం నమ్మేవాడినికాదు.

అదే సమయములో పెద అలవలపాడను గ్రామములో ఒకవ్యక్తికి చేతిమీద పెద్ద వ్రణమై బాధపడుతూ, నాదగ్గరకొచ్చి బాగుచేయాలని ప్రార్థించగా, నాకు నిజంగానే వ్రణవైద్యం చేతగాక నాకు చేతగాదని చెప్పాను కాని వారువినక చస్తే చస్తాను బ్రతికితే బ్రతుకుతాను నీవు చేసి తీరాల్సిందేనని బ్రతిమిలాడగా నేను వ్రణవైద్యుల సలహాతీసుకుంటూ తుదకు ఆవ్రణాన్ని బాగుచేశాను నామీద ఒక రకమైన మూఢభక్తి చాలామంది ప్రజల్లో ఏర్పడసాగింది

అదేసమయంలో మాగ్రామానికి సమీప గ్రామస్థుడొకడు అప్పటికి సంవత్సరము నుంచి పెద్దపెద్ద హాస్పటల్సు అన్నీ తిరిగాడు, డాక్టర్లందరిని కలుసుకున్నాడు పెద్దపెద్ద భూతవైద్యులను కలుసుకున్నాడు. దాదాపు రు 1500-0-0 లు ఖర్చు పెట్టాడు. కాని అతనిజబ్బుపోలేదు. ఇంతకు అతను గుజరాతీ సైడు వ్యాపారం జేసేవాడు. అతనికి అచ్చట గుజరాతి దయ్యం పట్టిందని అతని అనుమానం. అది మొదలు క్రుంగి కృశించిపోతున్నాడు. డాక్టర్లు జబ్బేమీ లేదని చెప్తున్నారు. భూతమాంత్రికులు అతనికెన్నో మంత్రాలు వల్లించారు, వైద్యంచేశారు. గుజరాతీదయ్యం ఒకపట్టున పోయేదయ్యం గాదని అతని అనుమానం. అన్నిచోట్లతిరిగి విసిగి యింకబాగు కాదని యింటికివచ్చాడు.

ఆసమయంలోనే బెంగళాపురమనే గ్రామములో ఒక భూత వైద్యుడుండేవాడు. అతడు నేను ప్రయత్నంచేస్తానని పూనుకున్నాడు. కాని రోగినిచూడబోయేసరికి ఆ రోగి ఆ భూతవైద్యుని గడ్డంపట్టుకొని నాలుగు ఊపులువూపి 'నీవా నన్ను పారదోలేది, నీ తాతలాంటి వాండ్లకు నేను పోలేదు' అని గాండ్రించేసరికి ఆ భూతవైద్యుడికి 15 రోజులు అదురుజ్వరమే తగిలింది. అలాంటి సమయంలో నాదగ్గరకు వచ్చి విషయమంతా చెప్పి వైద్యము చేయమని చెప్పారు. పెద్దడాక్టర్లుమాచి జబ్బేమీ లేదంటే నేనేమిచేయగలను నావల్ల కాదన్నాను నామీదవున్న మూఢభక్తిచే 'నీవు చేయదల్చుకుంటే యెంతపనిఅయినా చేయగలవ'ని ప్రార్థించడారు నేనూ ఆలోచించాను. తుదకు ఒకయుక్తి తట్టింది. "దురదగొండి" కాయలను తెచ్చి బాగా ఎండబెట్టి బాగా ఒకపిడికెడు పొడి తయారుజేసి వుంచుకొని చెప్పినరోజుకు ఆ గ్రామము చేరాను. రోగిని దూరంగావుండే మాశాను ఆజానుబాహుడు. 6 అడుగుల పొడవుగల మనిషి. చాలాబలమైన మనిషి అతనినిమాస్తే నిజంగా భయంవేస్తుంది అతని దగ్గరకు పోవడానికి జంకాను. అతనిని రెండు స్తంభాలమధ్యవుంచి చేతులుచాపి కట్టివేయించాను గోచిమాత్రంఉంచి వొంటిమీద గుడ్డలు తీయించాను నన్నుజూచి గాండ్రిస్తున్నాడు. తర్వాత అచ్చటున్నవారందరిని బయటికి పంపించాను వేపమండలు తెప్పించాను మంత్రాలు చదువుతున్నట్లు నటించాను కొంతసేపటికి నేను తయారుజేసి వుంచుకొన్న "దురదగొండి" పొడిని చేటలో వేసి అతని వొంటినిండా పూదాను. అతనికి దురదయెత్తి ఏడ్వసాగాడు. గోకుకొనుటకు వీలుగాకుండా చేతులు కట్టివేయబడివున్నాయి ఎంతఏడ్చినా దురద తగ్గలేదు తుదకు 'నన్ను వెళ్ళనీయండి నేవెళ్తాను నాబుద్ధి గడ్డితినివచ్చాను. నాకు బుద్ధివచ్చింది ఇంకెప్పుడూ రాను. నన్ను విడిపించండి వెళ్తా'నన్నాడు. తర్వాత కొంతసేపటికి వొళ్ళంతా ఆముదంపూసి ఆ మంట తగ్గినతరువాత చేతులకు కట్టివిప్పి తాటూ వదిలి పంపుకొ బెటాను అదిమొదలు నా పేరుచెబితే యింట్లో జొరబడసాగాడు అప్పటినుంచి రోగికి నామీద మూఢభక్తి యెక్కువైపోయింది. తర్వాత నవరాత్రులు చేయమని నావెంట బడ్డారు నాకు నవరాత్రులు యెట్లా చేయాలో అసలు తెలియదు. సమీపములో నున్న భూతవైద్యుని కలుసుకొని నాకు సహాయంగా రావాలని కోరాను.

(56 వ పేజీ చూడండి)




# కోతి బుద్ధి



గొడవర్తి
భాస్కరరావు



కూనవరం గ్రామంలో
గోపన్నను బండివాడు
వానరమ్ము పెంచినాడు
వాలివంటి గట్టివాడు.



ఎల్లప్పుడు వానరమ్ము
ఎదుటనె గోపన్న చెంత
ఏ కీడులు మూడకుండ
ఎంచి పొంచి చూచుచుండ
అంతలోన నిద్రవచ్చె
నొక్కనాడు గోపన్నకు
గుర్రుపెట్టి నిద్రపోవ
జగ్రుమంటు నీగవచ్చె.

అరరే! నే చెంతనుండ
అన్యాయం ఈగ వ్రాలె
గోపన్నకు నిద్రచెడిన
కోపగించి కొప్పడునని
కోతి లోన తలచుకొనుచు
బస్సు బుస్సు మంచు నీగ
నుస్సురుమని యెగరగొట్టి
బుస్సని ముఖమున వ్రాలెను.



నీపని ఇల్లాగుందా
నా పని తెలియదా నీకు
కోతిబంటు చెంతనుండ
గోపన్నను తాకుదువా?
అనుచు చేత బండరాయి
అంతలోనె ఈగ పైకి
గోవిందుని ముఖము వెంపు
కోపంబున విసిరికొట్టె!

రాయి విసురు వినిన ఈగ
మాయమయ్యె నంతలోన!
ముక్కు బద్దలాయె గోపన
ముఖమును చిట్లించినాడు.

ఎంతమంచి నేర్పుజూపి
ఎంత శ్రమ పడిన నేమి?
"కోతిబుద్ధి" పోదు ఎపుడు
గొప్పగాను పెంచినంత.

అందుకేను పెద్దలంత
అల్లరిపనులను చేస్తే
"కోతిబుద్ధి" అంటు వున్న
"కోతి"తోనె పోల్చుతారు!!



# వరప్రసాదులు



పూర్వము రావణుడు బ్రహ్మవల్ల గొప్పగొప్ప వరాలను పొంది భూలోకమంతా తిరుగుతూ వీరులైనవారి నందఱిని ఓడించసాగాడు.

ఇలా తిరుగుతూ ఒకప్పుడు ఉశిరబీజమనే ప్రదేశానికివచ్చాడు. అక్కడ 'మరుత్తు' అను రాజు దేవతల నందఱిని పిలిచి యజ్ఞము చేస్తున్నాడు. సంవర్తనుడనే బ్రహ్మర్షి సకల దేవతలను చేర్చుకొని యజ్ఞం చేయిస్తున్నాడు.

దుర్మార్గుడైన రావణుని చూచి దేవతలు భయపడి జంతుజాలముల రూపములు ధరించారు. ఇంద్రుడు నెమిలి అయినాడు. యముడు కాకి, కుబేరుడు తొండ, వరుణుడు హంస ఇలాగే మిగిలినవారు తలా ఒక జంతువు రూపాన్ని ధరించారు.

రావణుడు యజ్ఞశాలను ప్రవేశించి యజ్ఞ దీక్షితుడైన రాజును చూచి, 'యుద్ధముచేస్తావా? లేక ఓడిపోయానని ఒప్పుకుంటావా?" అని ప్రశ్నించాడు. రాజు రావణునిచూచి అపహాసము చేశాడు. దాంతో రావణునికి కోపమువచ్చి, 'నేను కుబేరుణ్ణి జయించాను నన్ను జయించగలిగినవాడు లేడు' అని విఱ్ఱవీగాడు. మరుత్తు రావణుని మాటలకు మండిపడి, 'ఇప్పుడేనిన్ను యమలోకానికి ప్రయాణము చేయిస్తాను' అని ధనుర్బాణములు తీసుకున్నాడు.

అక్కడేఉన్న సంవర్తన ఋషి మరుత్తుకు అడ్డమువచ్చి'

'రాజా! ఇది ఈశ్వర ప్రీతి కొఱకు చేస్తున్న యజ్ఞము. ఈ యజ్ఞము పూర్తిగానియెడల కుల క్షయము కలుగుతుంది. యజ్ఞదీక్షితుడైన నీకు యుద్ధము జోలివద్దు దీక్షితునికి క్రోధముతగదు.' అని బోధించాడు. గురువుమాటలకు సమ్మతించిన ఆ రాజు యుద్ధము మాని యజ్ఞార్థము వెళ్ళిపోయాడు.

*~~~~~~~~~~~~*

రామప్రియ

*~~~~~~~~~~~~*

అప్పుడు రావణుడు తానేగెల్చానని, శత్రువు ఓడిపోయాడని తలచి యజ్ఞము చూడవచ్చిన మహర్షులను చంపి, రక్తము త్రాగి తన దారిని పోయాడు.

రావణుడు వెళ్ళిపోగానే ఇంద్రాది దేవతలు తమ తమ రూపాలను ధరించి ఆయా జంతువులకు వరములిచ్చారు.

ఇంద్రుడు నెమిలినిచూచి, 'ఓ పక్షిరాజా! నీవు నాకు చేసిన ఉపకారమునకు సంతోషించాను. నా వెయ్యి కన్నులు నీ పింఛమందు వుంటాయి. నేను వర్షిస్తుంటే నీవు ఆనందము పొందుతావు.' అని వరము ఈయగానే అంతవరకు నల్లనైయున్న నెమిలిపింఛములు రంగు రంగులతో ప్రకాశించాయి. ఇప్పుడు మనముచూచే నెమిలి కన్నులు ఇంద్రుడికన్నులే.

యమధర్మరాజు కాకిని చూచి, 'పక్షీ! నావల్ల జీవులు అనేక రోగములతో బాధపడుతూ వుంటారు. నేను నీకు ఇష్టుడగుటవల్ల రోగము లేనియు నిన్నంటవు ఎంతవరకు మనుష్యులు చంపకుండ వుంటారో అంతవరకు నీవు జీవిస్తావు. నాలోకమున ఆకలిబాధచే నకనకలాడుజీవులు నీవుభుజించిన మాత్రాన తృప్తిచెందుతారు' అని వరమిచ్చాడు అప్పటి నుండి మానవులు శ్రాద్ధములలో పితృపిండాలను కాకులకు పెడుతున్నారు పిండములను కాకులు తిన్నట్లయితే పితృదేవతలు తృప్తి పొందినట్లు తలంచబడుతున్నది

వరుణుడు హంసకు స్వచ్ఛమై తెలుపు వర్ణమును ప్రసాదించాడు. వరమీయగానే అప్పటివరకు చామనచాయరంగుగలిగిన హంసలు స్వచ్ఛమైన తెలుపు రంగును పొందాయి.

కుబేరుడు తొండకు నీ శిరస్సు బంగారురంగు కలిగియుండుగాక అని వరమిచ్చాడు. అప్పటినుండి తొండలు తలభాగమున బంగారు రంగును పొందాయి.

బాలలూ! చూచారా మనము రోజూ చూచే జంతుజాలములు ఎలాంటి వరములను పొందాయో!



# గురుభక్తి

**కె. సదానందం**

పూర్వం ధౌమ్యుడు అనే మహర్షి ఉండేవాడు. అతని దగ్గర అనేకమంది శిష్యులు విద్యాభ్యాసం చేస్తూ ఉండేవారు ధౌమ్యుడు. వారికి విద్యనుబోధిస్తూ కన్న బిడ్డల్లాగా చూస్తూ వుండేవాడు.

ధౌమ్యుని శిష్య సమూహంలో ఆరుణి అనే అతడు ఒకడు. అతనికి గురువు పట్ల భక్తి గౌరవాలు అపారం. గురువుమాట జవదాటనివాడు. అతడు విద్య నభ్యసిస్తూనే గురువుచెప్పే యితర కార్యాలు కూడా చేసేవాడు. ధౌమ్యమహర్షి అతన్ని తన వ్యవసాయకార్యాలు చూస్తూ వుండడానికి నియోగించాడు

ఒకనాటి సాయంకాలం ఆరుణి గురువుగారి వరిపొలం ఎలావుందో చూసి వద్దామని బయలుదేరాడు. అక్కడికి చేరేలోపల నిర్మలాకాశం మేఘావృతమైంది చూస్తూ వుండగానే ఎడతెరిపి లేకుండా కుంభవర్షం ప్రారంభమైంది. నేలంతా వరదలతో నిండిపోయింది. వానలో తడిసి ముద్దయిపోయిన ఆరుణి వెనుదిరిగినవాడు కాదు. పొలంగట్లన్నీ జాగ్రత్తగా పరీక్షించడం మొదలెట్టాడు. అన్ని గట్లు సరిగ్గావున్నై కాని ఒక గట్టుకుమాత్రం రంధ్రం పడివుంది ఆ రంధ్రం గుండా నీరు వేగంగా పొలంలోనికి వచ్చిపడుతోంది. అది చూచి ఆరుణి కలవరపడ్డాడు. రాబోతున్న ప్రమాదాన్ని గుర్తించాడు. పైరు మునిగిపోయిందంటే తీరని నష్టం సంభవిస్తుంది. సంవత్సరం పాటు తాము చేసిన కృషి అంతా వ్యర్థమైపోతుంది. ఆశ్రమానికి వెళ్లి గురువుగారిని, శిష్యులను తీసికొద్దామంటే- అంతలోపల పైరు మునిగిపోతుంది. కాబట్టి తక్షణమే ప్రవాహాన్ని ఆపాలి.

ఆరుణి వెంటనే చిటికెపాటు కాలాన్ని కూడా వృధా పోనియకుండా ఆరంభాన్ని పూడ్చడానికి పూనుకున్నాడు. దానిలో గడ్డి చుట్టలను దూర్చాడు. ప్రవాహం ఆగిందికాదు. గండిలో రాళ్లు పడేశాడు. ఊహుఁ!—ప్రవాహం కట్టుబడలేదు. మట్టిముద్దలను తీసి రంధ్రంలో కుక్కాడు. మన్ను కరగిపోయి నీరు ఎప్పటిలా ప్రవహించసాగింది. ఆరుణి అన్ని విధాలా ప్రయత్నించి విఫలుడయ్యాడు.

అతనికి యిక ఏమిచేయడానికీ తోచలేదు ఒక్క క్షణకాలం ఆలోచించాడు ఉన్నట్టుండి చటుక్కున రంధ్రంలో దూరాడు. నీళ్లు రాకుండా చేతులూ, కాళ్లూ ముడిచిపెట్టుకొని కూర్చున్నాడు. ప్రవాహం ఆగింది. పొలానికి ముంపుదెబ్బ తప్పింది. ఆరుణికి భయం తీరింది.

రంధ్రంలో ఆరుణి కూర్చున్నాడు. ఒక వైపునుండి నీరుబలంగా అతన్ని నెట్టుతోంది. అతని ఒళ్లంతా తడిసిపోయి మట్టితో నిండిపోయింది. ఊపిరి పీల్చుకోవడానికికూడా కష్టంగావుంది. చాలసేపు నీటిలో కూర్చున్నందుచేత చలి వేయడం ప్రారంభించింది.

చీకటిపడింది. చుట్టూ చీకటి— కారుచీకటి! చలి అధికమౌతోంది. ఆకలేస్తోంది. కాని ఆరుణి రంధ్రం నుండి కదల్లేదు. అటువంటి వేళకాని వేళ ఆ నిర్జన ప్రదేశంలో అతని స్థితి నెరిగి సాయంచేసేవాళ్లెవరున్నారు?...తన గురువు శిష్యులతో వస్తాడని అతడాశించాడు.

క్షణాలు, నిమిషాలు, ఘడియలు దొర్లిపోతూ వున్నై. అర్థరాత్రయింది. ఎవ్వరూ రాలేదు. ఆరుణికి చలి సహించడానికి శక్యం కాకుండావుంది. దవడలు గడ గడలాడుతున్నాయి బలం సన్నగిల్లిపోతోంది. ఒళ్లంతా బిగుసుకుపోయింది. కండ్లు మూతలుపడ్డాయి.

సాయంకాలం వెళ్లిన ఆరుణి ఎంతకూ రాకపోయేసరికి ధౌమ్య ఋషికి అనుమానంకలిగింది. ఆ కాళరాత్రిలో, జడివానలో—ఏదో సంభవించి వుండాలనుకున్నాడతడు. వెంటనే కొందరు శిష్యులను వెంటబెట్టుకొని వరిపొలందగ్గరికి వెళ్లాడు. అంతటా కలయజూశాడు. ఒకచోట పొలంగట్టు రంధ్రంలో యిరుక్కొని స్మృతితప్పి కూర్చునివున్న ఆరుణి అతని కంటబడ్డాడు. జరిగిన సంగతంతా అతనికి బోధపడింది. వెంటనే శిష్యుణ్ణి రంధ్రం నుండి తీయించి

# శివుని ఆజ్ఞ

పార్వతి తపస్సు చేసి శివుణ్ణి మెప్పించి ఆయనను పెండ్లి చేసుకుంది.

పార్వతీదేవితో పాటు ఆమె వాహనమైన సింహంకూడా శివుని నివాసమైన కైలాసగిరికి వెళ్ళింది.

కైలాసంలో ఉన్న అరణ్యంలో ఒక ఏనుగ వుంది ఆ ఏనుగను చూడటంతోనే సింహానికి నోరూరింది.

తన కుంభస్థలం మీదికి ఉరకబోతున్న సింహంతో యేనుగ, 'ఆగు!' అంది.

సింహం, 'నన్నా ఆగమంటున్నావు? నే నెవర ననుకున్నావు? పార్వతీదేవి యొక్క వాహనాన్ని!' అంటూ గుడ్లురచేసింది

'కావచ్చు. కాని యీ అడవిలో శివుని ఆజ్ఞ లేనిదే చీమకైనా హాని జరగటానికి వీల్లేదు. వెళ్ళు!' అంది ఏనుగ.

సింహానికి కోపంవచ్చింది. కోపమంతా దిగమింగుకుని, ఒక్క మందహాసం చేసి, 'శివుని ఆజ్ఞంటే ఎంతసేపు? ఇట్టే తెస్తాను వెళ్ళి! ఆయన ఆలివంక చుట్టాన్నైన నన్ను కాదంటాడా?' అని, పార్వతీదేవి అంతఃపురంవైపు పరుగెత్తింది.

సింహం ఆ దేవేరి చేత శిఫారసు చేయించుకుని శివునియొక్క అనుమతిని ఇట్టే సంపాదిస్తుందనీ, అప్పుడు తనకు ముప్పురాక తప్పదనీ అధైర్యపడింది యేనుగ

ఏం చెయ్యాలో తోచక, ఆ ఏనుగ మెల్లిగా అడుగులు వేసుకుంటూ తన మిత్రుడు గుడ్లగూబ నివసిస్తోన్న రావిచెట్టు వద్దకు వెళ్ళింది.

'ఏం మిత్రమా విచారంగా వున్నావు? ' అని అడిగింది ఘూకం.

ఏనుగ సంగతంతా చెప్పి, "ఆ సింహం ఈ రాత్రో రేపో మళ్ళీ వచ్చి, 'శివుని ఆజ్ఞ అయిందం'టూ నాపని పట్టేస్తుంది" అంది

గూబ, 'ఏడిసిందిలే! నువ్వేం భయపడకు. నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డువేస్తాను' అంది.

గూబ పలుకులు వినేసరికి అంత విచారంలో కూడా ఏనుగకు నవ్వు వచ్చింది.

గూబ, "నవ్వకు మిత్రమా. 'రోంత ఉన్నావు! నువ్వు చేయకలిగిందేమిటి?' అని తోసి పారెయ్యకు. ఈ ఆపదలోంచి నిన్ను తప్పించి తీర్తాను. ఆనాడు నువ్వు నాకు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చేసి నా కృతజ్ఞత నీకు కనపరుచుకుంటాను" అంది.

ఏనుగ, 'నీకు నా వల్ల జరిగిన ఉపకారమేమిటి?' అంది

గూబ, 'మరిచిపోయావా? ఆశ్చర్యమేముందిలే. మంచివాళ్లు తాము ఇతరులకు చేసిన మేలు ఇట్టే మరిచిపోతారు...ఆనాడు గాలివాన వచ్చినరోజున ఈ చెట్టు కూలిపోయి నేలమీదికి ఒరిగిపోయింది జ్ఞాపకం లేదూ? అప్పుడు నా భార్య తొఱ్ఱలో గుడ్లుపెట్టి పొదుగుతున్న సమయం. 'ఏలాగరా భగవంతుడా!' అని ఆందోళన పడుతున్న సమయంలో భగవంతుడులాగే నువ్వు ఈ దారిన వచ్చావు. నా గోడు విని, నీ తొండముతో ఈ చెట్టును యథాప్రకారం నిలబెట్టి, నీ కాళ్ళతో చెట్టు మొదలు కట్టుదిట్టం చేసి నా కొంప నిలబెట్టేవు', అంది.

**పాలంకి వెంకటరామచంద్రమూర్తి**

---

## గురు భక్తి

తగిన ఉపచారాలు చేశాడు. ఆరుణికి తెలివి వచ్చింది విద్యార్థులందరూ కలిసి రంధ్రాన్ని పూడ్చారు.

ఆరుణి చూపిన ధైర్యానికి, గురుభక్తికీ, ఓర్పుకూ గురువు మెచ్చుకొన్నాడు "నీకు సకల శుభాలు కలుగుగాక!" అని ఆశీర్వదించాడు.

★

ఏనుగ, 'ఆ మాత్రానికేనా ఇంతగా చెపుతున్నావు? అది నా చేతిలోవున్న పనిగాబట్టి చేశాను' అంది.

గూబ, 'ఆసింహం మళ్ళీ వస్తే నువ్వేమీ అధైర్యపడకు. ఎందుకైనా మంచిది. నువ్వు అది వచ్చే వరకూ ఈ చుట్టుపక్కలే వుంటే ఏం జరుగుతున్నదీ నాకూ కూడా తెలుస్తుంది' అంది.

ఏనుగ, 'సరే' అందికాని దాని గుండెమాత్రం కుదుటపడలేదు.

అక్కడ సింహం పార్వతీదేవి ముందు నిలబడి, "చూశావుటమ్మా, ఈ అడవిలోవున్న ఏనుగకు ఎంత పొగరోనూ? దాన్ని నేను ఫలహారం చేద్దామని వేడితే, 'నన్ను భక్షించడానికి నీకు శివుని ఆజ్ఞ వుందా?' అని అడిగింది! నీ వాహనాన్నైన నాకుకూడా కావాలా శివుని ఆజ్ఞ?'" అంది.

పార్వతి, 'తప్పకుండా కావాలి. నీకే కాదు, నాకుకూడా ఏమిచేద్దామన్నా ఆయన అనుమతి కావలసిందే తెలుసా? నువ్వు నా వాహనానివిగదా అన్నగర్వంతో ఇక్కడ విచ్చలవిడిగా సంచరించి ఆయనకు కోపం రప్పించావంటే, ఆ మూడో కన్ను తెరిచి నిన్ను మసిచేసి పారేస్తాడు యేమనుకున్నావో? మన్మధుడు ఎలా భస్మమైపోయాడో ఆనాడు నువ్వు కళ్ళారా చూశావుగా?' అంది.

'ఆ మాటలు వినటంతోనే సింహం చప్పబడిపోయింది. 'కాని ఆ ఏనుగను ఎలాగైనా దక్కించుకోకపోతే యింక నాకు పరపతే ఉండదు!' అని దేవుళ్ళాడింది.

పార్వతి, "ఏదో సమయంచూసి ఆయన అనుమతి సంపాదిద్దుగానిలే. అడిగినంతమాత్రాన్ని ఆయన సమ్మతించడు. ఉపాయంగా అడగాలి' అంది.

సింహం ఆక్షణంనుంచీ ఉపాయం కోసం వెతికింది. మరునాడు శివుడు మంచికళలో వుండగా చూసి, 'ప్రభూ, తమ అనుమతి ఐతే నేను మా అడవికి పోతాను' అంది.

శివుడు నిర్ఘాంతపోయి, 'అదేమిటి? నువ్వు వెళ్ళిపోతే మీ అమ్మగారికి వాహనమెలాగ? ఇంతకీ నీకిక్కడ వచ్చిన లోపమేమిటి?' అన్నాడు.

సింహం, "లోపమనికాదు ప్రభూ. నాకు మా అడవిలోని ఏనుగులను చంపి తినడం అలవాటు. ఇక్కడ అడవిలోని జంతువులు పరస్పరం విరోధం లేకుండా మెలుగుతున్నాయి. 'ఈ పద్ధతి మంచిదే!' అని తోచి నేనుకూడా ఏ ఏనుగ దరికీ వెళ్లటంలేదు. కాని రోజూ ఒక ఏనుగమాత్రం నాకు కలలో కనపడుతోంది. దానిని భక్షించినట్లుకూడా కలగంటున్నాను. కాని స్వప్నంలోంచి మెలకువ రావటంతోనే 'అది కలయే' అనీ, 'కడుపు ఖాళీగానే వుంద'నీ తేలిపోతోంది. నిత్యం ఆ ఏనుగ కలలో కనపడి నాకు ఆశ కలిగిస్తోండడంవల్ల, అది నిజంగా ఎదురైనప్పుడు ఆకలిచిచ్చువల్ల దాన్ని ఎక్కడ చంపేస్తానో అన్న భయంవేస్తోంది. అందుకోసం ఇక్కడనుంచి పోతానంటున్నాను" అంది.

శివుడు యాధాలాభంగా 'యీమాత్రానికేనా, మీ దేవిని వదలి వెళతానంటున్నావు? అంతగా వుండబట్టలేకపోతే ఆ కలలో కనబడే ఏనుగును భక్షించవచ్చులే' అన్నాడు.

సింహం 'చిత్తం, చిత్తం తమరు మహాప్రభువులు. మా అమ్మగారిని వదలి వెళ్ళటంఅంటే నాకూ బెంగయే నండి' అంది. తర్వాత మెల్లిగా అక్కడనుంచి జారుకుని, అడవిని ప్రవేశించి, ఉరకలు వేసుకుంటూ పోయి, ఏనుగముందు ప్రత్యక్షమైంది. శివుని ఆజ్ఞ మాట చెప్పి, 'ఇప్పుడేమంటావు?' అని గర్జిస్తో మీసం దువ్వింది.

ఏనుగ దీనంగా చెట్టుపై నున్న గుడ్లగూబవైపు చూసింది. గూబ 'మృగరాజా, శివుని అనుమతి ఐందని మాకు తెలియటానికి సాక్ష్యమేమైనా వుందా?' అని అడిగింది.

సింహం కోపంగా గుడ్లగూబ వైపుచూసి, 'సాక్ష్యం కావాలా మీకు? కావలిస్తే వెళ్లి ఆ శివుణ్నే అడుగు. ఆయన అనుమతినిచ్చినపుడు పార్వతీదేవికూడా అక్కడే వుంది. ఆవిడే చెపుతుంది కావలిస్తే' అంది.

పార్వతీదేవిమాట రావటంతోనే గుడ్లగూబకు ఒక ఉపాయం తట్టింది. వెంటనే అది సింహంతో, నేను నీ మాట నిజమో కాదో ఆ శివుణ్ణి అడిగివస్తాను. మీ రిద్దరూ కూడా అక్కడికి రండి. ఈ వ్యవహారమేదో అక్కడే తెముల్చుకుందాము' అంది.

గుడ్లగూబ ఇట్టే ఎగిరివెళ్లి శివుని సన్నిధిని ప్రాలి వెంటనే కళ్లు మూసుకుంది

ప్రమధగణంమధ్య కొలువు తీర్చి

# ★ శివుని ఆజ్ఞ ★

వున్న శివుడు, గూబకేసి చూసి, 'ఎవరునువ్వు?' అని ప్రశ్నించాడు.

గుడ్లగూబ పలుకలేదు. శివుని వాహనమైన నందికేశ్వరుడు, 'యీ పక్షికి నిద్ర పట్టినట్లుంది దేవా' అన్నాడు. తన తోకతో ఆ వృషభ రాజు మెల్లిగా ఆ గూబను తట్టి 'లే, లే. దేవసన్నిధిలో ఆవులించనైనా కూడదు. అలాంటప్పుడు ఏకంగా నిద్రపోతున్నావేమిటి?' అని లేపేడు.

గుడ్లగూబ నిద్రలోంచి అకస్మాత్తుగా లేచినట్లు లేచి కళ్ళు నులుపుకోడం ప్రారంభించింది. శివుడు 'ఎవరు నువ్వు' అని మళ్ళీ ప్రశ్నించాడు.

గుడ్లగూబ, 'దేవా, నేను వేద వ్యాసుని శిష్యుణ్ణి' అంది.

శివుడు ఆశ్చర్యంతో, 'వేద వ్యాసుని శిష్యులలో గుడ్లగూబ ఒకటి వుందని నాకు తెలియదే!' అన్నాడు.

గూబ, 'ఆ సంగతి మా గురువు గారికే తెలియదు స్వామీ. ఆయన ఒకనాడు శిష్యసమేతంగా వచ్చి, నేను నివసించే చెట్టుక్రింద కూర్చుని శిష్యులకు తర్క శాస్త్రం బోధించాడు. తొఱ్ఱలోనుండి నేనూ కూడా విని ఆ శాస్త్రంలో పాండిత్యం సంపాదించాను' అంది. నందివైపు తిరిగి, 'వృషభరాజా, చాలా గొప్ప స్వప్నం వచ్చిందయ్యా,' అంది.

'ఏమిటా స్వప్నం?' అన్నాడు శివుడు.

గూబ, 'నేను భార్యా బిడ్డలూ ఉన్నవాణ్ణే కాని ఆ కలలో నేను బ్రహ్మచారినై ఉన్నట్లూ, మా గురువైన వ్యాసమహర్షి 'వత్సా, నీకు విద్య పూర్తి ఐంది. ఇంక నీవు పెండ్లి చేసుకుని గృహస్థాశ్రమం స్వీకరించు' అన్నట్లూ వచ్చింది. నేను 'చిత్తం స్వామీ' అని గురువులవద్ద శలవు తీసుకొని పెండ్లి కుమార్తెకై వెతుకుతోంటే ఒక దేవకాంత కనపడింది. ఆమెను నన్ను పెండ్లి చేసుకోవలసిందని కోరేను. ఆమె 'శివుని ఆజ్ఞ ఐతే గాని నేను నిన్ను వివాహం చేసుకోడానికి వీల్లేదు' అని బదులు చెప్పింది ... స్వామీ ఆమెను వివాహం చేసుకోడానికి నాకు అనుమతి ఇవ్వాలి' అంది గూబ.

శివుడు 'నువ్వామెను వివాహం చేసుకోడానికి అనుమతి ఇచ్చాను. ఎవరా దేవకాంత?' అన్నాడు.

గుడ్లగూబ నసుగుతో, 'ఆమె పార్వతీదేవిలా కనపడింది ప్రభూ' అంది.

'పార్వతీ దేవి' అనటంతోనే శివుడు నిర్ఘాంతపోయాడు. తీరా మాట ఇచ్చేశాడు గనుక కోప్పడకుండా, 'ఘూకోత్తమా, వేదవ్యాస శిష్యుడవైన నీకు తెలియనిదేముంది గనక? కలలో కనపడినంత మాత్రాన పార్వతీదేవిని నువ్వు వివాహం చేసుకుంటానంటే ఎలా కుదురుతుంది?' అన్నాడు.

గుడ్లగూబ, స్వామీ, కలలో ఏనుగ కనబడింది కాబట్టి దాన్ని భక్షించటానికి అనుమతి ఇవ్వమని సింహం కోరింది. తాము అనుమతి ఇచ్చారుట. అలాంటప్పుడు నాకు మాత్రం...' అని ఆగింది.

శివుడు, 'తప్పే. సింహం కూడా ఆ ఏనుగను భక్షించటానికి వీల్లేదు' అన్నాడు.

అప్పుడే శివుని కొలువును ప్రవేశిస్తోన్న సింహానికీ, ఏనుగకీ ఆ మాటలు చెవుల్లో పడ్డాయి. ఆశాభంగం కలిగిన సింహం చిన్నబోయింది. ఏనుగ మహదానందంతో గుడ్లగూబను తన కుంభస్థలంమీద కూర్చోబెట్టుకుని, అడవిలోకి వెళ్ళిపోయింది. 




# 31 కెప్టెన్ నీమో

## ఆఖరి మాట

తరవాత జలాంతర్గామి తలుపులు దభాలున మూసుకుపోయాయి. నాటిలస్‌లో నాలుగువైపులా అంధకారము, నిశ్శబ్దత అలుముకున్నాయి. జలాంతర్గామి మహా వేగంతో ప్రయాణం సాగించింది. అది ఉత్తరంగా పోతూందో, దక్షిణంగా పోతూందో ఏమీ అంతు చిక్కలేదు. ఆ ఓడ అంత దారుణంగా ముంచివేసినతరవాత కెప్టెన్ నీమో మళ్లీ ఎక్కడికి ప్రయాణం కట్టాడో!

నాకా నౌక ముంచివేసినప్పటి నుంచీ కెప్టెన్ నీమో అంటే పట్టరానికోపం బయలుదేరింది. అంతలో దీపాలు వెలిగాయి నేనోకమారు యంత్రాలకేసి చూశాను. జలాంతర్గామి గంటకు 25 మైళ్ళ వేగంతో చరచరా సాగిపోతూంది. చాలా వరకు సముద్రం లోపలనుంచే ప్రయాణం సాగించినా ఒక్కొక్కప్పుడు సముద్రం మీదికికూడా తేలుతూండేది.

మా జలాంతర్గామి అప్పుడే ఇంగ్లీషు ఛానల్ దాటిపోయిందనీ నార్వే తీరంకేసి సాగిపోతూందనీ గ్రహించాను.

సాయంత్రంఅయ్యేసరికి జలాంతర్గామి కొన్నివందలమైళ్ళ దూరం వెళ్లిపోయింది. బాగా చీకటిపడింది. సముద్రం అంతా అంధకారబంధురంగా ఉంది. కొంతసేపటికి మినుకు మినుకుమంటూ చంద్రవంక కనిపించింది.

నేను నా గదిలోకి వెళ్లాను గాని ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టలేదు. నాకా నౌక ముంచివేసిన వ్యవహారం అంతా గుండెలమీద

అనువాదం: "వినాయక"

కుంపటిలా కనబడింది. ఎంతగా ప్రయత్నించినా నిద్ర పట్టలేదు.

ఆరోజు మొదలుకొని జలాంతర్గామి ఎటు సాగిపోతున్నదీ ఎవరికీ తెలియులేదు. అంతా మంచు మునుగులో మునిగిపోతున్నట్లే కనబడింది. నౌకలో ఉన్న గడియారాలన్నీ ఆగిపోయాయి. జలాంతర్గామి ప్రయాణం ఆవిధంగా సుమారు ఇరవైరోజులదాకా సాగిపోయింది. కెప్టెన్ నీమో మాకెవ్వరికీ మరి కనిపించడమే మానేశాడు.

నెడ్‌లాండ్, కాన్సెలు కూడా నా కళ్ళకి కనబడడమే మానేశారు. అక్కసుకొద్దీ నెడ్‌లాండ్ ఆత్మహత్యకు పాల్పడతాడేమోనని కాన్సెలు భయపడ్డాడు. అందుచేత అస్తమానము అతగాణ్ణే కనిపెట్టుకుని కూర్చునేవాడు. నాకీ పరిస్థితులన్నీ బాగా దుర్భరంగా కనిపించాయి.

కొంతసేపేమీ తోచక కొంచెం

## జరిగిన కథ :—

అది 1866 వ సంవత్సరం ప్రారంభం. సాగర గర్భంలో బ్రహ్మాండమైన జలజంతువేదో కనిపించిందనే వార్త ప్రపంచప్రజలను విభ్రాంతులను చేసింది. సముద్రంలో ప్రయాణంచేసే నౌకల కది ఇట్టే కనిపించి ఇట్టే మాయమయ్యేది. అమెరికా ప్రభుత్వం అబ్రహాం లింకన్ అనే యుద్ధనౌకను ఆ జలజంతువును వేటాడడానికి నియమించారు. అమెరికా ప్రభుత్వ నౌకాశాఖా కార్యదర్శి హాబ్సన్ ఫ్రెంచి ప్రకృతిశాస్త్రపరిశోధకుడు ప్రొఫెసర్ అరోనాను ఈ విజ్ఞానయాత్రలో పాల్గొనవలసిందని ప్రార్థిస్తాడు. అతడు వెంటనే దాని కంగీకరించి తన పరిచారకుడు కాన్సిల్ తో సహా ఓడ ఎక్కుతాడు. అబ్రహామ్‌లింకన్ క్రమక్రమంగా పసిఫిక్ ఆమహాసముద్రంలో ప్రవేశిస్తుంది. అది అలాగ కొంతదూరం ప్రయాణం చేసేసరికి కొంతదూరంలో సముద్రతరంగాలమీద ఒక పెద్ద వెలుగుకనిపించింది. ఆ వెలుగు ఒక పెద్ద జలచరానికి సంబంధించినదై ఉండాలని నౌకాధికారులంతా ఊహించారు. నావ దానిదగ్గిరికి పట్టించి దానిమీద ఫిరంగిగుళ్ళవర్షం కురిపించారు. అబ్రహామ్‌లింకన్ తరవాత జరిగిన పోరాటంలో ఎందుకు పనికిరానిదై పోతుంది. ప్రొఫెసర్ అరోనా, కాన్సిల్ నెడ్‌లాండులతో కలిసి ఒక జలాంతర్గామిలో ప్రవేశిస్తాడు. కొంతసేపటికి ఓడనావికులు వారికి సుష్టుగా భోజనం పెడతారు. కెప్టెన్‌నీమో ఇక ఆ ఓడలోనించి ఎవరు బైటపడలేరని చెప్పి ప్రొఫెసరు అరోనాకు జలాంతర్గామి యంత్రాల రహస్యాలు తెలియజేస్తాడు. కెప్టన్ నీమో జలాంతర్గామి నడిపించేపద్ధతి అంతా ప్రొఫెసర్ అరోనాకు తెలియజేస్తాడు. పిమ్మట జలాంతర్గామి కిరువైపులా తెరుచుకున్న అద్దాలలోనించి అద్భుతమైన సాగరగర్భ జలచరాలు కనిపిస్తాయి. ఆ తరవాత జలాంతర్గామి సాగరగర్భంలోని క్రెస్పో ద్వీపానికి బయలుదేరుతుంది. జలాంతర్గామి వానికోరో ద్వీపంమీదుగా వెళ్ళి గిల్బోవాద్వీపానికి సమీపంలో నిలబడుతుంది. అరోనా అనుచరులతో కలిసి ఆ ద్వీపంలో ప్రవేశిస్తాడు. ముగ్గురు గిల్బోవా ద్వీపంలో వేటముగించుకొనివస్తూండగా హఠాత్తుగా ఒకరాయి వారిదగర పడుతుంది. పిమ్మట కెప్టెన్ నీమో వజ్రాయుధంతో ఆటవికుల నందరినీ పడగొట్టివేస్తాడు. క్రమంగా జలాంతర్గామి పగడాలదీవి జేరుకుంటుంది. చనిపోయిన నావికుని కొకనికి అక్కడ సమాధి ఏర్పాటుచేస్తారు. కెప్టెన్ నీమో మన్నారు సింధుశాఖలో ఒక పెద్దముత్యం సంపాదిస్తాడు. పిమ్మట ఎంతో చాకచక్యంతో ఒక బెస్తవాని ప్రాణాలు సంరక్షిస్తాడు. పిమ్మట జలాంతర్గామి మధ్యధరాసముద్రందాటి అట్లాంటిక్ మహాసముద్రంలో ప్రవేశిసుంది తరవాత జలాంతర్గామి నావికులు విగో అఖాతంలో మునిగి వెండిబంగారాలపోగులుసేకరిస్తారు. కెప్టెన్‌నీమో ప్రొఫెసర్ అరోనాకుఅట్లాంటిస్ ఖండం చూపిస్తాడు. జలాంతర్గామి సముద్రం అట్టడుగున ఉన్న బొగ్గుగనులలోనించి బొగ్గు నింపుకుంటుంది. క్రమంగా దుర్భేద్యమైన మంచుకొండ అడుగునించి ప్రయాణంచేసి దక్షిణధ్రువం సమీపిస్తుంది తరవాత కెప్టెన్ నీమో దక్షిణధ్రువం కనిపెట్టి అక్కడ తన జండా ఎగరవేస్తాడు. జలాంతర్గామి దక్షిణధ్రువం దగ్గిరినించి మళ్ళీ తిరుగుప్రయాణం సాగిస్తుంది. అష్టపాద జంతువులతో చేసిన పోరాటంలో జలాంతర్గామి నావికు డొకడు మరణిస్తాడు. తరవాత జలాంతర్గామి గల్ఫ్‌స్ట్రీమ్‌లో ప్రయాణం సాగిస్తుంది. పిమ్మట జలాంతర్గామి నావికులు శత్రునౌక ముంచివేస్తారు.

# ★ సాగరగర్భంలో సాహసయాత్ర ★

మగతనిద్రలో పడ్డాను. అంతలో నెడ్‌లాండ్ నా దగ్గిరికివచ్చి, నన్ను లేపి నా చెవిలో నెమ్మదిగా ఊదాడు:

"మనం అంతా పారిపోతున్నాము!"

నేను లేచికూర్చుని అడిగాను:

"ఎప్పుడు?"

"ఈ వేళ రాత్రే జలాంతర్గామిలో ఉన్న జనం అంతా బద్ధకంగా పడుకున్నట్లున్నారు. ఇంతకంటె మంచిసమయం దొరకదు."

"అయితే మనమిప్పుడెక్కడున్నాము?"

"నాకొక 20 మైళ్ళ దూరంలో భూమి కొంచెం చూచాయగా కనిపిస్తూంది."

"మనం సముద్రానికి బలి అయిపోయినా సరే! తప్పకుండా ఈవేళ రాత్రి పారిపోదాము."

"గాలి బాగా జోరుగా విసురుతూంది గాని మనం ఆ చిన్న బోటులో పడితే అంతగా భయపడవలసిందేమీ లేదు."

"నేను తప్పకుండా నీతో వస్తాను" అన్నాను.

"పారిపోతూంటే పట్టుబడిపోవడమే జరిగితే, శక్తికొద్దీ దెబ్బలాడతాను. ప్రాణలకైనా తెగిస్తాను."

"మనం అందరము ప్రాణాలున్నంత వరకు పోరాడదాము." అన్నాను

తరవాత నేను టాపుమీదికి వెళ్ళాను. సముద్రం అంతా చాలా అల్లకల్లోలంగా ఉంది.

ఆవేళ సాయంత్రం ఆరు గంటలకు నెడ్‌లాండ్ మళ్లీ నా దగ్గిరికి వచ్చి నన్ను హెచ్చరించాడు:

"వెళ్ళిపోయేలోగా మళ్లీ మనం ఒకరొనొకరిని చూసుకోవడం జరగదు. ఈసంగతి మళ్ళీ మీకింకొకసారి జ్ఞాపకం చేస్తున్నాను. నెమ్మదిగా ఆ చిన్నబోటు దగ్గిరికి రండి! మేమిద్దరం మీకోసం ఎదురు చూస్తుంటాము." పిమ్మట తొందరగా అక్కడినించి వెళ్ళిపోయాడు.

నే నాఖరిసారిగా ఆ జలాంతర్గామిలో ఉన్న విచిత్రవస్తువులకేసి చూశాను. నా వస్తువులన్నీ ఒక చిన్నసంచీలో జాగ్రత్త చేశాను. నాగుండె గబగబా కొట్టుకుంది. సముద్రంలో ఈదడానికి తగిన దుస్తులన్నీ వేసుకున్నాను.

ఆ సమయంలో కెప్టెన్ నీమో ఏమిచేస్తున్నాడో తెలియ లేదు. నాకా క్షణంలో జలాంతర్గామిలో ఉండగా జరిగిన సంఘటనలన్నీ ఒకటొకటిగా జ్ఞాపకం వచ్చాయి.

అదే సమయంలో కెప్టెన్ నీమో గదిలో పియానోసంగీతం వినిపించింది. అప్పుడే పది కావచ్చింది. ఇక జలాంతర్గామి విడిచి-వెళ్ళే సమయం ఆసన్నమయింది. నేను మెల్లిగా తలుపు తెరుద్దామని అనుకొన్నాను.

కెప్టెన్ నీమో ఆ గదిలోనే ఉన్నాడు. అంతలో అతడొక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టాడు. అది విని నేనక్కడే ఆగిపోయాను. అతడు నిలబడిఉన్నాడని ఊహించాను.

ఆ ఉత్తరక్షణంలో కెప్టెన్ నీమో దండ కట్టుకుని నా వైపు నడిచి వచ్చాడు.

అతనిహృదయం శోకావేశంతో కొట్టుకుంటూంది. అతడస్పష్టంగా ఏదో గొణుగుకుంటున్నాడు:

"భగవంతుడా! ఇంకిది చాలు!" అన్న మాటలు నాకు స్పష్టంగా వినిపించాయి.

ఏదో బ్రహ్మాండమైన పశ్చాత్తాపోద్వేగం అతన్ని కాలిచివేసి ఉండవచ్చును. కనకనే అతడా విధంగా బాధపడుతూ ఉండవచ్చునని అనుకొన్నాను. ఇక నేనతని గది తలుపు తెరవదలుచుకోలేదు. మాట్లాడకుండా నా దారిని నేను వెళ్ళిపోయాను.

అయిదారు నిమిషాలలో ఆచిన్న నావ దగ్గిరికి వెళ్ళిపోయాను. నెడ్ లాండ్, కొన్సెలు ఆ నావలో కూర్చున్నారు. పారిపోవడానికి సిద్ధంగా ఉన్నారు.

నేనానావలో కూర్చుంటూ "బయలు దేరండి!" అన్నాను.

నెడ్ లాండ్ నెమ్మదిగా ఆ చిన్న నావకు, జలాంతర్గామికీ మధ్య బిగించిన మరమేకులన్నీ ఒకటొకటిగా వదులు చెయ్యడం మొదలుపెట్టాడు.

అంతలో జలాంతర్గామిలో ఒక పెద్ద గందరగోళం బయలుదేరింది. నెడ్ లాండ్ నా చేతికొక చిన్న బాకు అందించాడు. నేనది చేత్తో పట్టుకుని సిద్ధంగా నిలబడ్డాను.

కాని జలాంతర్గామి నావికులంతా ఒకేగొంతుతో గట్టిగా అరుస్తున్నారు. వాళ్ళందరు అలాగ ఎందుకరుస్తున్నారో నాకేమీ బోధపడలేదు. అందరు ఒకే కంఠంతో ఒకే మాట ఉచ్చరిస్తున్నారు! వాళ్ళందరు పెట్టే కేకలు మా పారిపోవడాన్ని గురించి కానేకాదని తేలిపోయింది. అయినా వాళ్ళంతా అలాగెందుకు కేకలు పెడుతున్నారో! నేను వాళ్ళు పెట్టే కేక జాగ్రత్తగా ఆలకించాను.

వాళ్ళంతా 'సుడిగుండం!' 'సుడిగుండం!' అని ఒకే గొంతుకతో అరుస్తున్నారు. నేనది విని నిర్ఘాంతపోయాను! ఏదో సుడిగుండంలో పడినంతమాత్రాన అంత భయంకరంగా కేకలు పెట్టాలా? బహుశః మేము నార్వేతీరంలో సుప్రసిద్ధమయిన పెద్ద సుడిగుండంలో పడిపోయామేమో!

నార్వేతీరంలో లాఫోజెన్, ఫారో ద్వీపాల మధ్యన ఒక పెద్ద సుడిగుండం ఉంది. ఆ ప్రాంతానికి 'సాగరనాభి ప్రదేశ' మనే పేరు సుప్రసిద్ధం! అది మాఅందరికీ బాగా తెలుసును.

పదిమైళ్ళ ప్రదేశంలో ఉన్న ఓడలూ, జలజంతువులు ఆ సుడిగుండంలో పడి గిరగిరా తిరిగి చిట్టచివరికి దానిలో మునిగిపోతూంటాయి.

తెలిసో తెలియకో కెప్టెన్ నీమో జలాంతర్గామి నా బ్రహ్మాండమైన సుడిగుండంలోకి పట్టించి ఉంటాడు. అందుచేతనే మా జలాంతర్గామి శరవేగంతో ఆ సుడిగుండంలోకి వెళ్ళిపోతూంది. జలాంతర్గామి ఆ సుడిగుండానికి సమీపానికి వెళ్ళిన కొద్దీ పారిపోవాలని మేము చేసిన ప్రయత్నాలన్నీ మంటగలిసిపోయాయని తేలిపోయింది. ఇక ఆ సమయంలో చిన్న నావలోకి దూకడమంటే మృత్యుముఖంలోకి దూకడమన్న మాటే! అందుచేత మేమల్లాగే నిలబడిపోయాము. జలాంతర్గామి ఇక చేసేదేమీలేక శరవేగంతో ఆ సుడిగుండంవైపు వెళ్ళిపోయింది. —ఇంకా ఉంది.

# బడిపంతులు గోడు!

నేనే! నేనే! సుబ్బారాయుడు పంతుల్ని నేనే! ... రండి... కూర్చోండి... గుంటూరు నుంచి వస్తున్నారా!... ఎక్కడి గుంటూరూ ఎక్కడికథా!... నేను హాయ్యరు చదవటం కోసం వెళ్ళినపుడు – 1915 లో – ఇంత పట్టణం లేదు. ఆ వల్ల చెరువు, ఆ ఎల్లచెరువు, ఆ పిచ్చికల గుంటా తప్ప!... పెరిగిపోయింది.... పట్టణం పెరిగిపోయింది... ఇప్పటికీ వున్నదా పిచ్చికల గుంట?.. ఉన్నది!... ఉండకెక్కడికి పోతుందీ?...ఉంటే వుంటుంది.

(పిల్లలవైపు తిరిగి) ఒరేయ్ బడుద్ధాయిలూ! గొడవ చెయ్యకండి... కాస పెద్దమనిషితో మాటాడుతున్నానూ... నోరెత్తారంటే వీపు చీరేస్తాను సుమా!...సైలెన్స్.

ఆఁ... నేను ఇప్పటి వాణ్ణా!....బందరు గాలివానకు పారాడుతుండే వాణ్ణిట!... ఇన్నాళ్లు సర్వీసు 40 ఏళ్ళనుంచి...తల నెరిసింది ...చత్వారం వచ్చి పాతికేళ్లు! .నాదగ్గర ఓనమాలు దిద్దుకున్న వాళ్ళు ఇపుడు నౌకరీల్లో వున్నారు... గుంటూరు రైలుగేటు దగ్గర వుంటాడే, బ్రహ్మీపాల కానిస్టేబులు – వాడు నాదగిర చదివినవాడే!.. అరండల్ పేటలో పూటకూళ్ళు పెడుతున్న ఓబయ్యకు నేను అక్షరాభ్యాసం చేశాను!... మా ఫిర్కా నుంచి రిజర్వుసీటుకు ఎం ఎల్.ఏ గా ఎన్నుకోబడ్డ జకరయ్యా నాదగ్గర గుణింతం నేర్చుకున్నాడు! ... అందరిలోనూ గురుభక్తి ఇంకా వున్నది వాడొక్కడికే... మొన్న కర్నూలు పోబోయే ముందు ఒక బుట్టెడు గోరుచిక్కుడు కాయలూ ఒక బూడిద గుమ్మడికాయా తెచ్చి ఇచ్చాడు!......వాడికేం...వాడి చేతుల్లో మహారాజ యోగం వున్నది...... వాడు రేపు హైదరాబాదు పోతాట్టగా!...

రామ! రామ! ఈ పిలకాయలకు చదువు చెప్పటం కాదుగాని నా ఉసురు నాకు తగుల్తున్నది...తలప్రాణం తోకకొస్తున్నది...పగవాడికైనా వద్దు బాబూ ఈ చెర! ఇంతకంటె ముష్టి చెంబు చేత పుచ్చుకొని నాలుగు వీధులు తిరిగి రావటం మంచిది...ఒక గంగిరెద్దును వెంట తోలుకొని నాలుగూళ్లు తిరగటం మంచిది...తట నెత్తి పెట్టుకొని మట్టి మొయ్యడం మంచిది......

(పిల్లలవైపు తిరిగి) ఒరేయ్! సోమలింగం! చమ్డాలు వలుస్తాను వెధవా!... కామాక్షి తల్లో పువ్వు లాగేస్తావేం!... గాడిదా!...

ఊఁ. వట్టి వానరమూకండీ!...కాళ్లూ చేతులు వూరుకోవు...ఒకటే కాకిగోల!... చెవులు దిబ్బెడపడిపోతున్నయ్......వాణ్ణి వీడు గిల్లా, వీణ్ణి వాడు గిల్లా... ఈ చింత పరికె చేతులో వున్నది కాబట్టి ఈమాత్రం కూచున్నారు......ఏ చెట్టుకొమ్మదో గాని మాంచి బిగువుగా వున్నది.. ఇది కొత్తగా తెచ్చిన రోజున — కొత్తకలం బాగా రాస్తుందో లేదో చూచినట్టు — బెత్తం పటుత్వం పరీక్ష చేద్దామని వరసబెట్టి అందర్నీ బాదుకుంటూ వచ్చాను... మొన్నాటి నుంచీ కాస్త దోవలోకి వచ్చారు......పోట్ల ఎద్దుల్ని నడిపించినట్టే పిళ్లను నడిపించాలి...

## మన్నవ గిరిధరరావు

(పిల్లలవైపు తిరిగి) ఒరేయ్ మాధవరావ్! ఒంటిగంట కొట్టు!...(గంట మోగుతుంది.)... పోతున్నారు వెధవలు తప్పిగంతులేసుకుంటూ!...అయ్...ఈ మొత్తదగ్గర ఎవరూ ధారకొర్రకూడదూ... దూరంగా పొండీ..

అమ్మయ్య!...ఒక రెండు నిముషాల పాటు తెరిపిచిక్కింది ... (చెవులమీద చేతులు పెట్టుకొని)... ఏం చెప్పమంటారు బడిపంతులు గోడు!...అయినా మా గోడు వినేదెవరు?...మీది కాలేజా!...మీకేం అదృష్టవంతులు!

నాకంటె ఆ ద్రౌపది నయం. ఆమెకు ఐదుగురు మాత్రమే వున్నారు. నాకు తలలో జుట్టంతమంది వున్నారు!

మొదటివాడు స్కూళ్ల ఇన్‌స్పెక్టరు ... మూడునెలల కొకసారి వేం చేస్తుంటాడు. అతని వెంట – అఃగూసెడుగాని – బ్రోకర్ లాంటి జమానొకడు వస్తాడు. పలహారాలతో సహా జమానుకూడ నివేదన చెయ్యాలి... అన్నంలోకి ఏ ఏ కూరలు చేయాలో, ఏ ఏ పిండివంటలు చెయ్యాలో, ఏమి టిఫిన్ పెట్టాలో ఆ జమాను బయటికి పిల్చి మాకు చెపుతాడు! ... తుదకు 5 రూపాయలు చొప్పున మేం వాళ్ళకు సమర్పించుకోవాలి ... జమాను వెళ్లి కన్నుగీటితే ఇన్స్పెక్టరు 'గుడ్' అని రాసిపోతాడు. మేమిచ్చిన కాఫీలో పంచదార తగినా సరే మా నోట చారెడు బూడిద పోసి పోతాడు!

ద్వితీయుడు అద్వితీయుడైన మా మేనేజరు. ఆయన సొంత బడి ఇది. ఉదయమూ సాయంకాలమూ బడిని పర్యవేక్షించి పోతాడు. వచ్చినపుడల్లా బడితోటలోకి వెళ్ళి ఎన్ని కాకరకాయలు కాసిందీ, ఎన్ని వంకాయలు కాసిందీ లెఖ్ఖ చూచుకొని పోతాడు నిన్న కనుపించిన బెండకాయ ఇవ్వాళ కనపడకపోతే మామీద ధాంధూం అని లేస్తుంటాడు...నెలకు నాకు వచ్చే రాళ్ళు 26 రూపాయలు. అందులో మూడు రూపాయలు మేనేజరుగారు మినహాయించుకొని మిగతాది చేతులో పెడతాడు! సంతకం మాత్రం అక్షరాలా ఇరవై ఆరు రూపాయలు పుచ్చుకున్నట్టు వ్రాయించుకుంటాడు.. ఎన్నడైనా ఒక్క చాక్‌పీసు ఇప్పించమని కబురుచేసే "చాలుచాలే... చెప్పే సరుకంతా కొల్లబోవటం లేదులే" అని కస్సుబుస్సులాడుతాడు!

(పిల్లలు చీమల మాదిరిగా నాలుగువైపుల నుంచీ వచ్చి కూచుంటారు.) (పిల్లలవైపు తిరిగి) సైలెన్స్...అరేయ్...మాధవరావ్? ...ఎక్కాలు చెప్పించరా...కాదు కాదు ...కూచో.. అందరూ రేపటి పాఠం చూచి రాత రాయండీ.. బాగా రాయాలి...అక్షరాలు ముత్యాలల్లే వుండాలి...ఊఁ... రాయండి.

ఇకపోతే మా మూడవనాధుడు హెడ్ మాస్టరు. మా బడిలోనేనో, లేక అన్నిచోటా ఇంతేనో గాని తలబిరుసు గలవాడు హెడ్‌మాస్టరుగా వుంటాడు... రెండో టీచరు నోరుపడిపోయేటట్లు పాఠాలు చెప్పాలనీ తాను అతని మీద స్వారీ చేయాలనీ అనుకుంటాడు...ఆయన చస్తే పాఠాలు చెప్పడు. సంతకం పారేసి నాదగ్గరకు వచ్చి

"పిల్లకాయలచేత తోటకునీళ్లు పోయించండీ నేను అటు గేదెకు మేతవేసి వస్తాను" అని వెళుతాడు. ఇహ మళ్లీ రాడు...మేనేజరు గారింటికి వెళ్లి ఆయన కొడుక్కి ప్రైవేటు చెపుతూ కూచుంటాడు ... ఆ కుఱ్ఱవెధవను థర్డుఫారంలో చేరుస్తాడుట! సరేనని ఈ అరవైమంది వానరుల్నీ నేను మళ్లిస్తూ కూచుంటాను.

(పిల్లల వైపు తిరిగి) అరేయ్! పోలాయ్! పేగులు తోడుతాను వెధవా!...ఆ అమ్మాయ్ జడపుచ్చుకుని లాగుతావ్?...కూచో... అరేయ్ ..గొడ్లకాడికెళ్లే వాళ్లెవరు? స్టాండప్ ...సిట్...స్టాండ్...ఊ...లైను తప్పకుండా వెళ్లండి...

ఊ: ఇహ నా నాలుగవ "ప్రాణేశ్వరుడు" నేను తాడుకట్టిన నాంచారమ్మ ఇసుకలోనుంచి తైలాన్ని తీసవచ్చునేమోగాని ఆమె పెదిమమీద నవ్వును తెప్పించలేం. ఆమెను పెండ్లాడటం నా అదృష్టమనీ, నన్ను పెళ్లాడటం ఆమె దురదృష్టమనీ నాంచారమ్మ కనిపెట్టిన సిద్ధాంతం. మేనేజరిచ్చిన 28 రూపాయలూ తీసుకెళ్ళి నేరుగా ఆమెకు సమర్పించుకుంటాను. ముక్కుపొడుం కొనుక్కోటానికి ఒక్క అణా ఇవ్వమంటే గంటె కాలుస్తాను జాగ్రత్త అంటుంది. ఒక్క పలుకుపెట్టవే తిండి తిన్నానంటే నాలుగు కందిగింజలు చేతిలో విదుల్చుతుంది. బడిపంతులుకు భార్యగా ఉండటంకంటె, తినటానికున్న విధవముండ మేలని కొత్తసామెత ప్రవచించింది. ఉన్న దుంపగా కుచేలుడి సంతతిమాదిరిగా నలుగురు ఆడపిల్లలు పుట్టారు. వాళ్ల తలలకు రాయడానికి కొబ్బరినూనె లేదంటే నమ్మండి!

జన్మకొక శివరాత్రి అన్నట్లు మా మొహాలు కాస్త తేటగావుండేది దసరాపండక్కి. లేని నవ్వు తెచ్చుకొని, చొక్కా చినుగులు ఉత్తరీయంకింద దాచిపెట్టి, టైరు చెప్పులు వేసుకొని, పిల్లల్ని అదిలించుకుంటూ వస్తుంటాం...పప్పుబెల్లాలు పిల్లలకోసం అని మీరనుకుంటారు...మేమూ వాటికోసమే మొహాము వాచిపోతున్నాం...నామటుకు నేను పసిపిల్లవాడిలాగా ఇంటింటికీ వెళ్ళినప్పుడు దోసెడు దోసెడు పప్పుబెల్లాలు తింటుంటాను. ఏడాదినుంచివున్న ఆకలిని ఆ పదిరోజుల్లో కాస్త శాంతపరుస్తాను...ఆ పప్పుబెల్లాలను ఇంటికిగూడ మూటకట్టుకొని తీసుకురాలేదని నాంచారమ్మ మూతి ముడుచుకొని కూచుంటుంది. ఆ పదిరోజులూ చేతిలోకి నెయ్యి వెయ్యనుపొమ్మని శిక్షవిధించింది!...మా హెడ్‌మాసరుగారు మాత్రం ఈపదిరోజులూ అంతా తిన బుజాన వేసుకొని మోస్తానంటాడు. ప్రతిపిల్లవాడికీ తాను స్వయంగా పాఠంచెపుతున్నట్లు స్టంట్లు వేస్తాడు!...పిల్లకాయల ఇళ్ళకుపోయినపుడు వాళ్లిచ్చే కానుకలన్నీ కోటుజేబులో వేసుకొని వస్తాడు. అందులో తను సొగము తీసుకొని కటాక్షవీక్షణాలు పారేస్తూ నాకు సగం పైకం ఇస్తాడు...దున్నే రోజులో దేశంమీదికిపోయి కోతలరోజుల్లో కొడవలిపట్టుకొని రావడమంటే ఇదేగా!

(పిల్లలవైపుతిరిగి) అరేయ్...ఎక్కడా...సోమలింగం...పెద్దగంట కొట్రా...టైమయ్యేవుంటుంది... ఇంకా ఇంతసేపా...టైము కావస్తుంటుంది... కొట్టుకొట్టూ...(గంట గణగణ వినబడుతుంది.) ఆఁ...అబ్బాయిలూ అమ్మాయిలూ స్టాండ్...ఇవ్వాళ్ళ శనివారం...సాయంత్రం బడిలేదు...రేపు ఆదివారం సెలవ...ఎల్లుండి పొద్దున్నే రండి.. పొండి...లైను తప్పించండంటే వీపుమోగుతుంది జాగ్రత్త.. (పిల్లలంతా వెళ్లిపోతారు)

ఆఁ...బతకలేక బడిపంతులంటారు... కాదుకాదు. చావలేక బడిపంతులని అనాలి...ఎండెక్కుతున్నది...లోపల ఆత్మారాముడు గోలపెడుతున్నాడు... ఇప్పటికింకా మా నాంచారమ్మ పొయిమీద ఎసరు ఎక్కించివుండదు...రామ రామ! కృష్ణకృష్ణ!...ఇపుడే ఇంటికివెళితే నలుగురుపిల్లలూ కొనాలివ్వమని వేధిస్తారు... కాస్త అటు రామమందిరందాక వెళ్లివస్తాను. అక్కడ గాలికి తిరిగేవాళ్లంతా చేరి చతుర్ముఖ పారాయణం చేస్తూవుంటారు.... నాదగ్గర పిక్కల్లేవుగా! నన్ను ఆట నివ్వరు...ఊరికే పక్కనవుండి చూసి సంతోషిస్తుంటాను...వెళ్ళివస్తాను...అప్పుడప్పుడు వస్తూవుండండి! ★



## ఆశావాది

రాజుగారి గుర్రాలశాలలో పనిచేసేవాడొకడు ఖూనీ చేసి రాజుగారిచే విచారణలో ఉరిశిక్ష విధించబడ్డాడు. తీర్పయిన తర్వాత "మహాప్రభూ! నా దొక మనవి చిత్తగించండి. నాకు గుఱ్ఱాన్ని ఆకాశమార్గాన ఎగిరించడం చాతనవును. ఒక్క సంవత్సరము గడువిస్తే మీ పంచకళ్యాణి ఆకాశాన పయనించేటట్లు చేస్తాను. అలా చేయలేకపోతే నా శిరస్సును ఏలిన వారి కొప్పగించుకొంటాను," అని వేడుకొన్నాడు. రాజు కూడా "సరే చూద్దాం. అలాగే కానిమ్మ"న్నాడు. మర్నాటి నుంచి గుర్రానికి శిక్షణ ప్రారంభమయింది. అశ్వశిక్షకుడు తర్ఫీదిస్తుండగా అతని స్నేహితుడొకడువచ్చి "ఒరే, నిజంగా నీవు ఆ గుర్రాన్ని ఎగిరించగలవా?" అని అడిగాడు. వాడు "నా మొఖం! గుఱ్ఱమెలా ఎగురుతుంది? ఈ మిషతో ఒక సంవత్సరం నా ఉరిశిక్ష వాయిదాపడింది. ఈ సంవత్సరం లోపల ఎన్నైనా జరగవచ్చు. ఈ రాజు మరణించవచ్చు. లేదా నేను చనిపోవచ్చు. లేదా యీ గుర్రం చనిపోవచ్చు. ఈ మూడూ కాకపోతే ఈలోపల గుర్రమే ఎగరడం నేర్చుకోవచ్చు!" అన్నాడు నవ్వుతూ.

—ఎ. పి. రంగారావు.



# వనితా లోకం



కొన్ని కొన్ని సమయాల్లో మనం భావన్ననుకున్న వాటివల్ల కఠిన పరిస్థితుల్ని ఎదుర్కోవలసి వస్తూ వుంటుంది. ఈ మధ్య కొందరు నల్లపూసలు వేసుకోవటం తిరిగీ ప్రారంభించారు. కొన్నాళ్లు నల్లపూసలు (పెళ్ళైనవాళ్ళైనాసరే) వేసుకోకపోవటం భావను. వేసుకుంటే మోటు అని అనుకున్నవాళ్లు కూడా చాలామంది ఉన్నారు. కాని యిప్పుడు శ్రీమతులేకాక "కుమారి"లు కూడా నల్లపూసలు, కుంకం బొట్లతో ప్రత్యక్షం అవుతున్నారు. (మా నాయనమ్మ కాలంలో కన్నె పిల్లలు అగులు బొట్టు పెట్టుకు నేవారుట.)

కొన్నాళ్లు బంగారురంగు పూసలు, కొన్నాళ్లు గాజుపూసలు, మరి కొన్నాళ్లు మైనంపూసలు, ప్రస్తుతం నల్లపూసలు (ఈ మధ్యలో కొన్నాళ్లు బోసిమెడలు) ఇల్లా ఒకదాని తర్వాత ఒకటిగా గబగబా భావన్లు మారిపోతున్నాయి.

పూర్వం, అంటే మన అమ్మమ్మల చిన్నప్పుడు చిన్న చిన్న రంగు రంగు పూసలు రవికెలకీ, గౌన్లకీ, (అంటే ఆ కాలపు జంపరుగౌన్లు) కుట్టుకునే వారుట. ఆ కాలంలో అవి "చీమలు చేసిన పూసలు" అనే పేరుతో చెలామణీ అయేవి. చాలా చవకగా ఉండేవిట కూడా. వాటినే యిప్పుడు నవీన యువతీమణులు భావను అనే పేరుతో ధరించడం మొదలు పెట్టడంతో ధర పెరిగి ఆఖరికి ఆ కాలంలో అర్ధనాకీ మూడు వచ్చే గుత్తులు అర్ధరూపాయికి ఒకటయాయి.

ఇల్లా పూసలలో అనేకరకాలు ఉన్నప్పటికీ సమయానుకూలంగా ఒక్కొక్క రంగు భావనుగా పట్టణాలలో గుర్తించబడుతోంది.

ఇంతకీ చెప్పవచ్చే దేమిటంటే పూర్వం పది సంవత్సరాలు వచ్చీరాని ఆడపిల్లలే నల్లపూసలు వేసుకుంటే, మనం మాత్రం ఏం తీసిపోయామని యిప్పటి నవీన యువతులు కూడా నల్లపూసలు వేసుకోవటం మొదలు పెట్టారు అంటే ఒక్కటి తేడాలెండి, ఏమిటంటే ఆ కాలంలో పెళ్ళయిన తరువాత వేసుకునేవారు యిప్పుడు ముందుగా నే వేసుకుంటున్నారు. ఇటువంటిపన్లు చెయ్యటంవల్లనే నలుగురిలో నవ్వులపాలు కావటంకూడా.

ఈవిడెవరో ముసలమ్మ కాబోలు, అందుకనే ఈకాలపు భావన్లగురించి ఈలాగ రాస్తోంది అనుకుంటారేమో. అదేం కాదు. నేనుకూడా ఈకాలపుస్త్రీనే. అందుకే నాకు ఈపూసల భావన విషయంలో ఒకసారి "బుద్ధివచ్చింది మహాప్రభో! యింకెప్పుడూ "అతిభావన్ల"కు పోకూడదు" అనుకునేదాకా వచ్చింది.

మొన్నీ మధ్య మా మేనత్త మనవరాలి పెళ్ళికి, మేమంతా "ఇందుపల్లి" అగ్రహారం వెళ్లాం. అది అసలే శుద్ధపల్లెటూరు. వెళ్ళేటప్పుడు అక్కయ్య చెప్పనే చెప్పింది "నీ కాలేజీభావన్లు అక్కడ చూపించకే" అని. నేనుకూడా పెద్దలమాట ఎందుకు వినకపోవాలని సాదాగానే వెళ్ళాను. కాని నేను చేసినపొరబాటు అక్కడికి వెళ్ళేదాకా గుర్తురాలేదు. అదేమిటంటే వెళ్లేటప్పుడు మెళ్లో ఉన్న నల్లపూసలదండ తియ్యడం మర్చిపోయాను. ఇక అక్కడికి వెళ్లాక, అందరికళ్లలో నూపడ్డాక తీయడం ఎల్లా? అందుకని ఏమైతేఅయిందని ఊరుకున్నా.

ఇంతలోకే మా అత్తయ్య పిన్నత్తగారుట, ఒకముసలావిడవచ్చి, పట్నంనుంచి వచ్చిన వారు వీరేనాఅంటూ (నాఖర్మంకాలి) నా ప్రక్కనే చతికిలపడింది. యింకేం ఆవిడ కంటబడింది నా నల్లపూసలదండ! ఆవిడ కాస్సేపు నన్ను ఎగాదిగా చూసి సంతృప్తిగా చిరునవ్వు నవ్వుకుని, "ఏ వూరిచ్చారమ్మాయీ" అంది నేను ఇదేమిటా? అని తెల్లబోయి చూస్తున్నాను. అక్కయ్య నోరుమూసుకుని తెగనవ్వుతోంది, నేను ముందే చెప్పలేదా? అన్నట్లు నావంక చూస్తూ. నాకు అప్పటికి పరిస్థితి అర్థమైంది. నేను కొంచెంతమాయించుకునే లోపల ఆవిడ మళ్ళీ అక్కయ్యతో పాపం అది సిగ్గుపడుతోంది కాబోలు నువ్వు చెప్పమ్మాయీ అంది; తెలుసుకోకపోతే కొంపమునిగిపోయినట్లు. చటుక్కున నేను కాస్త తెలివి ఉపయోగించి, మా ఊరేనండీ అన్నా. అంతతో ఊరుకుంటే ఆవిడ గొప్పేం ఉంది. మీ ఆయనకి ఏంపనమ్మా? అంది. నేను కోపం, అవమానం రెండూకలిసి దహించివేస్తూండగా "ఇంకా ఏంలేదండీ" అని అక్కడనుంచి లేచివచ్చేశా. అక్కయ్య మాత్రం నా తెలివికి ఆశ్చర్యపోతూయింకా అక్కడే కూర్చుని ఉంది. తరువాత ఆవిడ తనమనవరాలితో అంటోంటే వినిపించింది. పట్నంలో చదివేపిల్ల కూడా మాగు లక్షణంగా నల్లపూసలు వేసుకుంది అని. పాపం ఆపిల్లకింకా కొత్తభావన్లు వాటి సమాచారం తెలియదు కాబోలు.

ఇల్లా ఒక్కొక్కప్పుడు మన చిన్నతనపు సరదాలే సమయాన్ననుసరించి మెలగకపోవటం మూలంగా ఇతర్లకి అనుమానాల్ని, మనకు అభిమానాన్ని కలగచేస్తాయి. పట్టణాల్లో అయితే మనసంగతి ఎవరూపట్టించుకోరుగాని పల్లెల్లో అల్లా కాదుగా! ★

ఎం. సుధ



ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవాలకు విద్యుద్దీపాలతో ప్రకాశించే హైదరాబాదు పబ్లిక్ గార్డెన్స్‌లోని అజంతా మందిరం

స్త్రీలలో సంతానభ్రష్టం కాని వారు అరుదు. దీనిలో బిడ్డలు పుట్టిన తరువాత నష్టమయిపోవటం ఒకరకమూ, నెలలు నిండక పూర్వమే అకాలప్రసవంవల్ల నష్టం కావటము మరొకరకమూను ఈ రెండవ రకాన్ని గర్భస్రావం, లేక, గర్భవిచ్ఛిత్తి అంటారు. గర్భస్రావాలలో రెండురకాలు. లేతనెలలో పిండాకారం సరిగా ఏర్పడక మును పే జరిగేది ఒకరకం; పిండాకారము స్పష్టంగా ఏర్పడిన తరువాత జరిగే అకాల ప్రసవం రెండవది.

పది కాన్పులకంటే ఒక గర్భస్రావం స్త్రీల ఆరోగ్యాన్ని ఎక్కువగా చెడగొట్టుతుందని వైద్యులూ, అనుభవజ్ఞులూ అంటారు. గర్భస్రావం జరిగిన తరువాత. రక్తం పరిశుభ్రపడి, దేహారోగ్యం యథాస్థితికి వచ్చిన తరువాత తిరిగి గర్భం ధరించినట్లయితే, తల్లి ఆరోగ్యం మంచిస్థితిలో ఉండటమే కాకుండా, పుట్టినబిడ్డ ఆరోగ్యవంతంగా పెరగటానికి అవకాశం ఉంటుంది. తల్లి రక్తం పరిశుభ్రముగా లేని యెడల, పుట్టినబిడ్డ బలహీనముగా ఉండి వ్యాధుల దాడిని ఎదుర్కొనలేకపోతుంది పుట్టుకతో వచ్చిన బలహీనత బిడ్డను ఆజన్మాంతమూ అంటిపెట్టుకొనే ఉంటుంది. ఆ బిడ్డ బ్రతికినన్నాళ్లు ఈసురోమంటూ జీవితంలో ఏ ఆనందాన్నీ అనుభవించలేనిస్థితిలో ఉంటుంది.

ఒక పర్యాయం గర్భస్రావం జరిగిన తరువాత, తిరిగి ఆ ప్రమాదం రాకుండా కాపాడుకోవటం తల్లికీ, పుట్టబోయే బిడ్డకూ శ్రేయస్కరం. ఒక పర్యాయం గర్భస్రావం కాగానే, మరొక సారి ఆ విధంగా జరుగుతుందేమో నన్న సంశయంగానీ, జరిగితీరుతుందన్న గట్టి నమ్మకంగానీ ఉండటానికి ఎక్కువ ఆధారములేదు. తిరిగి ఆ విధముగా జరుగదనికూడా ఎవరూ చెప్పలేరు

ఇల్లిందల సరస్వతీదేవి

కాని గర్భస్రావం జరిగిన వెంటనే దానికి మూలకారణమేదో తెలిసికొని చికిత్స పొందటం అత్యంతావశ్యకం; తల్లిబిడ్డలకు క్షేమకరం.

సహజంగా వాటంతట అవి అయే గర్భస్రావాలు గర్భకోశం ఆరోగ్యకరమయిన స్థితిలో లేనప్పుడు గాని, స్థానం తప్పినప్పుడు గాని జరుగుతాయని వైద్యుల అభిప్రాయం. గర్భస్రావాలనుండి స్త్రీలను కాపాడగలిగిన మందులు "ఎలోపతీ" "హోమియోపతి," "యునానీ"," "ఆయుర్వేద" శాస్త్రాలలో లెక్కకుమించి ఉన్నాయి. వీటికంటె స్థానం తప్పిన కోశాలను యథాస్థితికి తీసుకొనివచ్చి, దేహానికి పటుత్వాన్నీ పుష్టినీ చేకూర్చగలిగినవి యోగాసనాలని యోగా ఇన్‌స్టిట్యూటునుండి శ్రీమతి సీతాదేవి యోగింద్రగారు సెలవిస్తున్నారు.

సూరత్ నివాసి అయిన ఒక గృహిణి ఇరవై అయిదు సంవత్సరాల వయస్సు కలది, పొడగరి, బలశాలిని. కాని, ఆమెకు బుద్ధిమతి అయినప్పుడు

# ★ గర్భిణీస్త్రీలకు యోగాసనాలు ★

కూడా నొప్పి వచ్చేది; బలహీనంగా ఉండేది. ఆమె తన 21 వ సంవత్సరాన మొదటిసారి గర్భం ధరించింది. ఆమెకు అప్పుడు వేవిళ్లు తప్ప ఏ బాధా లేదు. ఆరోగ్యం మామూలుగానే ఉన్నది. కాని ఆరవ నెలలో గర్భం పోయినది. దాని తరువాత, ఆమె చాలా నీరసించిపోయింది. రెండవసారి గర్భం ధరించినప్పుడు, ఆమె ఎలోపతి ఆయుర్వేద విధానాలలో గర్భస్రావం కాకుండా ఉండటానికి చెప్పిన చికిత్సలను పొందింది. వారు చెప్పినట్లుగా జాగ్రత పడ్డది. కాని ఫలితం శూన్యం. ఆ విధంగా తిరిగి రెండు పర్యాయములు గర్భస్రావం జరిగింది. అయిదవ పర్యాయం ఆమె గర్భం ధరించినప్పుడు, ఎటూ పాలుపోక - నైరాశ్యంతో, వైద్యుల అభిప్రాయాన్ననుసరించి, శస్త్రచికిత్స పొందితేనేగాని లాభం కలుగదేమోనన్న భావంతో, దిగులు పడిపోయింది. స్నేహితు లెవరో సూచించిన మీదట అనుకోకుండా ఆమె బొంబాయిలో ఉన్న యోగా ఇన్‌స్టిట్యూట్‌కు వెళ్ళటం తటస్థించింది. ఆమెకు అప్పుడు మూడు నెలల గర్భము. రక్తహీనత, బలహీనత తప్ప అప్పుడు ఆమె కేదీ కఠినమయిన వ్యాధి లేదు. పొత్తికడుపు మాత్రం బిగువు తప్పి ఉన్నది. అగ్నిమాంద్యమూ, మలబద్ధమూ, జాఠరీయమయిన కడుపు నొప్పి ఉండేవి. మనసులో ఆందోళన - ఏక్షణాన గర్భస్రావం జరుగుతుందోనన్న భయం ఆమెను పీడిస్తూ ఉండేవి.

ఆమెకు ఆ యోగ సాధనాలయంలో ఈ క్రింది చికిత్సా పథ్యమూ నియమింపబడినవి! ప్రతి ఉదయమూ 7 గంటలకు నిద్రలేవగానే నాలుగవున్సుల గంజిలో పాలు, తేనె కలిపి తీసుకొనేది. అప్పుడప్పుడు దీనికి మారుగా నాలుగు ఉప్పు బిస్కట్లు, గ్లూకోజు కలిపిన వేడివేడి పాలు తీసుకొనేది. ఉదయము ఏడున్నర నుండి ఎనిమిదింపావు వరకూ, గాలిలో నడవటం వంగి ఏదయినా పని చేయటం గబగబ నడవటం,



ఇటీవల హైదరాబాదులో జరిగిన ఆంధ్ర సహకార మహాసభలో మయూరనాట్యం చేసిన కుమారి నాయుడు

ఆ సమయంలో అలుపు వచ్చినట్లయితే, 5 నిమిషాల విశ్రాంతి, తరువాత తిరిగి పనిచేయటం, ఎనిమిదింబావుకు ప్రక్క మీద విశ్రాంతి తీసుకోవటం ఆమెకు వారు నియమించిన విధులు. అపడుకొన్న సమయంలోనే, ఒక ప్రత్యేకమయిన ప్రాణాయామసాధనం చేయవలసినదని విధించారు. ఆకలిగా ఉన్నట్లయితే, పండ్లరసం గాని, పండ్లు గాని తీసుకోవటానికి అనుమతించారు. తొమ్మిదిన్నరకు గోరువెచ్చని నీటితో స్నానం; 15 నిమిషాల విశ్రాంతి తరువాత అరగంటకాలం లేతఎండలో తిరుగవలెనన్నారు ఉదయం 10 గంటలనుండి తేలికయిన చేతిపనులు గాని, గ్రంథపఠనం గాని గృహకృత్యాలు గాని చేయవచ్చు. ఉదయము 11 గంటలకు భోజనం. ఆ భోజనములో చపాతీలు, ఆకుకూరలు, ఒక ఔన్సు వరిఅన్నం, పప్పు, తియ్యటి పెరుగు, లేక, గ్లాసెడు మజ్జిగ తీసుకోవచ్చునన్నారు.

భోజనానంతరం ఒక పావుగంటసేపు సంగీతసాధన గానీ, కూర్చుని ఆడుకొనే ఆటలు పచ్చీసు, చీట్లపేక వంటి వాటితో కాలక్షేపం గానీ చేయాలి ఆమె చాలాసేపు కూర్చోవటం గాని, వంట చేయకూడదని ఖండితంగా చెప్పారు. నిలువబడినప్పుడు గాని, నడచేటప్పుడు గాని, దేహం ముడుచుకోకుండా నిరారుగా ఉంచవలెనని ఆదేశించారు. మధ్యాహ్నం మూడుగంటల వేళ నాలుగు అవున్సుల పళ్లరసం, దాని తరువాత ఉపాహారం [illegible], కాయలయితే, ఆ ఫలాలు తీసుకోనవచ్చునని అధికారులు చెప్పినారు. ఆమెకు నాలుగు గంటలవరకూ బయట కాలక్షేపం. ఆపైన క్లినిక్ వద్ద మత్స్యాసనం, హలాసనం, అర్ధసర్వాంగాసనం, సర్వాంగాసనం మొదలయిన యోగాసనాలలో శిక్షణ; క్రమబద్ధమయిన ఉచ్ఛ్వాస నిశ్వాసములు, ప్రధానంగా దేహంలోని కండరావయవాలకు శక్తినీ పటుత్వాన్నీ చేకూర్చగలిగిన యోగాసనాలలో శిక్షణ ఇచ్చేవారు. యోగాసనాలకై, ప్రత్యేకంగా తయారుచేసిన బల్లమీద ఆమెను పరుండబెట్టి స్థానం తప్పిన అవయవాలు, కోశాలు యథాస్థితికి వచ్చేటట్లుగా బల్లనుకదలించి, అవయవ కదలికలను చేయించారు; వాటిలో నడుం భాగం తలభాగం కంటె ఎత్తుగా ఉండేటట్లు పొత్తికడుపులోని కోశాలకు బలాన్నీ శక్తినీ చేకూర్చగలిగిన ప్రత్యేకమయిన ఆసనాలలో క్రమంగా శిక్షణ ఇచ్చారు.

పైన చెప్పిన చికిత్సకు తోడుగా అల్ట్రావయొలెట్ కిరణాల చికిత్స, నడుంవరకు స్నానం (Hipbath), మర్దనం చేస్తూ వచ్చారు. పుష్టికరమయిన ఆహారం విటమినులు, మాల్టు, కాల్షియం మొదటి రెండు వారాలు ఇచ్చారు. సాయంకాలం అయిదు గంటల తరువాత తోటపని, సంగీతం, తేలికయిన గ్రంథపఠనం, బహిరంగప్రదేశంలో నడకకూ అనుమతించారు. సాయంకాలం ఆరుగంటలకు ఎక్కువ పులుపు గాని, తీపిగాని లేని నిమ్మపండు రసం తీసుకొని, రాత్రి ఎనిమిది గంటలవరకు గృహకృత్యాలలో తేలికయినవి చేసుకోవటానికి అనుమతి లభించింది. రాత్రి ఎనిమిది గంటలకు భోజనం, దానిలో 3 అవున్సుల "ఓట్ మీలు" గాని, చపాతీలు గాని, పచ్చికూరలు లేక, కూటు గాని, ఆ కాలంలో పండే పండ్లు, మాల్టు కలిపిన ఒక కప్పు వేడిపాలు ఉండాలని నిర్దేశించారు. ఒక పావుగంట ఇటూ అటూ తిరిగిన తరువాత సుమారు రాత్రి తొమ్మిది గంటలకు పడకకు చేరుకోవాలి.

ఈవిధంగా రెండు నెలలు యోగసాధనాలయంలో ఉన్న తరువాత, ఆ గర్భిణీస్త్రీకి కడుపులో ఉన్న పిండము సక్రమంగా ఎదగటానికి తగిన వసతి గర్భసంచిలో కలిగినది. జీర్ణకోశంలో మాంద్యము తగ్గినది మలబద్ధకం తగ్గిపోయినది. నాడీమండలం చైతన్యవంతమయినది. ఆమె ఇల్లుచేరుకొన్న కొంతకాలానికి నెలలు నిండగానే, సుఖముగా, సులభంగా ప్రసవించి ఆరోగ్యవంతమయిన బిడ్డను కన్నదని వార్తవచ్చినది. ఈవిధంగా అనేకమంది గర్భిణీస్త్రీలు, ఏ లోపంచేత అంతకుపూర్వం వారికి గర్భ

ప్రసవాలు జరిగినవో వాటికి తగిన చికిత్సను పొందుతూ ఉన్నారు. ఆ లోపాలు ఏ శస్త్ర చికిత్స లేకుండానే యోగాసనాలతో చక్కబడుతున్నాయి. ఈ విధంగా, ఆ ఇన్‌స్టిట్యూట్‌లో వేలాదిగా రోగులు ప్రతి సంవత్సరమూ చికిత్స పొందుతున్నారు.

యోగులు అన్నిరకాల విషాలనూ తిని హరించుకోగలరు. దానివల్ల వారికి ఏవిధమయిన ప్రమాదమూ కలుగదు; ఆరోగ్యభంగమయినా కాదు. యోగసాధనవల్ల వారిది వజ్రకాయమవుతుంది. ఎటువంటి వ్యాధులకయినా, క్రిములదాడికయినా తట్టుకొనగలుగుతారు.

హఠయోగులుగాని, ఆధునిక విజ్ఞానశాస్త్రవేత్తలుగాని నిర్ణయించినదేమిటంటే ఆరోగ్యవంతులయిన దృఢకాయులకు ఏ రోగక్రిములూ హానికలిగించలేవని. సుప్రసిద్ధుడైన డాక్టరు కెలాగ్ ఒకపర్యాయము కలరా క్రిములను ఆరోగ్యవంతమయిన దేహములోకి ఎక్కించి ప్రయోగము చేసి చూశాడు. ఆ దేహారోగ్యానికి తట్టుకొనలేక, ఆ క్రిములు నశించిపోయినట్లుగా తెలుసుకొన్నాడు. జలుబుగాని, ఇన్‌ఫ్లుయంజాగాని ఆరోగ్యవంతమయిన దేహాల మీద దాడిచేయలేవు. దేహాన్ని పరిశుద్ధమయిన ఆరోగ్యస్థితిలో ఉంచుకొంటే దేహంలోని అంతర్భాగాలు రోగక్రిములను ప్రతిఘటించగలుగుతాయి. ఔషధాలవల్లను, ఇంజక్షన్లవల్లను దేహంలోని అంతర్భాగాలు పరాధీనతకు అలవాటుపడి, స్వశక్తిని కోల్పోయి, బలహీనమయిపోగలవు. బర్లిన్ యూనివర్సిటీ చారిటీ క్లినిక్ వారు దీర్ఘమలబద్ధకానికి యోగసాధనమే ఉత్తమమయిన చికిత్సగా ఆమోదించారు.

బ్రిటన్‌లో ఆస్త్మా రీసర్చి కౌన్సిల్ వారు ఆస్త్మా చికిత్సకు యోగసాధనలోని ప్రాణాయామాన్ని పరిగ్రహించారు. ఫ్రెంచి వైద్యశాస్త్రవేత్తలుకూడా యోగాసనాలతో చేసే చికిత్సావిధానాన్ని, దాని విలువనూ గ్రహించారు. ఈవిధమయిన చికిత్సావిధానం బహు సున్నితమయినదీ, నాగరికమయినదీ అని విదేశాలలో కూడా గుర్తించారు. యోగాసనాలతో చేసే చికిత్స దేహంలోని అంతర్భాగాలను, కోశాలను పరిశుభ్రపరచి నవచైతన్యాన్ని కలిగించగలదు. యోగాసనాలవల్ల బాహ్యావయవాల దార్ఢ్యంకంటె అంతర్భాగాలకే ఆరోగ్యము పటుత్వము చేకూరగలదని సాధకులు తెలుపుతున్నారు. ఈ సాధనచేత అవయవాలు ఒకదానికొకటి మెలకువ కలిగించుతూ సమిష్టిగా దేహానికి పటుత్వాన్ని చేకూర్చగలవు. యోగాసనాలు ప్రధానంగా నాడీమండలాన్ని వశపరచి దేహాన్ని స్వాధీనంలో ఉంచగలవు.

భారతదేశం ఆర్థికంగా వెనుకబడిన దేశము. కోట్లకొలదిగా ఉన్న ప్రజానీకానికి ఘనవైద్యుల సలహాగాని, వెలగల ఔషధాలుగాని, అన్ని వసతులూగల వైద్యాలయంలో ప్రవేశంగాని లభించటము అసాధ్యం. మనదేశ పరిస్థితులకు అనుకూలమయిన చికిత్సావిధానం యోగాభ్యాసం.

మనదేశంలో యోగసాధనాలయాలు బహు తక్కువగా ఉన్నాయి. ఉన్నవాటికి ద్రవ్య సహాయము లభించక పోవటమే కాక, ప్రజాదరణ లేకపోవటం వల్ల నిరుత్సాహముతో నడుస్తున్నాయి. ఈ సంస్థలలో చికిత్సకై ఒక్కొక్క వ్యాధికి అధిక మొత్తములో ధనము వెచ్చింపబడుతున్నది. చికిత్స అన్ని తరగతులవారికీ అందుబాటులో లేదు. ఈ చికిత్సావిధానము ప్రచార బాహుళ్యం పొందితేగాని ప్రజాదరాన్ని పొందలేదు.

బ్రిటన్‌లో న్యూకాజిల్ జనరలు హాస్పిటల్లో ప్రసూతిశాఖకై ప్రత్యేకంగా గర్ట్రూడ్ బెన్ ఒక గ్రంథము వ్రాశారు. దానిలో ప్రసవానంతరం బాలింతలు చేయవలసిన వ్యాయామం పటములతో సహా ముద్రింపబడ్డది. ఆ గ్రంథం ఘనవైద్యుల ప్రశంసలను పొంది ఆ వైద్యాలయములో విధిగా అమలుపరచబడుతున్నది. (Exercises After Child Birth By Gertrude Behn with a Foreword by Linton Snatih M. D., M. S., F. R. C. S , F. R. C. O. C.) ఈ విధంగానే మనదేశంలో కూడా స్త్రీల ఆరోగ్యంకొరకు ప్రసవానంతరం, ముందూ ఉపయోగపడే యోగాసనాలను గురించి వైద్యాలయాలలో ప్రసూతిశాఖలో అమలుపరచునట్లు ప్రభుత్వం తగిన చర్యను తీసుకోవలసి ఉన్నది. ప్రధాన నగరాలలో యోగసాధనాలయాలు అన్ని వసతులతో కూడా నెలకొల్పవలసి ఉన్నది. స్త్రీల ఆరోగ్యం కాపాడటమంటే జాతిని వీర్యవంతం చేసుకోవటమన్నమాట. జాతిని వీర్యవంతం చేసుకోవటానికిగాను, స్త్రీల ఆరోగ్యసంరక్షణకై వసతులను కల్పించటంలో ప్రభుత్వం వెనుకబడరాదు. ★

# అర్థంకాని అనుభవం

(12 వ పేజీ తరువాయి)

ములు, అక్కడ వున్నవి. తమ విద్యావిధానమునకు భిన్నము కాకుండా, ఎవరికి రుచించిన దృక్పథాన్ని వారవలంబించడానికి, ఎవరికివచ్చిన జీవిత సరళిని వారనుసరించడానికీ, ఎవరికి తోచిన అభిప్రాయములను వారు వెలుబరించడాని, అక్కడికీ పూర్తి అవకాశము వున్నది. ఇట్టి బహువిధ కార్యకలాపములలో, పలురీతుల వికసించు వ్యక్తిత్వ ఉద్వేగములో కొన్ని వికృతములు సంభవించడం ప్రకృతి చిత్రము. ఏదో కొంతమంది విద్యార్థులలో తాత్కాలికంగా ఏర్పడే ఒకచెడు లక్షణమును ఎత్తిచూపి, విద్యార్థిబృందము యావత్తూ, విశ్వవిద్యాలయ శిక్షణ సర్వము అవినీతికరమని చెప్పడం భావ్యమా?

విశ్వవిద్యాలయ విద్యార్థులు, బాల్యదశ నుంచి యౌవనదశకు వస్తున్నవారు గదా! యౌవనోద్రేకము కొంతమందికి వికారము కలిగించడంలో ఆశ్చర్యమేమున్నది? అట్టి వికారము మన విద్యార్థులలో లేదందురా? విద్యార్థులు కాని యువకులలోకూడా వున్నది కదా? దీనివలన మన విశ్వవిద్యాలయాలు అవినీతిప్రదములని గాని, మన యువకులు అధఃపతనము చెందుతున్నారని గాని, మన జాతి క్షీణించి నిస్సారమవుతున్నదని గాని చెప్పగలమా?

శ్రీకృష్ణగారు ఆక్స్‌ఫర్డును గాని, కేంబ్రిడ్జిని గాని సరిగా ఎరుగరని వారు "పార్సన్సు ప్లెజర్"ను గురించి వ్రాసిన దానిని బట్టి తేలుతున్నది. వారు వ్రాసినట్లు 'చేర్ వెల్' నది కేంబ్రిడ్జివద్ద లేదు. అది ఆక్స్‌ఫర్డులోని 'ఐసిస్' (Isis) అనే నదిలోని ఒక భాగము. ఆ భాగములో పాయలున్నవి ఒక పాయలో, నలుప్రక్కల మూసిన ఆవరణలో విశ్వవిద్యాలయమునకు సంబంధించిన పురుష విద్యార్థులు, అధ్యాపకులు, స్నానము చేయుదురు. మితిమించిన (సూపర్ సెన్సిటివ్) లింగ భావము (కాన్షస్ నెస్) పాశ్చాత్యదేశస్థులకు లేదు. కాన స్త్రీలలో వలెనే, అక్కడి పురుషులు కూడ తమ మర్మస్థానములను ఇతర పురుషులు చూచెదరేమోయని లజ్జపడరు – భగవంతుడిచ్చిన శరీరమును గూర్చి గాని, అందలి భిన్నావయవాలను గురించిగాని బిడియపడవలసిన అవసరమేమి? స్త్రీలు 'పార్సన్సు ప్లెజర్'కు పోవలసిన అవసరంలేదు. అది షికారుకు వెళ్ళే ప్రదేశం కాదు.

లండన్ పత్రికలు ఈ దురాచారాన్ని రూపుమాపడానికి కృషి చేస్తున్నవట!

అనగా శ్రీకృష్ణగారభిప్రాయపడినట్లు బ్రిటిష్‌జాతి పతనము కాలేదన్నమాట!

శ్రీకృష్ణగారి వ్యాస ధోరణి [illegible] ప్రతీచీ సౌహార్దమునకు ఎంతమాత్రము తో[illegible]డదు. ★



నర్తకి ఇ. వి. సరోజ

# సినిమా

## ★ బొంబాయి సినిమాలేఖ ★

ఫిలిం పరిశ్రమలో అందరిచేత సమర్థుడనిపించుకున్న గ్యాన్‌ముఖర్జీ నవంబరు 15న కలకత్తాలో చనిపోయాడు. రచయితగా, దర్శకుడుగా, నిర్మాతగా పేరు గడించుకున్న వాడు గ్యాన్ ముఖర్జీ.

ఇటీవల కొంతకాలంగా అస్వస్థతతో తీసుకుంటూవచ్చారు. ఈ కారణంగానే, ఈయన దర్శకత్వం వహిస్తున్న నాటిలో ఒకచిత్రాన్ని (వరసూవారి "సీతారాంపీ ఆగే") మరోదర్శకుడికి ఒప్పగించటం జరిగింది. గ్యాన్‌ముఖర్జీ ఇతరచిత్రాలు (నిర్మాణంలో ఉన్నవి) మధు, అతీష్.

ఈయన ఈపరిశ్రమలోకి రావడానికి ముందు ఎం. ఎస్ సి. పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. (అలహాబాదు విశ్వవిద్యాలయం) అప్పట్లో, ప్రఖ్యాత శాస్త్రవేత్త డా॥ మేఘనాథ్‌సాహా ఈయనను అసిసెంటుగా తీసుకున్నారు. కలకత్తాలో అణుశక్తి పరిశోధనలు జరుపుతూ ఉండగా, ప్రస్తుతం ఫిలింస్థాన్ అధిపతిగా ఉన్న శశిధర్ ముఖర్జీ, ఈయనను చిన్న పని పేరిట బొంబాయి తీసుకువచ్చారు. ఆ రావడం రావడం, గ్యాన్‌ముఖర్జీ స్థిరపడిపోవడం జరిగింది. హిమాంశురాయ్ అధ్యక్షతన బొంబాయిటాకీస్ సంస్థ గొప్పగా నడుస్తున్న ఆ రోజుల్లో గ్యాన్ ముఖర్జీ అక్కడే స్క్రిప్టు రచయితగా, దర్శకుడుగా మంచిపేరు తెచ్చుకున్నాడు. బంధన్, నయాసంసార్, ఝూలా, కిస్మత్ వంటి ఉత్తమచిత్రాలకు పనిచేశాడు. గ్యాన్ ముఖర్జీ దర్శకత్వాన (రచనకూడా ఆయనే) తయారైన "కిస్మత్" రికార్డును ప్రపంచంలో ఇంతవరకు ఏ చిత్రమూ మించలేదు. కలకత్తాలోని పారడైజ్ థియేటరులో 'కిస్మత్' ఏకబిగిన 186 వారాలు నడిచింది.

దరిమిలా ఈయన స్వంతంగా సంగ్రాం, సర్దార్, శత్‌రంజ్ చిత్రాలు నిర్మించారు.

గ్యాన్‌ముఖర్జీ వయస్సు 47 సంవత్సరాలు.

* * *

భారత ఫిలిం డివిజను పక్షాన బిమల్ రాయ్ ప్రొడక్షన్సువారు నిర్మించిన "గౌతమ బుద్ధ" ఈనెల 29న బొంబాయి కలకత్తా నగరాలలో విడుదల అయింది. బౌద్ధ శిల్ప-చిత్రకళాఖండాలన్నిటినీ ఇందులో చిత్రించారు. లండన్, పారిస్ నగరాలలోని ప్రదర్శనశాలలలో ఉన్న కళాఖండాలను కూడా ఈరూపేణానైనా ఒకచోటకు (సెల్యులాయిడ్ మీదకు) చేర్చారు. దీనికి శ్రీ రాజ్‌బంశ్ ఖన్నా దర్శకుడు, శ్రీ సలీల్ చౌదరి సంగీతం కూర్చారు. ఈ చిత్రాన్ని ఇటీవల ఐక్యరాజ్యసమితి విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక సభ (ఢిల్లీలో జరుగుతున్నది) ప్రతినిధులకు చూపించారు.

* * *

సొహరాబ్ మోడీ నిర్మించిన చారిత్రిక చిత్రం 'రాజ్ హఠ్' త్వరలోనే విడుదల కాబోతోంది. రసపుత్ర చరిత్రలోని ఒక రాజాకథను ఇందులో చిత్రించారు. రాజా భూమికను దర్శకుడు సొహరాబ్ మోడీయే నిర్వహించారు. రాజకుమారిగా మధుబాల నటించింది. ప్రదీప్ కుమార్, ఉల్హాస్, ఉమాదత్ మొదలగువారు కూడా పాల్గొన్నారు. సంగీతం: శంకర్, జైకిషన్‌లు సమకూర్చారు.

ప్రదీప్‌కుమార్ స్వంతచిత్రం "ఏక్ ఝలక్" కూడా త్వరలో విడుదల కాబోతోంది. ఇందులో ప్రదీప్, వైజయంతిమాల, అనితాగుహ, ముబారక్, బిపిన్ గుప్త, ప్రాణ్, ఓంప్రకాశ్, లలితా పవర్, రాజేంద్రకుమార్ పాల్గొన్నారు. సంగీతం హేమంతకుమార్. ప్రసిద్ధనిర్మాత శ్రీ బి. ఎన్. సర్కార్ కుమారుడు దిలీప్ సర్కార్ నిర్మించిన 'బంధన్' కూడా విడుదలకు సిద్ధమైంది. మీనాకుమారి, ప్రదీప్‌కుమార్, మోతిలాల్, శశికళ, అచల, కౌమో నటించారు. సంగీతం: హేమంతకుమార్.

### పుత్రోత్సాహము తండ్రికి ....

అశోక్‌కుమార్ మొన్న 45వ పుట్టిన రోజు పండుగ జరుపుకున్నాడు. ఆరోజున వాళ్ళమ్మగారు కులదీపకుడికి 21 రూపాయలు ఇచ్చి ఏమైనా కొనుక్కోమన్నారు. తండ్రి కుమారుడిని దగ్గరకు తీసుకొని, శిరం ఆఘ్రాణించి, నిజమైన పుత్రోత్సాహాన్ని ప్రదర్శించారు. కొడుకునిచూచి తండ్రి, తండ్రి



# సినిమాలో మనిషి



## తెరవేలుపు

చిలకలపూడిలో ఉన్న చిన్నదానికీ చిన్నవాడికీ భూలోక స్వర్గంలా కనపడే సినిమా లోకంలో నటీనటులనబడే యావన్మందీ దేవతలుగా దిపిస్తారు. డిస్టెంట్ లాంగ్ షాట్‌లో చూచే ఈ ఆశాపూరిత లోచనాలకే గాక, చిన్న పట్నంలోనే ఉంటూ, సినిమాలు తీసేవారికి కూడా వీరు దేవతలుగా గోచరిస్తారు; విద్యుద్దీపాలలా ప్రకాశిస్తారు. ఎటొచ్చీ ఈ దగ్గిరవారి దృష్టిలో విద్యుద్దీపాలుగా వెలిగే శాల్తీలు రెండే. మహా అయితే మూడు. వీటినే నటీనటులు లేక హీరో హీరోయిన్లు అంటారు. మిగతా నటాళి అంతా ఓ మోస్తరు హరికేన్ దీపావళి, కోడిగుడ్డు దీపావళీను.

ఈ తెరలోక వేలుపులకు, సురలోక వేలుపులకు పోలికలు బోలెడున్నాయి. మాట వరసకి ఆ వేలుపులు అనిమిషులు; ఈ తెర వేలుపులు రోజుకి 48 గంటలు మేలుకొని సెట్ మీద పనిచేస్తూ ఉంటారు గాబట్టి స్థూలంగా ఆ కేవలత్వ లక్షితులని చెప్పుకోవచ్చు. కాలమానంలో కూడా కొంత పోలిక ఉంది. మామూలు మానవుల కాలమానం ప్రకారం మూడు నాలుగు ఏళ్లయితే, కొందరికి ఒక సంవత్సరం అవుతుంది. ఉదాహరణకు బొంబాయిలో ఒక సినిమా నటికి నాలుగేళ్ల నించి 22వ సంవత్సరం నడుస్తోంది. ఇంకో నటికి 18వ ఏడు కొనసాగుతోంది.

దేవతలకథలు చాలవరకూ ఒకే పంథాలో ఉంటాయి. ముందర నవ్వుతూ పాడుతూ ఉంటారు. రాక్షసు డొస్తాడు. లేదా ఇంద్రుడు శపిస్తాడు అక్కడి నించి కొంచెం అవస్థపడతారు చివరికి దానవ సంహారం, లేదా దేవేంద్ర శాపోప సంహారం జరుగుతుంది.

ఈ తెర వేలుపులు కనబడే సినిమా కథలకి కూడా చిరకాలంగా ఇదే వరవడి. అక్కడ దేవతలు చాలమంది ఉన్నారు కాబట్టి, అక్కడ పాత్రలలో వైవిధ్యం, చైతన్యం ఉంటాయి. ఇక్కడి బాక్సాఫీస్ దేవతల సంఖ్య పరిమితం కాబట్టి ఈ లక్షణాలు ఇక్కడ తక్కువ. ఆది మధ్యాంత రహితాలయిన కథా రాజాలు, తలయుకన్ దోకయు లేని బ్రాతలూ మూసలో పోసినట్టు, ఒకే జాతి సంతానంలా, ఒకే విధమైన రూపురేఖలతో అవతరించడానికి ఆధారం ఈ తెరవేలుపులే.

ఇందుకు నిదర్శనం ఇన్నాళ్ళు మనం చూసిన, ఇప్పుడు చూస్తున్న అనేక చిత్రాలే. వీటన్నిటి కథలను, వీటిలో పాత్రలను ఉమ్మడిగా మూడుముక్కల్లో ఇలా చెప్పకోవచ్చు:

అనగాగనగా ఒకరాజు, లేదా ఒక రైతు. అతనికి ఒక నాగేశ్వరరావు. లేదా దిలీప్‌కుమారుడు. అతనొక్కనే (అనగా బొం

---

ఆనందబాష్పాలు చూచి కుమారుడూ ముగ్ధులై పోయారు.

"ఈరోజు, ఈక్షణం నాకు చిరస్మరణీయాలు" అన్నాడు అశోక్.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి.)

---

# ఈ మధ్య విడుదలయిన 

#  మధ్యరకం చిత్రాలు

బొంబాయిలో ఈమధ్య విడుదల అయిన మూడు మధ్య రకం చిత్రాలు: అయోధ్యాపతి, ఇన్సాఫ్, ఢిల్లీ దర్బార్. ఈ మూడింటిలోనూ ఏరితే చివరి చిత్రం చాలా బాగుందని, మిగతా రెండిటి కన్నా చాలా మెరుగని చెప్పకోవచ్చు.

అయోధ్యాపతికథ ఆ బాలగోపాలం ఎరిగినదే. కైకమ్మకిచ్చినమాట నిలబెట్టుకోవడం కోసం దశరథుడు, తన తనయుడు రాముడిని అడవికి పంపడం, పంపి ఆవేదన చెందడం, ఆ వేదనలో నేమరణించడం ఇందులో చిత్రించారు. ఉషాకిరణ్, అభిభట్టాచార్య ముఖ్యభూమికలు నిర్వహించారు. ఎంత చదివినా, విన్నా, ఎన్నటికీ తనివి తీరని ఈ గాథను ఉత్తమ చలన చిత్రంగా నిర్మించడానికి బ్రహ్మాండమైన అవకాశాలున్నాయి. తిదవ్యంగా నిర్మించడానికి కూడా చాలా అవకాశాలున్నాయని ఇది ఋజువు చేస్తుంది. ఇందుకు స్క్రీన్‌ప్లే రచన, దర్శకత్వ నిర్వహణ, పాత్రధారుల నటన చాలా దోహదం చేశాయి. ఈ చిత్రంలో సంగీతం వినడానికి 'బాగానే' ఉందిగాని హిట్ అవుతాయని ఏ ఒక్క పాటా అనిపించటంలేదు.

రెండో చిత్రం 'ఇన్సాఫ్'లో నళిని జయవంత్, అజిత్ నటించారు.

ఇది సగటురకం "అరేబియన్ నైట్స్" కథ. ఇందులో మామూలుగానే అనగనగా రాజు, దుర్మార్గుడైన మంత్రి సింహాసనం కోసం కుట్రపన్నడం, అందాల రాశి అయిన రాకుమారి, కథాక్రమానుసారంగా యథాప్రకారం ఉన్నాయి. ఎటొచ్చీ, చిత్రంలో రాకుమారి (నళినీ జయవంత్) మాత్రం అపురూప సౌందర్యరాశిలా వెలగలేదు. ఆమె నటన కూడా కొంత కృత్రిమంగా సాగింది. సంభాషణలూ ఆబాపతుగానే ఉన్నాయి. అజిత్ కొత్త పోకడలేవీ లేకుండా జాగ్రత్తపడి, ఎప్పటికి మల్లెనే, బండి నడిపించాడు. దర్శకత్వ ప్రతిభ, సంగీతం, ఛాయాగ్రహణం, శబ్దగ్రహణం కథ స్థాయికితగ్గట్టే, 'హద్దు' మీరకుండా ప్రకాశించాయి.

మూడవది "ఢిల్లి దర్బార్." ఉన్న మూడిటిలోనూ ఇదే బాగుంది. షాజహాన్ కాలంనాటి, ఒక రజపుత్ర ప్రభువు కథను ఇందులో చిత్రించారు. మొగలాయీల కాలంలో వైభవం యావత్తూ సముజ్వలంగా ఇందులో ప్రకాశించకపోయినా, మొత్తం మీద మంచి ఫలితాలు సాధించారు. మాటల పాటల రచన, కథ నడిపిన తీరూ బాగానే ఉన్నాయి. పాత్రధారులంతా సహజంగా, సాఫీగా తమభూమికలు నిర్వహించారు.

రజపుత్ర ప్రభువు అమర్‌సింగ్‌గా ప్రేమ్ అదీబ్, రాణిగా సుమిత్రాదేవి మటుకు ఉన్న వారందరికన్న మిన్నగా నటించారు. వారివల్లనే ఈ చిత్రం బాగా రాణించిందని చెప్పవచ్చు. 

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)



నరసూవారి హిందీచిత్రం "సితారోంసే ఆగే"లో అశోక్‌కుమార్, వైజయంతీమాల

బాయి లేక మద్రాసు) ఒక జమీందారు, లేదా గుమాస్తా. అతగాడికొక అంజలి, బొంబాయి వాడయితే మీనాకుమారి. ఇది ప్రాతిపదిక.

ఆతరవాతి కుహూకుహూ అనే కోయిలలూ, పరంజామాతో ఏమోయీ ప్రేమోయీ అంటూ పాటలూ వగైరా. ఇంతటితోకీ, కష్టాలూ దుఃఖం కలిసి ప్రాణ్ వేషమో కె. ఎన్. సింగ్, లేదా గుమ్మడి, వేషమో వేసుకుని పైప్ కాలుస్తూ విలన్‌లా చూస్తూ వస్తాయి.

ఇది కథకి పెట్రోలు, దీని సహాయంతో ఈ పాతకథ, డొక్కు కారులా (ముందుకో వెనక్కో) నడుస్తూ ఉంటుంది, అంతలో, పాటలో డాన్సులో అడ్డుపడి ఠకీమని ఆగి ఊరుకుంటుంది.

తరవాతి కథ ఏం కావాలో తేల్చుకునే లోగా కొంత ప్రహసనం. ఈ హాస్యగాడు హీరోకి చెలికాడు. ఇతగాడి భార్య, లేదా ప్రియసి ముమ్మూర్తులా సూర్యకాంతం అనగా గయ్యాళి.

* * *

పరిస్థితులు ఇలా తయారు కావడానికి నటీనటులు ప్రధానంగా నిమిత్తమాత్రులే తప్ప కారకులు మటుకు కాదని గమనించడం అవసరం. ఇందుకు బాధ్యులు అసాధ్యులైన సినిమా పెద్దలు. ప్రజా హృదయము, లేక బాక్సాఫీస్ హృదయమును క్షుణ్ణంగా అవగాహన చేసుకున్నామనుకొనేవారూ, అనేవారూను.

ఎందుకంటే, రకరకాల పాత్రలు, విలక్షణమైన పాత్రలూ, నిర్వహించి, తమ బహుముఖ ప్రతిభను ప్రదర్శించాలనీ, కళలో పరాకాష్ఠ అనే స్థాయి సరిహద్దులు దాటకపోయినా, దరిదాపులకైనా చేరాలనీ నటులు సర్వదా అభిలషిస్తారు. ప్రగాఢంగా వాంఛిస్తారు.

అయితే, నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు' వారివల్ల దర్శకులూ, కవులూ అంతా చేరి ముందు నిర్ణయించుకున్న నటీనటులనే ఆధారం చేసుకొని పాత్రలను రూపకల్పన చేస్తారు; సంఘటనలు కల్పిస్తారు. కథ[illegible] చేస్తారు. ప్రసిద్ధికెక్కిన రచయితల కథ[illegible] తీసుకున్నా, వాటిని ఉన్న నటీనటుల స్థిరమైన స్వభావాలకీ, తీరు తెన్నులకూ, ఒడ్డూ పొడుగులకూ, కుదించి, కవలిస్తే సాగదీసి, లేకపోతే అప్పడాలు ఒత్తి ఎలాగో అలాగ సర్దేస్తారు.

కొత్త రకమైన భూమిక లభించబోతోందనుకున్న నటుడు తీరా వేషం కట్టే వేళకు; అది మామూలు, మాసిపోయిన పాతరకం వేషమేనని గ్రహిస్తాడు.

ఈ విధంగా, తమ కోరిక ఈడేరక [illegible] నటీనటులు, ఆ ఫలంగా చెలరేగి తమకు తోచిన రీతిన, ఒపిన మేరకు ఆ పాత్రలను మరింత అపాత్రం చేయడానికి పనిగట్టడం జరుగుతుంది.

నిర్వహించే భూమిక ఎలాగా తనను చూసి రూపొందినదే కాబట్టి, దానికి ఉండే కనీస మర్యాదలు పాటించి మటుకు లాభ మేమిటన్న ధోరణి గోచరిస్తుంది మాట వరసకి, ఉద్యోగం ఆస్తి బొత్తిగా లేని బీదవాడి కథ ఉంటుంది అందులో ఆబీద హీరో, గాబర్డిన్ సూట్లు, గాస్కో పంచలు, ప్రాపతువి ధరిస్తాడు చిరిగినవి కట్టుకోవాలని స్క్రిప్టులో ఉన్నా వాటి నే ఫోటోజెనిక్ గా చింపి మాసికలు వేయిస్తారు స్త్రీ భూమికల విషయంలో కూడా ఈ ధోరణి కనబడుతోంది. చాలా అవస్థల్లో ఉండి, అంట్లు తోమడం, పిండి విసరడంవంటి పనులు చేసుకుని పొట్ట పోసుకునే ఘట్టంలో కూడా నటీమణులు, విలువైన వలువలను తప్ప మరొకటి ధరించరు. ఆరండీ రవిక, హైక్లాసు చీర కట్టుకుని, స్టయిలిష్ గా అంట్లు తోముటను అభినయించడం కనబడు తుంది అలాగే ఏడుపుఘట్టంలో, నల్లచీర కట్టుకుని మరీ ఆపని చెయ్యడం సర్వత్రా పరిపాటి అయిపోయింది.

తరచుగా బొంబాయి చిత్రాలలోను, అపుడపుడు మన చిత్రాలలోను తటస్థపడే మరో ముచ్చట ప్లస్ మార్కు పలాస్త్రి ప్రమాదాలు.

అంటే, కథలో హీరో ఏ మేడ మీదినించో పడతాడు. కాలు గాని, చెయి గాని విరుగుతుంది అయితే, తరవాతి దృశ్యంలో, ఈ ప్రమాదానికి చిహ్నంగా మనకి కనబడేది సాధారణంగా హీరో నుదుట మీద ప్లస్ మార్కు పలాస్త్రి.

చూట్టానికి చాలా బావుంటుంది: పరిభాషప్రకారం ఫోటోజెనిక్ గా ఉంటుంది వాస్తవికతకు న్యాయం చేకూర్చదలచిన కొందరు, కాలు విరిగినపుడు నుదురు మీద చికిత్స, అసందర్భంగా కనబడుతుందని గుర్తించి, కాలికి స్టయిలిష్ గా కట్టుకట్టించుతారు తద్వారా, ఒంటి చేతో సైకిలు తొక్కినట్టు, ఒక్క చేతో నే చాలా యాక్షన్ చేయవచ్చునని నిరూపించడానికి దోహదం జరుగుతుంది

పైన చెప్పినవన్నీ, అగ్రశ్రేణి నటుల చిన్న చిన్న ముచ్చట్లు చిన్నవే అయినా, ఇతర వర్గాలద్వారా జరిగే ఇతర అపచారాలతో కలిసి కథని, పాత్రనీ కూడా అవగుణాలతో నింపివేస్తాయి.

*     *     *

ఈ సందర్భంలోనే నటీనటులూ, నిర్మాతలూ కూడా సహృదయంతో ఆలోచించదగ్గ మరో "ముచ్చట" గురించికూడా చెప్పుకోవడం అప్రస్తుతం కాదు.

ఇది కొత్తనటుల, చిన్న నటులవిషయం. కేవలం అవకాశాలు లేనందువల్లనే చిన్న నటులుగా ఉన్నవారు అనేకులు చిత్రం సర్వాంగ సుందరంగా తయారు కావాలంటే చిన్న నటులందరూ తమ భూమికలను లోపరహితంగా నిర్వహించాలి వాళ్లు అది సాధిస్తున్నారు గనకనే అనేక చిత్రాలు రాణిస్తున్నాయి ఇపుడు చిన్న వాళ్ళుగా ఉన్న వాళ్ళకీ, కొత్త వాళ్ళకీ 'అవకాశాలు' అనేవి అట్టే లేవు ఉన్నవాటికి పోటీ చాలా వుంటుంది ఈ పరిస్థితిలో 'గెస్ట్ ఆర్టిస్టు' పేరిట పెద్దనటులు చిన్న చిన్న వేషాలు వేసి, ముచ్చటపడడం ఎంతవరకూ న్యాయం అని ఆలోచించ బుద్ధి వేస్తుంది అసలు ఈ 'గెస్ట్' ఏర్పాటు, అనేక ఇతర ఏర్పాట్లలాగే, హాలీవుడ్ నించి దిగుమతి అయింది హాలీవుడ్ చిత్రాలలో 'గెస్ట్ ఆర్టిస్ట్' అంటే అరనిమిషం కనబడతాడు. అది కరణా అది డోసు మీరితే, గెస్ట్ అన్న పదం వర్తించదు అయినా,



షహీద్ లతీఫ్ చిత్రం "లల్లారూఖ్"లో తలత్, శ్యామా

చలన చిత్ర కథ

# "బోల్డ్ అండ్ ది బ్రేవ్"

పొదలమాటున మెదులుతున్న నాజీ సైనికుడు, డేవ్ ఫెయిర్ చెయిల్డ్ కంటపడ్డాడు. డేవ్ తుపాకిగురి సరిచేసుకున్నాడు గాని; పేల్చడమా మానడమా అన్న సంగతి తేల్చుకోలేక తటపటాయిస్తున్నాడు. డేవ్ కి జీవహింస ఇష్టంలేదు. అయినా యుద్ధంలో చేరాడు యుద్ధరంగంలో సిద్ధాంతాలనుగురించి తర్కించుకోవడం వంటికి మంచిదికాదు

డేవ్ వెనకాలఉన్న లెఫ్టినెంటు అలస్యం చెయ్యకుండా తుపాకి పేల్చి నాజీని చంపేశాడు ఈ లెఫ్టినెంట్ ధర్మపన్నాలు నీతులూ అవీ చెప్తాడు నీతిగానే ఉంటాడు. అందుకని అతన్ని ప్రీచర్ (మతగురువు) అంటారు సైనికులంతా.

ప్రీచర్ నవ్వాడు "ఎదురుగా నాజీవుంటే అలా చూస్తావేమిటి? పేల్చకుండా?" అన్నాడు

"నిండుప్రాణం తియ్యలేక." అన్నాడు డేవ్

"నీకు ప్రాణం అంత తియ్యటిదా? చావంటే అంత భయమా" అన్నాడు ప్రీచర్ హేళనగా నవ్వుతు

"నీకు లేదా?" అన్నాడు డేవ్.

"లేదు. ప్రాణంపోదని నాకుధైర్యంఉంది. పోతుందన్నా భయమూలేదు' అన్నాడు ప్రీచర్ రెండవ ప్రపంచ యుద్ధాన్ని పురస్కరించుకొని 1944 లో ఇటలీలో ఉన్న అమెరికన్ పదాతిదళంలో ఈ ప్రీచర్, డేవ్ ఫేయిర్ చెయిల్డ్ ఈవిధంగా సన్నిహితులయ్యారు డేవ్ ఆప్తమిత్రుడు డూలీ డూలీ మూర్తీభవించిన చైతన్యం ఎప్పుడూ బడబడలాడుతాడు.

పెద్దమేడా, మాంఛికారూ, చాలా డబ్బు సంపాదించి ఝుంమని బతకాలని అతని ఆశ. ఎటొచ్చి, నిర్భయంగా, హుషారుగా ఆసంగతి చెప్తాడు. అవన్నీ సాధించేలోగా ఉన్నంతలో ఖుషీగా రోజులు గడపడం అతడి మతం. సైన్యంలో అందరూ అంతే సెలవూ, చేతికి జీతం, అందినపుడు, ఊళ్ళోకెళ్ళి సెనగపప్పులా డబ్బు ఖర్చుపెట్టేస్తారు

ఒక సెలవురోజున ప్రీచర్, డేవ్, డూలీ కలసివెళ్లారు ఊళ్ళోకి

అక్కడ, మద్యం ముట్టనన్నాడు ప్రీచర్. ప్రియురాలు అక్కర్లేదన్నాడు తాత్కాలికసుఖాలకోసం ఇలా అవినీతికి పాల్పడడం హేయం అన్నాడు.

ఎవరికర్మకి వారు కర్తలన్నట్టుగా, నవ్వి మరికొంచెం "తీర్థం" పుచ్చుకున్నారు డేవ్, డూలీలు

డూలీకి హఠాత్తుగా గొప్పఊహ తట్టింది. "ఈ ప్రీచర్ గాడి ధర్మపన్నాలన్నీ పచ్చికోతలు; తమాషా చేద్దాం ఉండు." అన్నాడు డేవ్ తో.

చూడచక్కనిచిన్నదాన్ని పిలిచి పది డాలర్లు చేతబెట్టి, ప్రీచర్ ని చూపించాడు

యుద్ధం తెచ్చిపెట్టిన కాటకంవల్ల, ఇష్టం లేకపోయినా, ఈ నికృష్ట జీవితానికి ఒడిగట్టిన ఆ యువతి, డూలీ ఊహని పసిగట్టి, ప్రీచర్ వెంటబడింది. ఆమె పేరు ఫియామా.

ప్రీచర్ ఆమెను మామూలు మనిషిగానే చూచి గౌరవించాడు. ఆమె మద్యశాలకు పదమంటే, "నాకు మజ్జిగ కావాలన్నాడు."

ఫియామా విస్తుపోయింది. ఈ ఊరు (నేపుల్స్) ఇంతమంది సైనికులువచ్చారు గాని, నీలాంటివాణ్ణి చూడలేదు అంది.

మజ్జిగతాగడం, దేవుడిగుడికి వెళ్ళడం వంటి మంచిపనులు చిరకాలం తరవాత, ఈనాటికి, ఇతగాడితో కలసిచేసిన ఫియామాకి, రెండురోజులలో ఈ ప్రీచర్ సాక్షాత్తు దేవుడులా కనబడ్డాడు. అందరు సైనికులకుమల్లె ఇతడు తన శరీరాన్ని కోరలేదు, తానై అర్పించబోయినా నిరాకరించాడు

"ప్రీచర్! నిన్ను ప్రేమిస్తున్నాను నన్ను పెళ్ళిచేసుకో జీవితాంతం నీకు సేవచేస్తాను" అంది గత జీవిత స్మృతులను పూర్తిగా చెరిపివేసుకుని.

ప్రీచర్ అంగీకరించాడు. ఉత్తరక్షణాన ఫియామా పరుగెత్తుకుని డేవ్ దగ్గరకు వెళ్ళి ఈసంగతి తనే చెప్పింది

"ఇప్పుడు దయచేసి నా పాతకథను, మీరు నన్ను కిరాయికి మాట్లాడి పురికొల్పిన విషయాన్ని ప్రీచర్ కి చెప్పకండి నేనింక ఈ నికృష్టజీవితాన్ని మర్చిపోయి, అతన్ని పెళ్లిచేసుకుని, అందరు మనుషులకుమల్లేనే సుఖపడతాను" అని ప్రాధేయపడింది.

డేవ్ ఆశ్చర్యపోయాడు; ఈ అనకోని కథకు అంతలోనే ప్రీచర్ కూడా వచ్చి సిగ్గుపడుతూ శుభవార్తను ప్రకటించాడు.

అంతలోనే, ఈకథ విషాదాంతం అయింది

ఆహోటలులోకి, అప్పుడే వచ్చిన కొందరు సైనికులు, చనువుగా ఫియామాతో సరసం ఆడబోయారు

ఫియామాకు కాబోయే భర్త హోదాలో, వాళ్ళని కేకలేశాడు ప్రీచర్; ఎవరనుకుంటున్నారని

"బావుంది ఇది ఫియామా కాక ఇంకెవరట! ఇటలీ వచ్చిన ప్రతి సైనికుడికీ నేస్తం." అన్నాడు తాగిన ఆ సైనికుడు.

ప్రీచర్ గుండె కలుక్కుమంది.

"నన్ను వంచించబోయావు ఛీ" అన్నాడు తిరిగిపోతూ.

ఫియామా అతని కాళ్లా వేళ్ళా పడింది

"దేశం అంతా కాటకం వచ్చింది ముసలి తలితండ్రులు, పసివాళ్ళయిన తోబుట్టువులు మలమల మాడుతూంటే చూడలేక, నేనూ మాడలేక ఇన్నాళ్ళూ ఈ పాపానికి ఒడిగట్టాను. ఇప్పుడు బాగుపడి, ఇల్లాలిగా ఋజుమార్గాన జీవించాలని ఆశపడ్డాను నన్ను అసహ్యించుకోవద్దు" అంది ఫియామా.

"ఛీ" అన్నాడు ప్రీచర్; ఫియామా మెడలో తాను వేసిన వెండి సిలువదండను తెంచుకునిపోతూ

* * *

## తెర వేలుపు

ప్రస్తుతం, ఈ మాట పేరిట, చిన్నచిన్న వేషాలు కొన్ని కొత్తవాళ్లకో, ఉన్న నటులలో సమర్థులకో లభ్యం కాకుండా పోతున్నాయి. గెస్ట్ అని పెద్ద నటులకు ఇచ్చే అవకాశాన్ని, ప్రచారాన్ని, "ఇదుగో మేము ఒక కొత్త మనిషిని పరిచయం చేస్తున్నాం" అని చెప్పిచేస్తే అనేకవిధాల అది రాణిస్తుంది.

అగ్రశ్రేణి నటీనటులంతా, ఈ విషయాన్ని సహృదయంతో ఆలోచించి, తోటి నటీనటులకు సదవకాశం ఇప్పించటకు అవశ్యకతను గుర్తించి, నిర్మాతలకు, దర్శకులకు నచ్చచెప్ప పూనుకోవడం వాంఛనీయం.

ఇక చలనచిత్రాలకు కథారచనలో పాత్రల రూపకల్పనలో కొత్తదనం, ఇతోధిక వైవిధ్యం కనబడేట్లు చేయడానికి కూడా నటీనటులే పూనుకోవాలి. అపుడే అది త్వరగా సాగివస్తుంది

సిండ్రెలా జోళ్ళు సిండ్రెలాకే తొడగాలికాని, రెడీగా వున్న మనిషి కోసం ఆ జోడుని కత్తిరించేసి రూపం మార్చే పద్ధతులకు స్వస్తి చెప్పించాలి. ★

ఫీచర్‌కి మనుషులంటే ఎడతెగని అసహ్యం కలిగింది. నమ్మకం పోయింది. తల్లి ఎవరో అతడికి తెలియదు. తండ్రి త్రాగుబోతు, జూదరి. తనను పినతండ్రి పెంచాడు. నీతి, పాపభీతి బాగా వంటబట్టాయి. అయితే తోటి మానవులమీద సానుభూతి చూపే గొప్పబుద్ధి మాత్రం అట్టే అబ్బిందికాదు. ఏకొస్తైనా ఉంటే, ఆ కొస్తా, ఫియామా కథ తెలియడంతో ఊరించుక పోయింది.

* * *

సెలవులు అయిపోయాయి. మర్నాడే దళం బయలుదేరాలి. ఆరాత్రి డూలీ, నేపుల్స్‌లో జూదం ఆడి ఏకబిగిన 30 వేల డాలర్లు గెలుచుకొచ్చాడు.

"నాకు పదముగ్గురు తోబుట్టువులున్నారు. ఇంక మేం అవస్థపడక్కర్లేదు. ఈ డబ్బుతో తిండికిలోటు లేకుండా ఉంటాం అంటూ డబ్బుని బల్లమీద గుమ్మరించాడు డూలీ ఉత్సాహంగా.

ఫ్రీచర్ ఒక్కసారి మండిపడ్డాడు.

"పాడు డబ్బు. పాపపు డబ్బు. జూదం ఆడి తెచ్చావు. దాన్ని అవతల పారెయ్యి. లేకపోతే ఇక్కడినించి తీసుకుపో" అన్నాడు పాతికేళ్లుగా లోపల పేరుకుపోతున్న రకరకాల బాధలను, ద్వేషాలనూ ఒక్కసారి బయటపెడుతూ.

"ఏడిసినట్టుంది మీ ఐడియా. ఇంత డబ్బు అవతల పారెయ్యమంటారా" అన్నాడు డూలీ.

* * *

అడవులలో చెట్లూ పొదలుచాటు చేసుకుని మెల్లిగా ముందుకు సాగుతోంది సైనిక దళం; ఫ్రీచర్ నాయకత్వాన.

ఒకచోట శిథిలగృహం ఒకటి కనబడింది. అక్కడ మరతుపాకి పేలినధ్వని వినబడింది.

ఫ్రీచర్‌తో ఉన్న సైనికులు జేవ్, డూలీ కాక మరోముగ్గురు.

ఫ్రీచర్ ఆ స్థావరంలోని ఆరుగురు నాజీలను చంపి, దాన్ని పట్టుకునేసరికి, తన దళంలో ఇద్దరు చనిపోయారు. ఒకడు తీవ్రంగా గాయపడి చావుబ్రతుకులలో ఉన్నాడు. బయటికి పదండి అన్నాడు ఫ్రీచర్.

"కట్టుకట్టకపోతే ఎలా" అన్నాడు డూలీ.

"ఆపాటి జాలి నాకూవుంది. అతడెలాగా బ్రతకడు" అన్నాడు ఫ్రీచర్.

అంతలో ఒక జర్మన్ టాంకు, ఆ శిథిల గృహంమీదికి శతఘ్ని పేల్చింది. తటపటాయిస్తున్న సైనికుడు చటుక్కున చనిపోయాడు.

ఫ్రీచర్‌కి వెర్రికోపం వచ్చేసింది.

"పదండి. ఆ టాంకుని ధ్వంసంచేదాం" అన్నాడు.

"ఎలాగా? వెళ్లి విరక్కొడదామా చేత్తోటి? అన్నాడు జేవ్.

"నన్ను బయటికి తియ్యండి" అన్నాడు కూలిన దూలంకింద పడివున్న డూలీ.

చేయూత ఇచ్చి లేవనెత్తినపుడు, డూలీ కోటు ఒత్తుగా పూటుగా ఉండడం గమనించాడు ఫ్రీచర్. కోపం అంతా దానిమీదికి తిరిగింది.

"జూదంలో గెల్చిన పాపపు డబ్బేనా ఇదంతా అంటూనే, డూలీకోటు లోపల, లాగూ కాళ్ళలోపల, కుక్కి దాచుకున్న 30 వేల డాలర్ల నోట్లూ క్రింద పోయించాడు.

"పద" అన్నాడు అధికారరీత్యా ఆజ్ఞాపిస్తూ.

"నా భవిష్యత్తు, నా కుటుంబం భవిష్యత్తు...ఈ డబ్బు వదలలేను" అన్నాడు డూలీ జాలిగా.

"తుచ్ఛపు డబ్బు...నడు" అన్నాడు ఫ్రీచర్.

పది అడుగులు వేసేసరికి, టాంకు తిరిగి కాల్పులు జరిపింది. ముగ్గురూ ఓ చెట్టు చాటున దాగారు.

"టాంకుని అటకాయించడానికి వాటం చూసివస్తాను. నన్ను కాయండి" అని ఫ్రీచర్ బయల్దేరాడు ముందుకి.

"డూలీ ఒక్కక్షణంలో వెనక్కి పరుగెత్తాడు శిథిలగృహ శిథిలాలవద్ద పడిఉన్న తన 30 వేల డాలర్ల కోసం. అంతలోనే జర్మన్ టాంకు మరోశతఘ్ని కాల్చింది.

పర్వతంలా లేచినపొగ తెరపిచ్చాక చూసేసరికి,దూరాన డూలీ శవం, అక్కడే డాలర్ నోట్లూ కనబడ్డాయి జేవ్‌కి.

అంతలోనే అటువైపునుండి పరుగెత్తుకుని తిరిగివస్తున్న ఫ్రీచర్, తొందరలో నేలమీదపన్నిన ఉచ్చును తన్నాడు. వెంటనే అక్కడ జర్మన్‌లు మాటుపెట్టిన మైన్ పేలింది. గాయపడి నిస్సహాయుడై పడిపోయాడు ఫ్రీచర్.

జేవ్‌కి దుఃఖం కోపంకూడా ఉప్పొంగాయి. తన అహింసాసిద్ధాంతాన్ని అట్టే పక్కకు నెట్టేశాడు. ధైర్యసాహసాలతో, ఒంటరిగా, ఆటాంకుని ధ్వంసంచేయ పూనుకొన్నాడు. క్షణక్షణానికీ మరణ గండం తప్పించుకుంటూ, ఒడుపుగా, ఆ టాంకును సమీపించి, మూత బిగించి, నిప్పుపెట్టేశాడు.

ఆ తరవాత ఫ్రీచర్ పడిఉన్నచోటు మీదుగానే, డూలీ శవం ఉన్న స్థలానికి వెళ్లాడు. అక్కడి డబ్బుఅంతా పోగుచేసి జేబుల్లో పెట్టుకొన్నాడు. తిరిగి ఫ్రీచర్ దగ్గరకు వచ్చి, ఈ డబ్బును డూలీ కుటుంబానికి అందచేస్తానని" చెప్పాడు.

"ఫ్రీచర్ నువ్వు నన్ను హేళనచేశావు నాకు మృత్యువంటే భయమని, ధైర్యంలేదని. నాకు సాహసంఉంది. ఎప్పుడూఉంది నీకు మాత్రం ఉట్టి ధైర్యం, కబుర్లుచెప్పే ధైర్యమే ఉంది. నీతులు చెబుతావుగాని నీకు నీతిలేదు. నీతిపేరిట డూలీప్రాణం పొట్టన పెట్టుకున్నావు. నీతిపేరిట, నిన్ను నమ్మి నీమీద ఆశపెట్టుకున్న ఫియామాకు అన్యాయం చేశావు. పాపంచేసి పశ్చాత్తాపపడే వాళ్లని క్షమించగల ధైర్యంలేదు నీకు" అన్నాడు జేవ్.

పతితులను, అవినీతిపరులను చూచి అసహ్యించుకొనగలననుకొనే ఫ్రీచర్‌కు తొలిసారిగా జ్ఞానోదయం అయింది. తోటివారిని క్షమించడం, సానుభూతి చూపడం అనే ప్రధానలక్షణం, మానవధర్మం తనలో లోపించిందని ఆ క్షణాన గ్రహించాడు.

పతితుడు తనే. అందుకని పశ్చాత్తాపం చెందవలసినవాడూ తనే. పిరికివాడూ తనే.

పరిదీనవదనుడై, తప్పు గ్రహించానన్నట్లు చూచాడు ఫ్రీచర్...

జేవ్ ఆ క్షతగాత్రుణ్ణి భుజానవేసుకుని శిబిరాభిముఖంగా నడచాడు.

ఈ కథను "బోల్డ్ అండ్ ది బ్రేవ్" అనే పేరుతో ఆర్. కె. ఒ. రేడియో పిక్చర్స్ వారు చలనచిత్రంగా నిర్మించారు. జేవ్‌గా వెండెల్ కోరీ, డూలీగా మిక్కీరూనీ, ఫియామాగా నికోల్ మారే, ఫ్రీచర్‌గా డాన్ టెయిలర్ నటించారు. ★

# ★ హంగరీ సహాయనిరాకరణం ★

(30వ పేజీ తరువాయి)

హంగేరియన్ భాషను ప్రభుత్వం గుర్తించింది గాని, పన్నుల విషయానికి నిరాకరించింది. పన్నులు ఎక్కువవేసి పీడించడానికి కాకపోతే బానిసదేశానికి వేరే ప్రయోజనమేముంది?

దీనికి ప్రతిక్రియగా కోసత్ హంగేరియన్ వాణిజ్య, పారిశ్రామిక మండలిని ఏర్పాటు చేశాడు. ఈ మండలి హంగరీలో వర్తకాన్ని, పరిశ్రమలని అభివృద్ధి చేయడానికి పూనుకున్నది. దీన్ని అణచివేయాలని ప్రభుత్వం తీవ్ర ప్రయత్నం చేసింది. దాంతో అంతవరకూ జాతీయవాదులతో చేరకుండా ప్రభుత్వంతో సహకరిస్తున్న ప్రభువర్గం కూడా అసంతృప్తిచెంది జాతీయోద్యమంలో చేరింది.

1847 లో మళ్లీ ఎన్నికలు జరిగాయి. పెస్ట్ నియోజకవర్గం తమపక్షానే ఉంటుందని ఆశపడ్డ ఆస్ట్రియనకు తీవ్ర ఆశాభంగం కలిగింది. కోసత్ పోటీచేశాడు. ప్రభుత్వం ఎన్ని మాయోపాయాలవలంబించినా కోసత్ గెలిచాడు. పార్లమెంటుకు అతడు నాయకుడయ్యాడు.

ఆ పార్లమెంటు హంగరీకి స్వాతంత్ర్యం ఇవ్వాలని తీర్మానంచేసింది. ప్రజలంతా పార్లమెంటుకు అండగా ఉన్నందున ఆస్ట్రియన్ చక్రవర్తి చేసేదిలేక అంగీకరించాడు. కొత్త రాజ్యాంగం రచించబడింది. హంగేరియన్ ప్రజలచే ఎన్నుకోబడిన ప్రభుత్వం స్థాపించబడింది. షెచెన్యీ పబ్లిక్ వర్క్స మంత్రిగా, ఫ్రాన్సిస్ డీక్ న్యాయశాఖ మంత్రిగా, కోసత్ ఆర్థికమంత్రిగా ఎన్నుకోబడ్డారు.

కాని హంగరీ స్వతంత్రం కావడం ఆస్ట్రియాకు కడుపుమంటగా నేఉంది. ఆస్ట్రియన్ ప్రభుత్వం వాలాచియన్, సెర్బియన్, క్రోషియన్ మూకలను హంగరీమీదికి పురికొల్పి పంపింది. కాని కొత్తగా ఏర్పడిన హంగేరియన్ సైన్యం దాడిమూకలను ఓడించి తరిమివేసింది.

తరవాత ఆస్ట్రియన్ ప్రభుత్వం కౌంట్ లెంబర్గ్ ను హంగరీకి వైస్రాయిగా పంపింది. పార్లమెంటు అతన్ని తిరస్కరించినా అతను మొండిగా బుడాపెస్టు వచ్చాడు. రాగానే అతన్నెవరో ఖూనీచేశారు.

తరవాత చక్రవర్తి ఆస్ట్రియన్ సైన్యాలను బుడాపెస్టుపైకి పంపించాడు. హంగేరియను ధైర్యంతో ఎదుర్కొన్నారుగాని చివరకు ఓడిపోయారు. ఆస్ట్రియా సంపూర్ణాధికారం వహించింది. పార్లమెంటు రద్దు అయింది. రాజ్యాంగం కూడా రద్దయింది. హంగేరియన్ భాషపై తిరిగి నిషేధం నెలకొల్పబడింది. మండల పరిపాలక సంఘాలు రద్దుచేయబడి, దేశమంతా కొన్ని మిలిటరీ జిల్లాలుగా విభజింపబడి ఆస్ట్రియన్ అధికారుల హస్తగతం చేయబడినవి. హంగరీ పేరు యూరప్ పటంనుండి తుడిచివేయబడింది. "హంగరీ చనిపోయిం"దని అంతా అనుకున్నారు. కాని ఫ్రాన్సిస్ డీక్ ఇంకా బ్రతికే ఉన్నాడు. అతనిలో హంగరీ ప్రాణాలు నిలుపుకున్నది.

## ఫ్రాన్సిస్ డీక్ ప్రతిఘటన

ఫ్రాన్సిస్ డీక్ తన ఆదర్శాలను విస్మరించలేదు. పెస్ట్ నగరంలో తన అనుచరులను, అభిమానులను తన గదిలో చేరదీసి రాజకీయాలు చర్చిస్తుండేవాడు. చక్రవర్తి అతనికి ఉన్నతపదవిని వశ్మై ఎరచూపాడు కాని "నా దేశపు రాజ్యాంగాన్ని గుర్తిస్తే మీ ఉద్యోగాన్ని గూర్చి ఆలోచిస్తా"నని డీక్ సమాధానమిచ్చాడు. వియన్నాకు వచ్చి చర్చలు జరపవలసిందని ప్రభుత్వం కోరింది. కాని దానికికూడా అతడు నిరాకరించాడు.

1859 లో ఫ్రాన్సుకు, ఆస్ట్రియాకు యుద్ధం జరిగింది. ఆస్ట్రియా చిత్తుగా ఓడిపోయింది. చక్రవర్తి ఫ్రాన్సిస్ జోసెఫ్ తన దేశీయాంగమంత్రి బాక్ ను తొలగించి హంగేరియన్ వాడైన బారన్ జోసికాను మంత్రిపదవికి రమ్మని ఆహ్వానించాడు.

"ప్రభూ! నేను హంగేరియన్ను. హంగేరియన్లను నేను అర్థంచేసుకోగలను. ఆస్ట్రియన్లు నా కర్థంకారు. హంగేరియనను పాలించడానికి మీరు ఆస్ట్రియన్ను నియమిస్తే అతనికెన్ని చిక్కులు కలుగుతాయో, నేను ఆస్ట్రియన్లను పాలించబోయినా అన్ని చిక్కులూ కలుగుతాయి" అని జోసికా మనవిచేసుకున్నాడు.

చక్రవర్తి పోలిష్ వాడైన గొలూచావ్స్కీని మంత్రిగా వేసుకున్నాడు. హంగేరియన్లను సంతృప్తిపరచడానికి ఆరుగురు హంగేరియన్లను ప్రీవీ కౌన్సిల్ లోకి ఆహ్వానించాడు. వారు డీక్ ను సలహా అడిగారు.

"వెళ్ళవద్దు. హంగరి నలహాకావాలంటే చక్రవర్తి బుడాపెస్టువచ్చి మన పార్లమెంటును సంప్రదించాల్సిందే" అని డీక్ చెప్పాడు. దాంతో వారిలో ముగ్గురు చక్రవర్తి ఆహ్వానాన్ని తిరస్కరించారు.

చివరికి 1861 లో ఆస్ట్రియన్ ప్రభుత్వం మండల పరిపాలకసంఘాలను మళ్లీ స్థాపించడానికి, హంగేరియన్ పార్లమెంటును సమావేశం చేయడానికి ఒప్పుకున్నది. మండల పాలక సంఘాలు చేసిన మొదటిపని ఏమిటంటే, గడచిన పదేళ్లు గా దేశాన్ని నిరంకుశంగా పాలించిన ఆస్ట్రియన్ అధికారులను బర్తరఫ్ చేయడం.

పార్లమెంటు ఎన్నికలు జరిగాయి 300 స్థానాలలో 270 స్థానాలూ డీక్ పక్షానికి లభించాయి. ఈ పారమెంటు బుడా నగరం కోటలో సమావేశం కావాలని ప్రభుత్వం ఆజ్ఞాపించింది. కాని సభ్యులు "1848 సం॥పు రాజ్యాంగం ప్రకారం మేము పెస్ట్ నగరంలో సమావేశం కావాలి. అక్కడే సమావేశమవుతా" మన్నారు. ఆస్ట్రియన్లు మొదట వ్యతిరేకించినా చివరికి లొంగారు. వారి లొంగుబాటు తమకు గొప్ప విజయంగా హంగరీ భావించింది. పార్లమెంటు సభకు సభ్యులు జాతీయ వేషాల్లో హాజరయ్యారు. చక్రవర్తి ఈపార్లమెంటుకు సందేశంపంపిస్తూ కొన్ని చిల్లర విషయాలను మాత్రమేఇక్కడ నిర్ణయించవచ్చనీ, ముఖ్య విషయాలను నిర్ణయించడానికి కొందరు ప్రతినిధులను వియన్నాలోని పార్లమెంటుకు పంపించాలనీ ఉత్తర్వు చేశాడు.

ఈఉత్తర్వును హంగేరియన్ పార్లమెంటు తిరస్కరించింది. హంగరీకి రాజుగా ఉండాలంటే ఆస్ట్రియన్ చక్రవర్తి బుడా వచ్చి అక్కడ పట్టాభిషిక్తుడు కావలసిందేననీ, తమ రాజ్యాంగాన్ని గుర్తించాలనీ వారు సమాధానం పంపారు.

చక్రవర్తికి కోపం వచ్చి హంగేరియన్ పార్లమెంటును రద్దుచేశాడు. పార్లమెంటు భవనాన్ని ఆస్ట్రియన్ సైనికు లాక్రమించుకుని సభ్యులను తరిమి వేశారు. డీక్ వెనక్కి తిరిగి పోతూ "ఏమిటి విశేషం" అని ఒకర దగ్గా "ఆస్ట్రియా యుద్ధం ప్రకటించింది" అని సమాధానం చెప్పాడు.

పార్లమెంటును రద్దుచేసినందుకు దేశంలోని మండల పరిపాలక సంఘాలన్నీ అసమ్మతి తెలిపాయి. ప్రభుత్వం వాటిని కూడా రద్దుచేసి మిలిటరీ పరిపాలన నెలకొల్పింది.

హింసాత్మక చర్యలకు దిగవద్దని డీక్ తన ప్రజలకు సందేశం ఇచ్చాడు. "మనకు ఆయుధాలు లేవు. కనుక మనం న్యాయమే ఆయుధంగా పోరాడుదాం. బాధలు పడవలసివస్తే తలవంచకుండా బాధలు పడదాం," అని అతడన్నాడు. శాంతియుతంగా ప్రతిఘటించమని ప్రజలకు చెప్పాడు. దేశం అతని సందేశం శిరసావహించింది. ప్రజలు పన్నులు కట్టడం మానివేశారు. పన్నులధనాన్ని వసూలు చేయడానికి ప్రజల ఆస్తిని పోలీసులు వేలం వేయబోతే కొనడానికి ఏ హంగేరియనూ ముందుకు రాలేదు. ఆస్ట్రియానుంచి కొనే వారిని పిలిపించవలసి వచ్చింది. పన్నులధనం కంటె దాన్ని వసూలుచేయడాని కయ్యే ఖర్చెక్కువ అని ప్రభుత్వం గ్రహించింది. ఆస్ట్రియన్ సైనికులను హంగేరియన్ గృహాల్లో అట్టేపెట్టి బాధపెట్టడానికి ప్రభుత్వం ప్రయత్నించింది. కాని అదీ నెగ్గలేదు.

చివరికి వియన్నాలో ఇంపీరియల్ పార్లమెంటు సమావేశమైతే ఒక్క హంగేరియన్ ప్రతినిధి కూడా హాజరుకాలేదు. వియన్నా ప్రభుత్వం యూరప్ అంతటా నవ్వుల పాలైంది.

"ఆస్ట్రియా వేచిఉండి చివరికి గెలుస్తుంది" అని కొత్త ఆస్ట్రియన్ మంత్రి వాన్ ష్మెర్లింగ్ అన్నాడు.

"మేము వేచి వుంతకాలం మీరు వేచి ఉండలేరు" అని డీక్ బదులు చెప్పాడు.

## హంగరి విజయం

హంగేరియన్లు ఆస్ట్రియన్ పరుకులను బహిష్కరించడం ఆస్ట్రియాకు దుస్సహమైంది. జైళ్ళన్నీ హంగేరియన్ సత్యాగ్రహులతో నిండిపోయాయి. వారందరినీ భరించలేక ప్రభుత్వం మళ్లీ అందరినీ విడుదల చేయాల్సివచ్చింది.

హంగేరియన్ పార్లమెంటు రద్దయినప్పటినుంచీ ఆసభ్యులు వ్యవసాయ సంఘమనీ, పారిశ్రామిక సంఘమనీ, సాహిత్య సంఘమనీ పేర్లుపెట్టుకొని సమావేశమవుతూ ఉన్నారు. ఆవిధంగా వారు స్వాతంత్ర్యం కోసం ఆందోళన చేయసాగారు.

ఇంతలో ప్రష్యాతో ఆస్ట్రియాకు యుద్ధం సంభవించింది. అప్పుడు ఆస్ట్రియాకు హంగరీ స్నేహం అవసరమైంది. "మా రాజ్యాంగాన్ని పునరుద్దరిస్తే మేము మీకు సహకరిస్తాము" అని డీక్ సమాధానమిచ్చాడు.

హంగరీ సహాయం లేకుండా యుద్ధానికి దిగడం మంచిది కాదని చక్రవర్తి భావించాడు. హంగరీతో రాజీపడక తప్పలేదు. 1865 సెప్టెంబరు 20 న ఇంపీరియల్ (ఆస్ట్రియన్) పార్లమెంటును రద్దుచేస్తూ, హంగరీని ప్రత్యేక దేశంగా గుర్తిస్తూ, హంగేరియన్ పార్లమెంటును పునరుద్ధరిస్తూ చక్రవర్తి ప్రకటన వెలువడింది.

కొత్త పార్లమెంటుకు ఎన్నికలు జరిగాయి. 388స్థానాల్లో డీక్ పక్షానికి 200 లభించాయి. డిసెంబరు 14 న చక్రవర్తి పార్లమెంటును ప్రారంభం చేశాడు. హంగేరియన్ దుస్తుల్లో ఆయన హాజరై, హంగేరియన్ భాషలో ప్రసంగించాడు. అందరూ హర్షధ్వానాలు చేశారు. కాని డీక్ మౌనంగా ఉన్నాడు. నిజానికి చక్రవర్తి హంగరీకి ఇచ్చిన కొత్త హక్కులేమీ లేవు. హంగరీకి పరిమితాధికారాలున్న పార్లమెంటు ఉంటుందనీ, వియన్నాలో ఇంపీరియల్ పార్లమెంటే అన్నీ నిర్ణయిస్తుందనీ, రాజ్యాంగం గుర్తించబడదనీ, ఆ ప్రసంగ సారాంశం. డీక్ నాయకత్వాన పార్లమెంటు చక్రవర్తి చెప్పిన దాన్ని తిరస్కరించింది. చక్రవర్తి ఇంతకంటె తాను ఏమీ చెయ్యలేనని వియన్నాకు వెళ్ళిపోయాడు.

1866 జూన్‌లో ప్రష్యా ప్రమాదం అధికమైంది. ప్రష్యన్ సైన్యాలు ప్రాగ్ లో ప్రవేశించాయి. చక్రవర్తి డీక్‌ను వియన్నాకు పిలిపించి "నన్నేం చేయమంటావు?" అని అడిగాడు.

"మాహక్కులను మా కివ్వండి" అని డీక్ జవాబిచ్చాడు.

"హంగరీకి రాజ్యాంగాన్ని ప్రసాదిస్తే మాకు యుద్ధంలో సహాయపడతారామీరు?" అని చక్రవర్తి అడిగాడు.

"మా స్వాతంత్ర్యం అలా అమ్ముడుపోయే వస్తువుకా"దని డీక్ అన్నాడు.

చక్రవర్తి మారుమాటాడ లేదు. డీక్ తిరిగి హంగరీ వచ్చేశాడు.

ఆస్ట్రియా యుద్ధంలో ఓడిపోయింది. చక్రవర్తికేమి చెయ్యడానికీ తోచలేదు.

1866 డిసెంబరు 15 న హంగేరియన్ పార్లమెంటు చక్రవర్తికొక మహజరు పంపించింది. దాన్ని డీక్ తయారుచేశాడు. ఈమహజరును చక్రవర్తి తిరస్కరించి, హంగరీలో సైనిక సమీకరణను నిర్బంధం చేశాడు.

హంగరీ అట్టుడికినట్లు ఉడికిపోయింది. సాయుధ విప్లవం చెలరేగకుండా చెయ్యడానికి డీక్ శాయశక్తులా పని చేశాడు. హంగరీనుంచి "ఆఖరి మహజరు"ను పంపించాడు. నిర్బంధ సైనిక సమీకరణను రద్దు చేయవలసిందని కోరాడు.

చక్రవర్తి ఏకళనున్నాడోగాని ఈ మహజరును అంగీకరించాడు. సైనిక సమీకరణను రద్దుచేశాడు. హంగేరియన్ల కోరికలన్నిటినీ అంగీకరిస్తానని వాగ్దానం చేశాడు.

1848 లో హంగరి స్వాతంత్ర్య కోసం పోరాడిన జూలియస్ ఆండ్రాసీని చక్రవర్తి వియన్నాకు పిలిపించాడు జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోవలసిందని అతన్ని చక్రవర్తి కోరాడు.

# ★ హంగరీ సహాయనిరాకరణం ★

అప్పుడు హంగరీ తరఫున డీక్ ఆస్ట్రియాతో సంధి చేసుకున్నాడు. హంగరీ రాజ్యాంగాన్ని, స్వాతంత్ర్యాన్ని గుర్తించడానికి చక్రవర్తి సమ్మతించాడు. హంగరీ నుంచి పారిపోయి ప్రవాసంలో ఉన్న వారందరినీ తిరిగి పిలిపించాడు. 1867 జూన్ 8వ చక్రవర్తి పెస్ట్‌కు వచ్చి రాజ్యాంగాన్ని గుర్తిస్తున్నానని ప్రకటించేసరికి దేశమంతా ఆనంద సాగరంలో ఓలలాడింది.

## మహాత్ముడు, మహాపురుషుడు

ఫ్రాన్సిస్ డీక్ మాత్రం స్వాతంత్ర్యోత్సవాలలో పాల్గొనలేదు. అతడు నిరాడంబరుడు. హంగరీకి 'రక్షకుడు' గా ఉండవలసిందని పార్లమెంటు అతన్ని కోరింది. కాని అతడు నిరాకరించాడు చక్రవర్తి "నేను డీక్‌ను ఎలా గౌరవించగలను?" అని జూలియస్ అండ్రాసీని అడిగాడు "ప్రభూ! మీ ధన కనక వస్తువాహనాలతో ఇతరులను గౌరవించగలరుగాని డీక్‌ను గౌరవించలేరు" అని అతడు బదులు చెప్పాడు. అప్పుడు చక్రవర్తి తాను, తనరాణి తీయించుకున్న ఫోటోను డీక్‌కు కానుకగా పంపాడు. డీక్ అదికూడా అక్కరలేదన్నాడు. "మరి నా గౌరవాన్ని ఎలా వెల్లడించుకోమంటావు?" అని చక్రవర్తి అడిగితే, డీక్ "నేను చనిపోయాక ఫ్రాన్సిస్ డీక్ మర్యాదస్తుడని అనండి, అది నాకు చాలు" అని చెప్పాడు.

డీక్ ప్రధానమంత్రి పదవిని, సామాన్య మంత్రి పదవినికూడా అక్కర్లేదన్నాడు. కెహిలాలో ఉన్న తన స్వగృహానికి వెళ్ళిపోయి ప్రశాంతంగా జీవితం గడపదలిచాడు. పార్లమెంటులోనైనా ఉండవలసిందని దేశం ప్రార్థించవలసి వచ్చింది. అయిష్టంగా దాని కంగీకరించాడు. తొమ్మిదేళ్ళపాటు సామాన్య సభ్యుడుగా ఉన్నాడు కాని ఏ మంత్రికీ లేని గౌరవం, అధికారం అతడు పొందాడు.

1876 లో అతడు మరణించినప్పుడు దేశం శోకనిమగ్నమై పోయింది. అతనిశవం వీధుల్లో వెడుతుంటే పౌరులు మోకరిల్లి వందల ఏడ్చారు. హంగరీ రాణికూడా విలపించింది. డీక్ తన యావజ్జీవితమూ ఎవరితో పోరాడాడో ఆ రాజుగారే "ఒక మహాత్ముణ్ణి, మహాపురుషుణ్ణి మనం పోగొట్టుకున్నాము" అని గోడించాడు.

ఈ విధంగా డీక్ హంగేరియన్ స్వాతంత్ర్యోద్యమాన్ని శాంతియుతంగా నడిపించాడు. ఈ ఉద్యమానికీ మనదేశంలో జరిగిన సత్యాగ్రహోద్యమానికీ చాలా పోలికలు కనిపిస్తాయి

నిరంకుశత్వాన్ని ప్రతిఘటించడానికి నిరంకుశశక్తిని సంహరించవలసిన అవసరం లేదు. అతని నిరంకుశత్వానికి సహాయాన్ని నిరాకరించడమే సరైనమార్గం. ఈ మార్గాన్ని గాంధీమహాత్ముడు మనదేశంలో అనుసరించి ఫలితాలు సాధించినట్లే, ఆ నాడు ఫ్రాన్సిస్ డీక్ అనుసరించి తనదేశానికి స్వతంత్ర ప్రతిపత్తిని సాధించిపెట్టాడు. ★

# మంత్రాలు; నమ్మకాలు

[32 వ పేజీ తరువాయి]

కాని అతడు భయపడి 15 రోజులు అదురు జ్వరం తగిలిన వ్యక్తి కావడంచేత రా నిరాకరించాడు. కాని నవరాత్రులు ఎట్లా జరుపాలో చెప్పాను. ఆ తతంగం అంతా జరిపాను. గురదగొండిపాడి సహాయంతో నే దయ్యాన్ని ఆఖరురోజున మళ్ళీలేపాను. ఫలానాచోట పడిపోవాలని ఆజ్ఞాపించాను. ఆవిధంగానే పడిపోయింది. దయ్యం పోయింది. నాకు ఘనంగా కట్నం యిచ్చారు. అప్పటినుంచి భూతవైద్యుణ్ణి అయ్యాను. భూతవైద్యుడికి కావలసినది ధైర్యం, యుక్తి, తంత్రం మాత్రమేనని, మంత్రాలు అవసరములేదని తెలుసుకున్నాను మూఢనమ్మకాలతో నున్న రోగి యొక్క మనస్సులో జేరిన అనుమాన పెను భూతాన్ని పారద్రోలడమే భూతవైద్యుని యొక్క తెలివితేటలు. అయితే రోగికి దయ్యంపట్టిందని అనుమానం యేర్పడినపుడు ఆ దయ్యాన్ని మంత్రములచే కట్టివేయగల వైద్యుడే బాగుజేయగలడని మూఢనమ్మకం యేర్పడడం సహజం. అందువలననే నేను ఆ దయ్యాన్ని కట్టివేయ గలిగినట్లుగా ఆరోగివన్ను గుర్తించినందుననే నేను అతనికున్న మనోవ్యాధిని బాగుచేయ గలిగాను. అంతే గాని నాకు మంత్రాలు రావు. వాటిమీద నాకు యిప్పటికీ నమ్మకంలేదు. మంత్రాలన్నా, దయ్యాలన్నా నేను పూర్తి వ్యతిరేకినే.

చాగంరెడ్డి నరసింహారెడ్డి.
వేలేడుపల్లెగ్రామం (నెల్లూరు జిల్లా.) ★



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.

# చెమట దుర్గంధమునకు, సామాన్య చర్మ వ్యాధులకు

## వైజ్ఞానికంగా సరి క్రొత్తగా కనిపెట్టబడినది

# ఎక్‌టమర్

## ఇప్పుడు భారతదేశమందు, సౌందర్యమునిచ్చు సబ్బులో నున్నది

చర్మ క్రిములను చంపునట్టి ఔషధములు. మంచివి. చెడ్డవి చాలా కాలమునుండియు తెలిసియున్నవే క్రొత్తదేమిటనగా. చాలా కాలము విలవుండునట్టి గుణము గలది అట్టి కనిపెట్టబడినది. మాన్‌సెన్‌టొవారి 'ఎక్‌టమర్' (బైత్యోనాల్) ఈనాడు మీరు భారతదేశమందు 'ఎక్‌టమర్'తోగూడిన టాయిలెట్ సబ్బును కొనగలరు అది బ్రీజ్. ఆలోచించండి — మీరు ప్రతి రోజూ ఉపయోగించుచూ బ్రీజ్‌ను వి బిళ్లలవరకూ మాత్రమే వాడిన తరువాత మీ చర్మము దాదాపుగా క్రిమిరహితమైన దగును మీరు క్రిమిరహితమైన చర్మమువల్ల ఏమి లాభమును పొందెదరో దిగువ వివరింపబడినది

- చెమట దుర్గంధము తొలగింపబడును — చర్మ క్రిములు దానిని కలిగించును
- చర్మ వ్యాధులనుండి రక్షణ — ఈ క్రిములు సామాన్యమైనట్టి అనేక చర్మ వ్యాధులను గలిగించును

మీరు బ్రీజ్‌ను ఇష్టపడెదరు — దీని విషయంలో కొంత ఎక్కువ ప్రత్యేకత గలదు. ఇది పరిమళమైనట్టి, శమనకరమైన. సౌందర్యమునిచ్చు సబ్బు. ఇది చర్మమును కాపాడునట్టి 'ఎక్‌టమర్'ను గలిగియున్నది. బ్రీజ్ ఇతర సబ్బులకంటె కొంచెమే ఎక్కువ ఖరీదుండును. మీరు దీనిని చాలా కాలము వరకూ ఉపయోగించుకొనవచ్చును.

నేడే బ్రీజ్‌ను కొనుడు




ఈ సౌందర్యమునిచ్చు సబ్బు ప్రత్యేకమైనది — అది బ్రీజ్

# బ్రీజ్

## టాయిలెట్ సబ్బు

## 'ఎక్‌టమర్'ను గలిగియున్నది

ఇరాప్‌మిక్ కంపెనీ లిమిటెడ్ లండన్ వారి తరపున భారతదేశంలో తయారుచేయబడినది